# సుభాషితరత్నాకరము



యభాషాప్రవీణ,

పింజల సుబ్రహ్మణ్యకవి.

# సుభాషిత రత్నాకరము




బెజవాడ పురపాలక సంఘోన్నత పాఠశాల
వాంధ్రోపాధ్యాయులు, ...
శతావధానులు నగు
పండిత

## శ్రీ పింజల సుబ్రహ్మణ్యకవిగారిచే

రచింపఁబడినది.

ప్రథమ ముద్రణము ౧౦౦౦ ప్రతులు.

బెజవాడ ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలయందు
శ్రీ కపిలవాయి సేతుమాధవరావుగారిచే
ముద్రింపఁబడెను.
విక్రమసంవత్సర విజయదశమి.
౧౯౨౦.

 [మూల్యము రు ౧-౦-౦

# FOREWORD.

It is with great pleasure that I write this Foreword to the Gems of Wisdom in Telugu verse, entitled 'Subhashita Ratnakaramu.' The author Ubhayabhasha Praveena Mr. P. Subrahmanya kavi, Telugu Pundit of our High School, deserves every congratulation. He combines, in the work, the experience he has gained as a teacher with the scholar-ship he has acquired through self-culture, conceived with fore-thought and executed in neat and simple style, the book deserves to be placed in the hands of every pupil of ou Secondary and Elementary Schools.

The easy flow of verse and the aptness of illustration, serve to enhance the charm and the usefulness of the book.

I make no doubt that this gains immense popularity before long, serving as Text-Book to impart moral as well as secular instruction I wish the author every success.

Municipal High School,
BEZWADA,
6—12—1935.

(Sd.) A. GURUMURTI.
B. A., L. T.,
*Headmaster*




గ్రంథకర్త:

శ్రీ పింజల సుబ్రహ్మణ్యకవి గారు.



శ్రీ కుంటెము సత్యనారాయణమూర్తిగారు

ఈ గ్రంథ ముద్రణమునకు నూటపదారు రూప్యంబుల

నొసంగిన రసికవదాన్యులు.

శ్రీ జాన మూలయ్యగారు, పాలకొల్లు. (ప. గో. జిల్లా.)

సీ॥ పిల్లికి బిచ్చంబుఁ - బెట్టఁజాలని లోభి
జనులఁ బుట్టించెదు - జడత వోవఁ
బల్కరించిన మండి-పడెడు పాపిష్ఠులఁ
గల్పించునట్టి దు-ష్కర్మలోలఁగ
ధనధాన్యములఁ జూచు-కొనుచుఁ బొంగెడు నహం
కారుల సృష్టించు - కలుషమడఁగ
మంచిచెడ్డల విచా-రించనేరక మూఢ
మతుల నిర్మించు దు-ర్గతి నశింప
తే॥ గీ॥ త్యాగమును, శాంతమును, వినయము, వివేక
ముక్క-చోఁగూర్చి యేరూప-మొందఁజేసి
బ్రహ్మదేవుండు విఖ్యాతిఁ - బడయఁగలిగె
నా సుధీమణి జాన మూ-లార్యమణి.

---

శ్రీ కారుపర్తి కుమారమల్లికార్జునకోరామాచార్యులుగారు
జగన్నపేట, (తూ. గో. జిల్లా.)

సీ॥ సన్నుతాయుర్వేద - సాగరాగస్త్యుఁడై
వెలయునే పరమ వి-వేకశాలి
ప్రథిత దివ్యౌషధ - ప్రకరవిధాతయై
పరగునే నిరత భా-స్వద్యశుండు
సకలామయాసుర - చక్రియు నుండౌచుఁ
జెలువారుచుండునే - లలితగుణుఁడు
కవిజనాంభోజభా-స్కరుఁడన నిరతంబుఁ
దనరారుచుండునే - ఘనమనీషి
తే॥ గీ॥ సంగిత ప్రజ్ఞఁ దగుచు దే-వాంగకుల గు
రూత్తమత్వంబుఁగాంచె నే నరోత్తముండు
అట్టి శ్రీ కారుపర్తి వం-శాబ్ధి విధుఁడు
మల్లికార్జునకోరామ - మాన్య బుధుఁడు.

## శ్రీ భట్ట జ్ఞానకోటయ్యగారు, పెడన. (కృ. జిల్లా)

సీ॥ బహుళమౌ ధనము సం-పాదించుటే గాక
త్యాగమూర్తి యనంగఁ ♦ దనరు నట్టి
అత్యంత మర్యాద - లందుచుండుటె గాక
సకల మర్యాదఁ గా-పాడునట్టి
గౌరవోద్యోగముల్ - గాంచుటేగాక స
ర్వోద్యోగి మిత్రుఁడై - యొప్పునట్టి
కులములో మేటియై - వెలయుచుండుటెగాక
స్వీయజాతికి సేవఁ - జేయునట్టి

తే॥ గీ॥ అనుదినాభ్యర్చిత కుమారుఁ - డగు కుమారు
నాకుమారాహ్వయుని గాంచి - యలరునట్టి
భట్ట వంశాబ్ధి శశిమూర్తి - ప్రథితకీర్తి
జ్ఞానకోటార్య ఘనుఁడు వి- జ్ఞాన ధనుఁడు.

---

## శ్రీ జాన వీరభద్రయ్యగారు, మోరి, తూ. గో. జిల్లా.
## శ్రీ పిచ్చిక దాసుమయ్య, వెంకన్న గార్లు, బండారులంక

చ॥ ఘనతర జానవంశ తిల-కంబు, గుణాఢ్యుఁడు, శంకరార్యనం
దనుఁడగు వీరభద్రుఁడు, సు-దారులు పిచ్చిక దాసుమయ్య వెం
కనలుఁ, వదన్యులై మదన-ఖండము దంబు వహించి కూర్మి పెం
పున ధనమిచ్చి ముద్రణముఁ - బూర్తియొనర్చిరి కీర్తినిండఁగన్.

కం॥ వీరలకు సర్వజగదా
ధారుఁడు, సుజనావన ప్ర-ధానగుణాలం
కారుఁడు దీర్ఘాయుర్విభ
వారోగ్య యశంబు లొసఁగు - నతులితకరుణన్.

---

# పండితాభిప్రాయములు.

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయ పండితులు
శతావధానులు నగు కావ్య కళానిధి
శ్రీ పిశుపాటి చిదంబరశాస్త్రి గారు.

మ॥ మతిమంతుల్ గొనియాడఁగాఁ దగిన వాఙ్మాధుర్య విస్ఫూర్తి, సం
స్కృతమూలంబును జప్తికిం గొలుపు ఫక్కిన్ దెన్గునన్ ధీసమ
గ్రతవాటిల్లునటుల్ రచించితివి సుబ్రహ్మణ్య! నీ యీ సుభా
షిత రత్నాకర మంతిరాంగమునకుం జేకూర్చె సమ్మోదముల్.

మ॥ స్తుతి కగ్రంబగు నీతు లెంచుట, గుణస్తోమంబు రంజిల్లుటన్
బ్రతిపద్యం బుపమాన యుక్తముగ నుండుటం బిన్నలుం బెద్దలున్
సతతంబున్ బఠియింప నొప్పు వివిధజ్ఞాన ప్రదంబౌ సుభా
షిత రత్నాకర మెల్లకాలమును వాసిం గాంచెడుం గావుతన్.

పిశుపాటి చిదంబరశాస్త్రి.

---

బెజవాడ గవర్నమెంటు ట్రెయినింగ్ స్కూల్ హెడ్ మాస్టర్,
శ్రీ ఆచంట రామబ్రహ్మం పంతులుగారు, బి. ఏ. ఎల్. టి.

నేను సుభాషిత రత్నాకరము జూచితిని. బెజవాడ మ్యునిసిపల్ హైస్కూలు ఆంధ్రపండితులగు ఉభయభాషాప్రవీణ శ్రీ పింజల సుబ్రహ్మణ్య కవిగారిచే మృదుమధుర శైలితో స్వాభావికమైన కవిత్వధారతో సులభమైన తేటతెనుఁగు మాటలతో పామరులకుఁ గూడఁ దోయు నుదాహరణములతో నీతులు బోధింపఁబడినవి. ఉపాధ్యాయులకు విద్యార్థులకు మిక్కిలి యుపయోగముగా నుండఁగలదు.

Govt. Training School
Bezwada
6—2—35

A. RAMABRAHMAM,
B. A. L T,
Head Master.

బెజవాడ హిందూహైస్కూల్ హెడ్ మాస్టర్
శ్రీ కోతారు రామారావుపంతులు గారు. ఎం. ఏ. ఎల్. టి.

శ్రీ పింజల సుబ్రహ్మణ్యకవిగారు రచించిన సుభాషితరత్నాకరము నందక్కడక్కడఁ గొన్ని పద్యములు చదివితిని. విద్యార్థుల కుపయుక్తము లగు ననేకవిషయములు చక్కఁగ బోధింపఁబడినవి. నూతనోపమానములు పెక్కులుగలవు. ప్రాథమిక మాధ్యమికపాఠశాలలయందుఁ గడు నుపయోగకరము.

Hindu High school
Bezwada
9—12—35.

KOTARU RAMARAO,
M. A. L. T.
Head Master.

---

మదరాసు క్రిస్టియన్ కాలేజి పండితులు శతావధానులు నగు
కవిభూషణ విద్వాన్
శ్రీ దోమా వెంకటస్వామిగుప్త గారు.

మ॥ హితముం జెప్పెడు పట్టునన్ బ్రియము నై ♦ యేపారఁగాఁ జేయు టీ
క్షితిఁగష్టంబని యందు రయ్యెఁ బ్రియమై ♦ చెల్వొందునట్లున్ సుభా
షితరత్నాకరమున్ సహస్రమితమై ♦ చెన్నొందుపద్యాళిసా
రతరంబై తగవ్రాసె మిత్రమణి సు♦బ్రహ్మణ్య ధీరుఁడోగిన్.

శా॥ వేమన్నన్, సుమతిన్, జయాఖ్యకృతిక♦ర్తన్ భాస్కరున్, బంచతం
త్రామేయప్రతిభున్ మనంబునకుఁ బ్ర♦త్యక్షీకరింపంగఁదా
నేమాత్రంబునులోఁగదీకృతియనన్ ♦ హృద్యార్థ హృద్యంబుగా
నీమాద్యత్కృతి వ్రాసినట్టిఁడు మదీ♦యేష్టాత్ముఁడే తాదృశ
శ్రీమవ్వంబుగ నెన్నియోకృతుల నర్థన్ వ్రాసియాంధ్రస్థలిన్
బ్రామాణ్యంబగు కీర్తనొందు సుకము ♦ గాంచున్ రమేశాదృతిన్.

మకాం-కంచి
20—5—40.

దోమా వెంకటస్వామిగుప్త.

సరసకవిశేఖరులును, బహుగ్రంథకర్తలు నగు

శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు.

శ్రీ పింజల సుబ్రహ్మణ్య కవిగారికి దీవించి వ్రాయునది అయ్యా! మీరుదయతోఁ బంపిన సుభాషితరత్నాకరము చేరినది. ఈదినయినసే చదివించుకొని విని యానందించితిని. కవిత్వము సరసమై పాఠకులకు సంతోషకరమైయున్నది. దృష్టాంతములుఁగూడ మిక్కిలి మనోహరములుగా నున్నవి. ఇది ప్రాథమిక మాధ్యమిక పాఠశాలల విద్యార్థులకు మిక్కిలి యుపయోగపడును. ఇట్టి చక్కని గ్రంథములు మఱికొన్ని రచియించి యాంధ్ర సారస్వతమును బెంపొందింతురుగాక.

రాజమహేంద్రవరము, 30—3—37. చి. లక్ష్మీనరసింహం.

---

ఆంధ్ర విశ్వవిద్యాలయ గౌరవాధ్యక్షులు, వదాన్య శేఖరులు, "సాహిత్య సమ్రాట్" బిరుద విభ్రాజమానులు, సరసకవి పండితసత్తములు నగు

శ్రీ శ్రీ శ్రీ జయపుర మహారాజా బహద్దర్

విక్రమ దేవవర్మగారు.

ఉభయభాషా ప్రవీణ, పండిత, శ్రీ పింజల సుబ్రహ్మణ్యకవి విరచితమగు "సుభాషిత రత్నాకరము" ౯౯౬ గీతిరతనములతోఁడ నొప్పుచున్నది. అందు నేను గొన్ని గీతులను మాత్రమే చదివితిని. అవి సలక్షణ మృదుపదయుతములగుచుఁ జక్కని నీతులను వెల్లడించుచున్నవి. కనుక నిప్పొత్తము పాఠశాలలందుఁ బాఠ్యపుస్తకముగా నుండఁదగును.

మకాము "హవామహలు"
విశాఖపట్టణము.
౨-౨—౯—౪౦.

ఇట్లు,
శ్రీ విక్రమదేవవర్మ.




శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కర్తలు, సుప్రసిద్ధ
విమర్శకులు నగు కళాప్రపూర్ణ

**శ్రీ జయంతి రామయ్య పంతులుగారు.**

(రిటైర్డు డిప్యూటీ కలెక్టర్)

మహాశయా! నమస్కారములు. తాము పంపిన "సుభాషిత రత్నాకరము" ప్రతి చేరినది. కొన్ని పద్యములు చదివి చూచినాఁడను. మొత్తము మీఁద మీరచనయు, శైలియు మిక్కిలి బాగుగ నున్నవని నా యభిప్రాయము.

ముక్తీశ్వరము,
30—9—40.

చిత్తగింపుఁడు,
జి. రామయ్య.

---

శ్రీకృష్ణ భారతాది శతాధిక గ్రంథకర్తలు, కనకాభిషిక్తులు, కవిగండపెండేర
విరాజితులు, మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ
కవిసార్వభౌమాంధ్ర వ్యాసాది బిరుద విభూషితులు నగు,

**శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు.**

శ్రీమదుభయభాషాప్రవీణ శ్రీపింజల సుబ్రహ్మణ్యకవిగారు రచించిన "సుభాషితరత్నాకర"మను గ్రంథమును స్థాలీపులాకన్యాయముగాఁ జదివిచూచితిని. ఇది 996 గీతములతో నలరారుచున్నది. ఇందలి సుభాషితములు రత్నముల వలెనేయున్నవి. కావున దీనికి రత్నాకరసంజ్ఞ సమంజసముగానున్నది. శైలిమృదుమధురముగానున్నది. కంటుపడుట యేపద్యమునందును లేదు. ఈసుభాషితములు చిన్నగీతపద్యములలో నుండి పాఠశాలలలోని బాలకులకేగాక యెల్లవారికిని సుబోధకములగుటంజేసి యిదిపరమోపకారకమగునని తలంచుచున్నాను. మఱియు నిందలి సుభాషితంబులు నాఁబడు దృష్టాంతములు భాస్కరశతకాదులం గలయట్టివే గాక ఇప్పటి లోకంబు ననుసరించినవియు నెన్నో యున్నవి. ఇవియన్నియుఁ జేర్చికూర్చుటలో నిక్కవి మిక్కిలి పరిశ్రమము చేసియుండెననియు నిదిలోకోపకారకమైన గ్రంథమనియు నేను బ్రశంసించుచున్నాను.

రాజమండ్రి
3—10—40

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

లక్కవరపు ఎస్టేటు జమీందారులు, శతగ్రంథకర్తలు,
"హోలీ బైబిల్" పద్యకావ్య రచయితలు, అష్టావధానులు,
సరసాగ్రేసరులు, కవిపోషకులు నగు

శ్రీ శ్రీ శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు
బహద్దరు జమీందారుగారు, ఎఫ్. ఎ. యు. డి. టి. హెచ్.

కవివర్యా! నీతిరత్నములతోడను, గీతపద్యరత్నములతోడను సుభాషిత ప్రశంసాముఖ తరంగరత్నములతోడను గూడిన మీ కావ్య రత్నము "సుభాషిత రత్నాకర" మనఁదగి యున్నది. నిరుపమానోపమాన భరితంబని వేనోళ్ళ వినుతింపఁబడునని భవద్గ్రంథపద్య సంఖ్యయే నుడువుచున్నది.

చ॥ అమృతము శబ్దజాలమున ♦ నర్థమనోహరవృత్తి మంజులో
పమలను, శ్రీప్రసక్తి గురు♦భావములన్, విమజృంభణంబు దు
ర్దమ ఖల దూషణంబులను ♦ రత్నపటిష్ఠిత కూర్పునందు, దు
ర్గమ విభవంబు శైలిఁగనఁ ♦ గల్పన యొప్పె నపారవైఖరిన్.

మ॥ పలుకుందూఁడియ నేకియేకి ప్రణవ♦ధ్యానంబుతోఁ బద్ద పుం
జిలుగుం దారములాగి, కావ్యవసన ♦ శ్రేష్ఠంబు సృష్టించి, మా
పలుకుం జేడియకిచ్చెఁ గాన్కఁగఁ గవి♦బ్రహ్మల్ ముదంబందఁ బిం
జల వంశంబు తరింప దేవికృప వ♦ర్షప్రాయమై యొప్పుతన్.

క॥ పింజల సుబ్రహ్మణ్యక
విం జతురతవాణీ కావ్య ♦ విసరంబులనో
లింజలుపఁ జేయుచు మనః
కంజమున వసించుఁగాక ♦ కరుణామతితోన్.

ఏలూరు
1—10—40

ఇట్లు సుజనవిధేయుఁడు,
రాజా భుజంగరావు.

శ్రీమదాంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు, "కవిత్వ తత్త్వవిచా" రాది
గ్రంథకర్తలు, విమర్శకాగ్రేసరులునగు
డాక్టర్ శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు,
ఎం. ఏ. (కాంటాబ్) ఎమ్. ఎల్. సి.

The book 'Subhashita Ratnakaramu' by ubhayabhasha Praveena P. Subrahmanya Kavi, Telugu pandit, Municipal High School, Bezwada, is written in good homely style and contains appropriate illustrations of morals inculcated. It will be a useful book in the High Schools.

WALTAIR,
4—10—40.

C. R. REDDY.

అనువాదము.

ఈ "సుభాషిత రత్నాకరము" బెజవాడ ఉన్నతపాఠశాలాంధ్ర పండితులగు ఉభయభాషాప్రవీణ పింజల సుబ్రహ్మణ్యకవిగారిచే రచింపఁబడినది. ఇందు సర్వజన సులభమగు మంచి శైలితో సముచిత దృష్టాంతసహితములగు నీతులు సమకూర్పఁబడినవి. ఇది యున్నత పాఠశాలల కుపయోగముగా నుండును.

సి. ఆర్. రెడ్డి.

---

కవితిలక, కవితా విశారద, విద్వాన్,
శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు.
లెక్చరర్ క్వీన్ మేరీస్ కాలేజి, మైలాపూర్.

కం॥ మంజుల వాగ్వైఖరి సుమ
మంజరులం బోలు నుంచి ♦ మాటలు సరసుల్
రంజిల పింజల కవి పలి
కెం జాలకన గాఁగ నూత్న ♦ కృతి సుకృతమునన్.

మకాము, విజయవాడ.
17_10_1940.

కాంచనపల్లి కనకాంబ.

సుప్రసిద్ధ పండితులు, వివిధ గ్రంథకర్తలు నగు
శ్రీమారేపల్లి రామచంద్రశాస్త్రిగారు.

శ్రీపింజల సుబ్రహ్మణ్యకవి గారు వ్రాసిన సుభాషితరత్నాకరము చదివిచూచితిని. ఇందలి పద్యములు సులభశైలిని మృదుమధురపదములతో దృష్టాంతపూర్వకముగా వ్రాసినారు. దీనివలన లోకజ్ఞానమును నీతియును అబ్బుటకు వీలుకలదు. పాఠశాలాధికారు లీపుస్తకమును వాడి విద్యార్థులకు మేలుకలిగించి కృతి కర్తను ప్రోత్సహింతురుగాక.

౮_౮_౩౭. }
బెజవాడ. }

మారేపల్లి రామచంద్రశాస్త్రి,
తెనుఁగుకుడి తోలికోలువరి.

---

బెజవాడ ఎస్. ఆర్. ఆర్ కళాశాలాంధ్రోపన్యాసకులు, సంస్కృతాంధ్రాంగ్లభాషాప్రవీణులు, ఆధునిక కవిశిఖామణులునగు
శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. ఎం. ఏ.

శ్రీపింజల సుబ్రహ్మణ్యకవిగారు వ్రాసిన సుభాషితరత్నాకరమును జదివి మిక్కిలి యానందించినాను. బహుస్థలములయందలి సూక్తులను సేకరించి యనేకస్థలములఁ దమయూహలనుజొనిపి వీరీగ్రంథమును గడు శ్రద్ధతో విరచించిరి. ప్రతిపద్యమునందును నేదోయొకసామ్యమును గుదుర్చుచునేవచ్చిరి. కొన్నిచోట్లఁదెచ్చిన సామ్యములు మంచియూహాశాలిత్వమును, మేథాపటిమను వెడలఁగ్రక్కు చున్నవి. కవిత్వము సాధువై, సరళమై, కదళీపాకరమ్యమైయున్నది. కొందరు కవులు కథవంక మొగుచూపింతురు. ఈకవికిసుభాషితములందే యెక్కువయాదరము. సభాజనయోగ్యులకు సుభాషితజ్ఞానము మిక్కిలి యవసరమని వీరు చెప్పుచున్నారు. వీరి కవిత నాకు నాలుగైదేండ్లుగాఁ బరిచితమైనది ఈ గ్రంథముయొక్క బహుజనోపయోగము, విద్యార్థిజనోపయోగము వేరుగాఁ జెప్పనక్కఱలేదు. పరమేశ్వరుఁడు వీరికిఁజిరాయురారోగ్యము లొసంగి యింకను బహుగ్రంథములు వ్రాయునట్లు కరుణించుఁగాక యని కోరుచున్నాను.

బెజవాడ, }
21_9_40. }

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ.

కింకవీంద్ర ఘటాపంచానన కళాప్రపూర్ణ విద్వన్మహా
కవీత్యాది బిరుదాంకితులగు శతావధాని,
శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు.

శ్రీ పింజల సుబ్రహ్మణ్య కవిగారికి ఆశీరుభయ కుశలోపరి. మీరు రచించిన సుభాషితరత్నాకరము చేరినది. అక్కడక్కడఁ జదివి చూచినాను. మిక్కిలి చక్కగా నున్నది. ఏవిషయమునందును నాకు లోటు కనఁబడలేదు. కేవల కవికోటిలోఁ గాక మీ రచన మిమ్మును విద్వత్కవి కోటిలోఁ జేర్చుటకుఁ దోడ్పడునని నా యాశయము. గ్రహింపుఁడు.

కడియం. తూ. గో. జి.
1—4—37.

వె॥ శా॥
శతావధాని.

---

బెజవాడ పురపాలకోన్నత పాఠశాలా ప్రధానాంధ్రోపాధ్యాయులు,
“ఉభయభాషాప్రవీణ” “గాయకరత్న” బిరుదాలంకృతులునగు
శ్రీ చిలకలపూఁడి వేంకటేశ్వరశర్మగారు.

శ్రీ పింజల సుబ్రహ్మణ్యకవిగారు రచించిన ‘సుభాషిత రత్నాకర” మను గ్రంథము ఆంధ్ర సరస్వతికొక యమూల్యాపూర్వాలంకారమని చెప్పనగు. ఆంధ్రసారస్వతమునఁ బూర్వులు వ్రాసిన సుభాషిత గ్రంథములున్నవి కాని యవి కుల్యలఁ దటాకములఁ బోలునవి. నేఁడు “సుభాషిత రత్నాకరము లభించుట యాంధ్రుల భాగ్యము. దీనిని పాఠశాలోపయుక్తగ్రంథముగ మాత్రమే యెంచుట భావ్యము కాదు. ప్రతియాంధ్రుడును నిత్యము పఠింపవలసిన గ్రంథమనఁదగు. ఏతద్గ్రంథ పఠనము ప్రతి యాంధ్రుని దైనికజీవితమును జక్కఁజేయు ననుటకు సందేహములేదు. ప్రతి యాంధ్ర సోదరుఁడును బఠించి కవివరుని శ్రమను సార్థకపఱుచునని విశ్వసించుచున్నాను. శ్రీకవిగారిట్టి యుపయుక్త గ్రంథములఁ బెక్కులరచించి యాంధ్రభాషాయోషకు వన్నె దెత్తురని కోరుచున్నాను.

బెజవాడ
10—10—40

ఇట్లు,
చిలకలపూఁడి వేంకటేశ్వర శర్మ.

సంస్కృతాంధ్ర పండితాగ్రేసరులు, సంగీత నాట్యకళా
విశారదులును నగు అవధానిశిరోమణి
శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు.

వత్సా! దీర్ఘాయుష్మాన్ భవ. ఆశీరుభయకుశలోపరి. సుభాషితరత్నాకరమును జూచితిని. కొన్ని పద్యములఁ జదివితిని. చాలనానందించితిని. శైలి మృదుమధురము, నిర్దుష్టము, హృదయరంజకమునై యున్నది. ఈక్రిందిపద్యములఁ గొనుము.

గీ॥ పూర్వకవి పద్యగతభావ ♦ ముల గ్రహించి
వ్రాసితినటంచు వినయభా ♦ వమ్ముఁ జూపఁ
బల్కుటిదెగాని బ్రహ్మంత ♦ వాఁడు నేని
భానునుచ్ఛిష్ట మెఱుఁగని ♦ వాఁడు కవియె. ౧

గీ॥ భావమేలాటి దయినఁగా ♦ వచ్చుఁగాక
మంచియల్లికలోఁ జేరి ♦ మహిమఁ గాంచు;
పాలుపుతేనట్టి యుమ్మెత్త ♦ పూవెగాని
అర్ధనారీశుతలఁజేరి ♦ యతిశయిల్లు. ౨

గీ॥ అల్లికలసొంపు, మొల్లలఁ ♦ జల్లునింపు
నల్లసిల్లు కవితయె రం ♦ జిల్లుఁగాని
భావమెవ్వరు చూతురి ♦ ప్పట్లఁ గవికి
వలయు యోగ్యతలన్నియుఁ ♦ గలవు నీకు.

గుంటూరు
24—9—1940

ఇత్యాశిషః,
కా॥ కృ.

# మనవి.



ఆంధ్ర మహాశయులారా !

ఎన్ని విద్యలు నేర్చినను, ఎన్ని చదువులు చదివినను, ఎన్ని సంపదలఁ బొందినను సత్ప్రవర్తనము లేక మానవజన్మ సఫలము కాదు. సత్ప్రవర్తనమునకు నీతిబోధ యవసరము. నీతి బోధకు సుభాషితములత్యావశ్యకములు. సుభాషితములు దృష్టాంత సహితములైననే సొంపునింపును. కావున దృష్టాంత సహితములగు సుభాషిత గ్రంథములు ప్రజల కత్యంత ప్రయోజనకరములు. అవి మిక్కిలిగా నున్నను లోకమునకు వెక్కసములుగావు. కాని యాంధ్రభాషలో నట్టివి చాలయరుదు. చంపకోత్పలాది దీర్ఘవృత్తకలితములై, ప్రౌఢ కవిత్వమున నొప్పుచుఁ బ్రసిద్ధములైన భాస్కరశతకము, సూక్తివసుప్రకాశకము నీతరగతిలోఁ జేరినవే. ప్రజలలో భాషాపండితులసంఖ్య పరిమితముగాన సత్ప్రవర్తనము సమకూర్చుటకు సర్వజనసులభమగు శైలియు, సరళమగు ధారయుఁ గల చిన్న చిన్న పద్యములే యెక్కువగాఁ దోడ్పడఁగలవు. ఇట్టియుద్దేశమును మనమునందిడికొని సుభాషితరత్న భాండాగారాది సంస్కృత గ్రంథములయందలి కొన్ని శ్లోకముల భావములను గ్రహించియు, లోకవృత్తము ననుసరించి కొన్ని సుభాషితములును దృష్టాంతములును స్వయముగాఁ గల్పించియు నీగ్రంథము రచింపఁబడినది. ప్రస్తుతము ముద్రింపఁబడిన ౯౯౭ పద్య

ములుగాక మఱికొన్నియుఁ గలవు. ముద్రణవ్యయమధిక ముగానున్న యిక్కాలమున సంపూర్ణముగాఁ బ్రకటింప నశక్తుఁడ నైతిని. కాని తమయాదరాతిశయముచే మిగిలినవానిని గూడ నచిరకాలమున ముద్రింపఁగలనని విశ్వసించుచున్నాను.

ఇది కేవలనీతిబోధక గ్రంథమైనను బ్రజలలో శృంగా రహాస్యచమత్కారముల నభిలషించు వారధిక సంఖ్యాకులు గాన నట్టివారికిని రుచించునట్లు శృంగార హాస్యాదులు నీతితో మేళవించి రచింపఁబడిన పద్యములు పెక్కులుగలవు. ప్రధాన ముగా సుభాషిత ప్రశంస, కవిత్వము, సుకవి, కుకవి, సరసుఁడు, విరసుఁడు, లోభి, యాచకుఁడు, ప్రభువు, ధనము, దారిద్ర్యము, సంపద, వార్ధకము, ప్రకీర్ణకము నను శీర్షికలుగల పద్యములం జదివిన విశదమగును.

ఈగ్రంథము నాదరముతో నవలోకించి తమయమూ ల్యాభిప్రాయముల నొసంగిన సుప్రసిద్ధకవులు, పండితులు, విమర్శకులు, రసికులు, ప్రభువులు నగు మహనీయులకును, ధనసాహాయ్య మొనరించి ప్రకటింపఁ జేసిన పరోపకార తత్పరులగు దాతలకును నాకృతజ్ఞతా వందనములు. దీనిం జది వియుఁ జదివించియు నాశ్రమంబు సఫలంబు గావింపఁగల మాన్యజనుల కెల్లరకు నా ధన్యవాదములు.

గ్రంథకర్త.



# సవరణ పట్టిక.



| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨ | ౪ | శ్రేషమై | శ్రేష్ఠమై |
| ౧౨ | ౧౪ | కఱగు | కరఁగ |
| ౨౧ | ౩ | భవ్యమ్మొ | భవ్యమై |
| | ౪ | బయట | బయటి |
| ౨౨ | ౯ | సలపు | సలుపు |
| | ౧౧ | చెఱకుఁ | చెఱకు |
| ౨౬ | ౨ | గాంచఁబోఁడు | గాంచఁబోరు |
| | ౧౪ | మార్చలేరు | మార్పలేరు |
| ౩౫ | ౧౨ | విదతు | విడుతు |
| | ౧౯ | ఎన్నో | ఎన్నొ |
| ౪౪ | ౮ | ధన్యత్య | ధన్యత్వ |
| ౪౫ | ౧౩ | ద్రవ్యబు | ద్రవ్యంబు |
| ౫౬ | ౨ | ధాతృత | దాతృత |
| ౬౧ | ౬ | కష్టపడ | కష్టమగు |
| ౬౪ | ౧౧ | ఇంచుకెనియు | ఇఁచుకేనియు |
| ౭౫ | ౧౧ | ఉగుతరైశ్వ | ఉరుతరైశ్వర్య |
| ౭౮ | ౧౫ | వేశ్వ | వేశ్య |
| ౮౦ | ౧౦ | వానికెల | వానికేల |
| ౮౨ | ౧౯ | శేరు | సేరు |
| ౯౨ | ౧౯ | శాస్త్రవిధుల | శాస్త్రవిదుల |
| ౯౮ | ౭ | మకరతఁబు | మరకతంబు |
| | ౧౪ | గిదు | గీదు |
| ౧౦౫ | ౧౨ | జెఱచు | జెఱుచు |
| | ౧౭ | జల్కనగఁ | జాల్కనగఁ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౧౦ | ౧౦ | నాశనంబగు | నాశమగుఁజుమీ |
| ౧౧౧ | ౧౮ | నాశముకు | నాశమునకు |
| ౧౧౫ | ౨౧ | సుంక్రుదే | సుఁక్రుదే |
| ౧౨౩ | ౬ | నిలచు | నిలుచు |
| ౧౩౦ | ౧ | గుణషేమి | గుణమేని |
| ౧౩౮ | ౧౨ | చెఱచుటకు | చెఱుచుటకు |
| ౧౪౨ | ౧౧ | జెంవి రెండలో | జెంది రెండలో |
| | ౧౭ | సంపదల | సంపదం |
| ౧౪౩ | ౮ | మృ | మృదు |
| ౧౪౭ | ౯ | వాగ్రకము | వాభ్రకము |
| | ౧౪ | చనాచుందుఁ | చనుచుండు |
| ౧౪౮ | ౯ | పగసతి | పరసతీ |
| ౧౫౧ | ౭ | ప్రాఢ | ప్రౌఢ |
| | ౧౭ | దురాత్మగమందు | దురాత్మకములచే |
| ౧౬౫ | ౧౬ | గలంనే | గలునే |
| ౧౬౬ | ౨౧ | గోంఁగాలేద | గోరలఁగాలేద |
| ౧౭౨ | ౨ | అల్పవ్యయము | అల్పధనము |
| | | బాఫ | బాధ |
| ౧౭౬ | ౧౩ | గటున | గట్టున |
| ౧౭౮ | ౩ | లగున | లగును |
| ౧౮౩ | ౪ | చేమట్టుచో | చేఁబట్టుచో |
| ౧౮౫ | ౧౮ | కాలంబుననే | కాలంబునె |
| ౧౯౨ | ౧౩ | జాలఁడై | జాలఁడే |
| ౧౯౬ | ౧౫ | కాంలు | వరలు |
| ౧౯౯ | ౫ | జతు | జంతు |



# విషయసూచిక.

# సుభాషితరత్నాకరము

## సుభాషిత ప్రశంస.



గీ. దేశభాషలయందెల్ల ♦ దివ్యమగుచు
నతులిత యశంబు నార్జించె ♦ నాంధ్రభాష,
దాన మధురంబు కవిత, య♦ద్దానియందుఁ
బరమ మధురమ్ము సుమ్ము సు♦భాషితమ్ము. ౧

గీ. బాలుఁడేని యొక సు♦భాషితంబు వచింప
నెల్లజనులు నది గ్ర♦హింపఁదగును;
సూర్యకిరణములకుఁ ♦ జొరరాని చోటున
నింత దివ్వె వెలుఁగు ♦ నీయకున్నె ! ౨

గీ. ధరణిపై మానవత్వంబు, ♦ దానికంటె
విద్య, యద్దానికంటెఁ గ♦విత్వ శక్తి
దుర్లభంబగు; నత్యంత దుర్లభంబు
భావరసభూషితంబు, సు♦భాషితంబు. ౩

గీ. కోర్కెమై సుభాషిత సుధం ♦ గ్రోలునట్టి
వాఁడు మధురంబులగు మాట ♦ లాడఁగలఁడు;
మక్కువను మావిచిగురుల ♦ మెక్కునట్టి
కోయిల మనోహరంబుగాఁ ♦ గూయుఁగాదె ! ౪

గీ. జాడ్యము నడంచు, వికృతిఁ బో♦సఁగనీదు,
నిండు తృప్తిని గూర్చు, క్షీ♦ణింపఁబోదు;
జగతిపైఁగల యెల్ల ర♦సంబులందు
శ్రేష్ఠమైయొప్పు నీ సుభా♦షితరసంబు. ౫

గీ. ఇంపుగ సుభాషితంబు నా♦లించినంతఁ
గఠినులకుఁగూడ హృదయంబు ♦ కరఁగితీరు;
సుందరాంగిని గనులారఁ ♦ జూచినంతఁ
బ్రియకుపితుల బింకంబు ♦ వదలకున్నె ! ౬

గీ. ఇలను సంసారమను విష♦వృక్షమునకు
నమృత తుల్యంబులైన పం♦డ్లరయ రెండు;
మేలగు సుభాషితరసంబుఁ ♦ గ్రోలు టొకటి
శిష్టులగువారితోఁ జెల్మి ♦ సేయు టొకటి. ౭

గీ. సతులవలపుచేత ♦ సంగీత గతిచేతఁ
దనివి నిడు సుభాషి♦తములచేత;
ఎవని మనసు మార్పు ♦ నెనయకుండు నతండు
పరమయోగి, లేక ♦ పశువుసుమ్ము. ౮

గీ. అమృత తుల్యాన్నమును బక్వ♦మైన ఫలము
నతుల సౌందర్యరాశియౌ ♦ సతి, సుగంధ
బంధురంబగు విడెము, సు♦భాషితంబు
వలదనిన మూఢభావంబు ♦ దెలియకున్నె ! ౯

గీ. పుడమియందొక మనుజుఁడై ♦ పుట్టియుండి
యించుక సుభాషితాస్వాద ♦ మెఱుఁగకుండి
విబుధమండితమగు సభా♦వేదికపయిఁ
జేరి కూర్చుండు టన సిగ్గు♦చేటుగాదె! ౧౦

గీ. పండితుం డయ్యు నసమ సు♦భాషితాఖ్య
విత్తసంపాదనంబుఁ గా♦వింపకున్న
యతఁడు సరసప్రసంగాఖ్య ♦ యజ్ఞమందు
నేవిధంబైన దక్షిణ ♦ నీయఁగలఁడు? ౧౧

గీ. వసుధ నన్నంబు, జలము; సు♦భాషితంబు
ననెడు వెలలేని రత్నంబు ♦ లమరియుండ;
రాతిముక్కను దిలకించి ♦ రత్నమందు
రెట్టి మూఢత్వమో మది♦కెఱుక వడదు! ౧౨

గీ. అవసరంబునందు ♦ నాడినఁ గొఱగాని
పలుకుగూడ నది సు♦భాషితమగు;
అమితబాధఁగూర్చు ♦ నాకలిఁ గొన్నప్డు
గంజియేని ప్రీతి♦కరముగాదె! ౧౩

గీ. విమలమైనవాక్కు ♦ వినువారు లేకున్నఁ
జెప్పువార లేమి ♦ చేయఁగలరు?
అవని నెల్లరును ది♦గంబరులైనచో
ఫలము గలదె చాకి♦వారి వలన! ౧౪

## —♦ కవిత్వము ♦—

గీ. విద్య లెన్నియైన ♦ వెలయుచుండునుగాక
కవితవలన మిగుల ♦ ఘనత గలుగు;
ఇంతి కెన్నిగుణము♦లేని యుండును గాక
వాసిఁగనదె భర్తృ ♦ భక్తివలన ! ౧౫

గీ. రసపిపాసువైన ♦ రసికుని చిత్తంబు
నందుఁ జేరఁగల్గు ♦ నదియె కవిత;
సరసుఁడైన పతికి ♦ సంతోష మొదవింపఁ
గలుగునట్టి సతియె ♦ కాంత యగును ! ౧౬

గీ. వినినమాత్రాన సరసుల ♦ వీనుదోయి
కమృతసేచనమై యొప్పు ♦ నదియె కవిత;
కనినయంతనె రసికుల ♦ కన్నుఁగవకు
ననుపమానంద మిడునదే ♦ వనితగాదె ! ౧౭

గీ. కావ్యములు సరసంబులై ♦ క్రాలునెడల
నాదరింతురు జనులు లె♦మంత దామె;
మధురమకరందకలిత సు♦మంబు లెల్ల
భృంగపంక్తిని రమ్మని ♦ పిలుచునొక్కొ! ౧౮

గీ. రసికశేఖరు నత్యా♦దరమునుగాంచు
నపుడె తన కృతిచే మోద♦మగును గవికి;
పూరుషోత్తముఁడగు పతిం ♦ బొందినపుడె
జనకునకు హర్షమగుఁగదా ♦త నయవలన ! ౧౯

గీ. ఒప్పు కింతయుఁ దెలియక ♦ యుండుఁగాక
చెవుల కింపుగ వెలయు స♦త్కవిమృదూక్తి
తావిఁ గనఁగాక యున్న నే♦త్రముల కధిక
ముదము నిడకున్నె మాలతీ ♦ పుష్పమాల! ౨౦

గీ. పండితులుఁ బామరులుఁగూడఁ ♦ బద్యములను
జెప్పుదురు గాక సామ్యంబుఁ ♦ జెందఁబోవు
కోకిలలుఁ గాకులుంగూడఁ ♦ గూయుఁగాక
స్వరవిభేదంబు దోఁచదే ♦ జనులకెల్ల! ౨౧

గీ. సుకవి కావ్యంబు ఖలులెంతఁ ♦ జూపు నెడల
మిగులఁ బరిశుద్ధమై సదా ♦ నెగడఁగలదు
కాంచనము నిప్పులో నుంచి ♦ కాల్చినపుడె
యమితమైన ప్రకాశంబు ♦ నందుఁ గాదె! ౨౨

గీ. తర్కమందునఁ గనువాక్కు ♦ కర్కశమగు
నదియె కావ్యమునను మృదు♦వై చెలంగు
శత్రుగిరులభేదింప వ♦జ్రమగు నఖము
కలికి చెక్కిళ్ళ నెనసిన కో♦మలముగాదె! ౨౩

గీ. ఆర్యజనులెల్ల సత్క్రియ ♦ లాచరింపఁ
గవులు కావ్యంబులు రచించి ♦ ఘనతఁగూర్తు
రొలను జలమిడి తాఁ బద్మ♦ములను బెంపఁ
గోరి సూర్యుండు కాంతి సే♦కూర్పకున్నె! ౨౪

గీ. ఎంచ నుపమాద్యలంకార♦హీనమయ్యుఁ
సరసకవిత యొసంగు హ♦ర్షంబుఁగూర్చు
రత్నహారాదిభూషణ ♦ రహితయయ్యు
సుందరాంగి కందోయి కా♦నంద మిడదె! ౨౫

గీ. సర్వగతుల నలంకార♦సహితమయ్యుఁ
సారహీనకవిత్వ మ్మ♦సహ్యమగును
ఎన్నియో సొమ్ములం దగి♦లింతుఁగాక
మదికి మోదంబొసంగునే ♦ మట్టిబొమ్మ! ౨౬

గీ. కవులు రచియింతు రెన్నియో ♦ కావ్యములను
వానికిఁ బ్రకాశ మొసఁగూర్చు♦వార లరిది
సాలెపురు గెల్లెడను బూజు ♦ సంతరింప
సూర్యుఁ డొక్కండె దానికి ♦ శోభఁగూర్చు. ౨౭

గీ. కావ్యజాలమందుఁ గల ♦ సారమెవ్వఁడో
గాని యెఱుఁగలేఁడు ♦ మానవుండు
కుసుమబృందమందుఁ ♦ బొసఁగుమరందంబుఁ
దేటిగాక యొరులు ♦ దెలియఁగలరె! ౨౮

గీ. పదనుఁగలిగి పరుల♦హృదయంబునను జొచ్చి
శిరము దిరుగునట్లు ♦ సేయుచున్నఁ
గవి కవిత్వమునను గాని ♦ ధనువిడు
బాణమునను గాని ♦ ఘనము గలదె! ౨౯

గీ. అఖిలగుణయుక్తమైన కా♦వ్యమున నెంత
దోషముండిన సత్కవి ♦ దూఱఁదగదు
ఇంచుక కళంక మొకటఁ గ♦న్పించుఁగాక
చంద్రుని ధరించుకొనడే ♦ శంకరుండు! ౩౦

గీ. ధనముకై భూమిపతుల స్తో♦త్రములఁ జేసి
కవిత కెల్లెడలం దా♦నక్కఱ మొదవు
పత్రమున కాసపడె సదా ♦ విటులఁ గూడు
నింతిఁ గులటయటంచు దూ♦షింత్రు గాదె! ౩౧

గీ. సరసకవితామృతాస్వాద ♦ సమయమందు
శబ్దసాధుత్వాసాధుత్వ ♦ చర్చ తగదు
వెలఁది పోకముడిఁ గవిప్పు ♦ వేళయందు
వలువ విలువను బరీక్షించు♦ వాఁడు గలఁడె! ౩౨

—♦ సుకవి ♦ —

గీ. ఎందఱో పుట్టుచును గిట్టు♦చుంద్రుగాక
కవియె మిక్కిలి లోకోప♦కారి యగును
అవనిపై నదులెన్ని ♦ యుండుఁగాక
గంగయొకటియె స్వర్గసు♦ఖంబునొసఁగు. ౩౩

గీ. జగతిలో నెందఱెందఱో ♦ జనులు గలుగ
సరసులగువారు సుకవుల ♦ సంస్మరింతురు
పారిజాతాదిభూరుహ♦ప్రతతియుండఁ
గోర్కెలలు మాపిపెట్టునే ♦ కోరుఁగాదె! ౩౪

గీ. కవివరేణ్యులెల్లఁ గావ్యముల్ ♦ రచియింపఁ
గాంచి బుధులు వాని ♦ గొనియెంతురి
భూరుహంబులెల్లఁ ♦ బుష్పంబులను బూయ
వానితావి గంధ♦వహుఁడు దాల్చు. ౩౫

గీ. మంచియుం జెడ్డయును విచా♦రించి కవితఁ
జెప్పఁగలవాఁడు సత్కీర్తిఁ ♦ జెందఁగలఁడు
క్షీరనీరంబులను వేఱు♦సేయఁగలుగు
హంస యత్యంత విఖ్యాతి♦నందుఁగాదె! ౩౬

గీ॥ కవివరేణ్యుండు ధనహీను♦ఁడైనఁ గాక
యతని కవితయు నిస్సార ♦ మనఁగఁదగదు
చెఱకుఁగడ భిక్షుకుని చేతఁ ♦ జేరినంత
నించుకయుఁ దీయఁదనము న♦శించునొక్కొ! ౩౭

గీ॥ ఇతరులెల్ల సూక్తులను హ♦రింతురు గాక
కవికొకింతయు లోపంబు ♦ గలుగఁబోదు
మొనసి సురలెల్ల రత్నంబు♦లను హరింప
నబ్ధి నేటికిఁగూడ ర♦త్నాకరంబె. ౩౮

—♦ కుకవి ♦—

గీ॥ ఇద్ధసాహిత్యవిద్యావి♦హీనుఁడైన
కవి కవిత్వంబుచే వెలుఁ ♦ గాంచలేఁడు
పూవుబోఁడికిఁ దలయెల్ల ♦ బోడియైనఁ
గుసుమములచేత సింగారంబు ♦ పొసఁగఁగలదె! ౩౯

గీ. కాళిదాసాదుల కెగాక ♦ కవిపదంబు
మాకునుం గలదందురు సా♦మాన్య జనులు
అవని వస్తువు లెల్లఁ బ♦దార్థములన
నదిరి పరమాణువులు భేద♦మందకున్నె! ౩౯

గీ. పండితులు మెచ్చరని కోప♦పడు జడుండు
తనదు కావ్యంపు దోషముల్ ♦ తెలుపఁబోఁడు
రవికకుట్టినవాని నే♦రమ్ము నెంచు
నతివ తన శుష్కకుచముల ♦ సరియునోర్కొ! ౪౦

గీ. అధిక రమణీయమైన కా♦వ్యంబునందు
విసువక ఖలుండు నెరసులే ♦ వెదకుచుండు
మిక్కిలియుఁ జక్కనైనట్టి ♦ మేనియందు
నీఁగ కురుపులకొఱకు శో♦ధింపకున్నె! ౪౧

గీ. శ్రవణ సుఖమిడు సూక్తి ర♦సంబుగలుగ
నెపుడుఁ దప్పుల వెదుక యా♦త్నించు ఖలుఁడు
ఘనతరంబగు శృంగార♦రసముఁ జేర
గొంటె కంటకములఁ గోరు♦చుంట లేదె! ౪౨

గీ. శబ్ద శాస్త్రంబు కొంతెయుఁ ♦ జదువఁబోక
వ్యర్థ వాక్కుల సభ మెప్ప ♦ వడయ లేదు
ఎవఁడయినఁ బద్మనాళ తం♦తువుల చేతఁ
బెనచి మదగజమును గట్ట♦నేయఁ గలఁడె! ౪౩

## —♦ సరసుఁడు ♦—

గీ. ఎంతమంది పురుషు♦లేని యుందురుగాక
కవికి రసికునందె ♦ గౌరవంబు
ఇల సరోవరంబు ♦ లెన్ని యుండునుగాక
హంస మానసముననె ♦ యభిలషించు. ౪౪

గీ. ఇతరవిషయంబు లెవఁడేని ♦ యెఱుఁగుఁగాక
కావ్యసారంబు రసికుఁడొ♦క్కఁడె తెలియు
అకులం బండ్లఁ గొందురు ♦ గాక పరులు
మధుపమె గ్రహించు మకరంద ♦ మధురిమంబు. ౪౫

గీ. ఎంతయు ధనాఢ్యులగువారు ♦ లెందఱున్నఁ
గవివరేణ్యుల రసికుఁడొ♦క్కఁడె ప్రోచు
ఇలను నదులు సముద్రంబు ♦ లెన్ని యున్న
జలదమొక్కండు ప్రోవదే ♦ చాతకముల ! ౪౬

గీ. అవగుణము లెన్ని యున్న ర♦వ్వంత సుగుణ
మరసి రసికుండు సంతోష♦మందుచుండు
రజము ముండ్లును బొందు వ♦ర్ణమును గలుగు
కేతకీసువాసనకుఁ జేటి ♦ ప్రీతిఁగనదె ! ౪౭

గీ. అరయఁ గావ్యంబు గుణహీన ♦ మగునుగాక
సజ్జనుల నోటఁబడినఁ బ్ర♦శస్తిఁగాంచు
నీరసంబగునోటి పూ♦త్కారమేని
వేణువునఁజేరి మధురమై ♦ వెలయకున్నె ! ౪౮

గీ. సరసుఁడు స్వకీయవాక్కుల ♦ సారసంబు
నందియుం బెఱవారల కా♦నంద మొందు
పాదు నిజముకందద సా♦భరితమైన
మఱల జలమును గోరదే ♦ మావిచెట్టు! ౪౯

గీ. అమల సాహిత్యరసవేత్త♦యగుపుఁ దక్క
కవి గుణంబులు మన్ననఁ ♦ గాంచఁబోవు
జలమునందక్క యన్యమా♦స్థలమునందుఁ
దైలబిందువు వేగ వి♦స్తారతఁ గనునె! ౫౦

గీ. వ్యర్థమగు మూర్ఖుకడ దివ్య♦వాక్కుగూడ
నదియె రసికునిచెంగట ♦ సార్థకమగు
చాన వాల్చూపు బిడ్డకు ♦ సారహీన
మైన; నాథున కతిమనో♦హరముగాదె! ౫౧

గీ. అజ్ఞతోఁ బ్రియవాక్యంబు ♦ లాడుకంటె
నరయు రసికునితోఁ గల♦హంబు ఘనము
లంబకుచ మేని యాలింగ♦నంబుకంటె
లికుచకుచ కాలితన్ను మే♦లిమి వహించు. ౫౨

—♦ విరసుఁడు ♦—

గీ. సరస సందోహవినుతమై♦చనెడు కవిత
విరసులకు నెవ్వఁడేని వి♦న్పింపఁబోఁడు
సుందరీకుచోచితము క♦స్తూరి రసము
మహిష జఘనంబునకుఁ బూయు♦మనుజుఁడున్నె! ౫౩

గీ. కవిత పండితసన్నుతిం ♦ గాంచు నెడల
నెంత దూషించిననుమూఢుఁ ♦ డేమిలెక్క ?
యువజనుల ప్రేమఁ గైకొన్న ♦ యువిదమిన్న
పరిగణించునె వృద్ధుల ♦ నిరసనంబు ! ౫౪

గీ. అమిత రమ్యమైన ♦ యట్టి కావ్యమునందు
దోషముల గ్రహించు ♦ దుర్జనుండు
అందమైన దేహ ♦ మందు వ్రణంబునే
యెంచి చూచుఁగాదె ♦ ఈఁగ గుంపు ! ౫౫

గీ. సరస జనసన్నుతంబులౌ ♦ సత్కృతులకు
ఘనత దఱుగదు దుర్జన ♦ గర్జనముల
శివుఁడు ప్రేమించి శిరమునఁ ♦ జేర్చికొన్న
చంద్రు నెపుడేని రాహువు ♦ చంపఁగలఁడె ! ౫౬

గీ. తలఁబగులఁ గొట్టుకొనుఁగాక ♦ లలితకావ్య
మధురిమ నెఱుంగఁ బోలదు ♦ మందమతికి
చెఱువులోనున్న నీరెల్లఁ ♦ జెఱచుఁగాక
తోయజ సుగంధమెఱుఁగునే ♦ దున్నపోతు ! ౫౭

గీ. కావ్యమునఁ దప్పులొప్పులుం ♦ గల్గియుండ
దుర్జనులు తప్పులే వచిం♦తురు సతంబు
తోడరి పరిశుద్ధమైన వ♦స్తువుల విడచి
సూకర మశుద్ధమును భుజిం♦చుటను గనమె ! ౫౮

## ♦ విరసుఁడు ♦

గీ. మానిత కవీంద్రబృంద వా♦ఙ్మధురిమంబు
ముదము నొదవింపఁజాలదు ♦ మూఢమతికి
లలిత గంగాతరంగిణీ ♦ జలమువలన
దున్నపోతున కింత సం♦తోషమగునె! ౫౯

గీ. సరసజనులకు సంతోష♦జనకమైన
కావ్యమే మూఢులకుఁ గోప♦కారణమగు
ఎల్లసురలకు దీర్ఘాయు ♦ విచ్చు సుధయె
ఎంచఁగా రాహువునకు హాని ♦ హేతువయ్యె! ౬౦

గీ. సరస కవితాపరిపూర్ణమై ♦ వరలునట్టి
సత్కృతిని దుర్జనుండు దో♦షములు వెదకు
నిరుపమ గుణౌఘభరితమై ♦ నెగడునట్టి
కొలనిలోఁ గొంగ నత్తలఁ ♦ గోరకున్న! ౬౧

గీ. జ్ఞాన మిసుమంతయును లేని ♦ వానిచెంత
బలుకఁగారాదు కావ్యత♦త్త్వం బొకింత
పుట్టుగ్రుడ్డిని జేరి సం♦పూర్ణయావ
నాంగి రూపంబు వర్ణించు ♦ టర్హమగునె! ౬౨

## పండితుఁడు

గీ. పండితుల పరిశ్రమమెల్లఁ ♦ బండితులకె
తెలియు, మూర్ఖులకేమియుఁ ♦ దెలియఁబోదు
చేరి శ్రీరంగనీతులఁ ♦ జెప్పఁగాక
బిడ్డనొప్పు లెఱుంగునే ♦ గొడ్డురాలు! ౬౩

గీ. ఇతరు లెంతమంది ♦ యేని యుందురుగాక
భూషణంబు సభకు ♦ బుధుఁడొకండె
ఎన్ని గ్రహములేని ♦ యొసఁగుచుండును గాక
రవి యొకండె గగన ♦ రత్నమగును! ౬౪

గీ. పండితునిచేత సభ కీర్తి ♦ వడయుఁగాక
యెందఱజ్ఞానులుండిన ♦ నేమిఫలము
హంసచేఁ గొలను ప్రకాశ ♦ మందుఁగాక
కూడునే శోభ యొకవేయి ♦ కొంగలున్న! ౬౫

గీ. ఎంచఁగా సభలో నన్య ♦ లెందఱున్న
ఘనత విద్వాంసు వలననే ♦ కలుగుచుండు
ఎముక లెన్నేని శివుమేన ♦ నమరియున్న
చంద్రభూషణమున కవి ♦ సాటియగునె! ౬౬

గీ. అతిదరిద్రుఁడైన ♦ నగుఁగాక శాస్త్రజ్ఞుఁ
డను పమానకీర్తి ♦ నొందఁగోరు
చిఁగిపోయినట్టి ♦ చీరె దాల్చునుగాక
కమలనయన శోభఁ ♦ గాంచకున్నె! ౬౭

గీ. పరుల దూషణములు గూడఁ ♦ బండితునకు
సంతసమె కూర్చుచుండును ♦ స్వాంతమందు
అనయమును బూదితోడ శు♦ద్ధినను గూడ
నమలమగు కాంతి గలుగదే ♦ యద్దమునకు! ౬౮

గీ. వసుధపై నెంత గొప్ప వి♦ద్వాంసుఁడేని
మూఢమతులందుఁ బూజ్యతఁ ♦ బొందలేఁడు
హంస తానెంత తెల్పుచే ♦ నలరుచున్నఁ
గాకిమూకలలో మెప్పుఁ ♦ గాంచఁగలదె! ౬౯

గీ. ఎంత పాండిత్యముండిన ♦ నిల స్వదేశ
వాసులగు వారలకు గౌర♦వంబు సున్న
అరయఁగా మంచి గుణముతోఁ ♦ బెరుఁగు గాక
పెరటిచెట్టౌషధంబౌచుఁ ♦ బ్రీతినిడునె! ౭౦

గీ. పండితోత్తముండు ♦ ప్రాజ్ఞమండితసభ
యందె గౌరవంబు ♦ నందఁగలఁడు
గొప్ప జాతిదైన ♦ గుఱ్ఱంబు రణరంగ
మందె మిగుల మెప్పు♦నందఁ గాదె! ౭౧

గీ. పండితుండొక్కఁడేని లే♦కుండు చోట
నల్పమతియేని కడుమెప్పు ♦ నందఁగలఁడు
అరయ నొకవృక్షమేని లేన♦ట్టిచోట
నాముదపుచెట్టు ఘనతచే ♦ నలరకున్నె! ౭౨

గీ. నుతివహించిన గొప్ప పం♦డితుని యెదుట
ప్రజలు తమదోషముల మాటు ♦ పఱుపరాదు
చాన తా సిగ్గుచే మంత్రి ♦ సానిముందు
తనదు మర్మంబు రవ్వంత ♦ దాచఁదగునె! ౨౩

గీ. తానుగా జెప్పకున్న సం ♦ దర్భవశతఁ
బరుని భావంబు పండితు ♦ లెఱుఁగఁ గలరు
మిగుల జొంపంబునంగల ♦ మొగలిపూవు
నెఱుఁగవే తావిచే మధు♦కరములెల్ల! ౨౪

గీ. సర్వశాస్త్రములను ♦ చదివి యందలి సార
మే బుధాగ్రణులు గ్ర♦హింపఁగలరు
ఎల్లపుష్పములను ♦ వీక్షించి మకరంద
బిందువులను గొనదె ♦ భృంగపంక్తి. ౨౫

గీ. నిరుపమధనాఢ్యుఁడగు మూర్ఖ ♦ నరునకంటె
సతత దారిద్ర్యయుతుఁడు పం♦డితుఁడు మేలు
రమ్యవసనంబుగల యంధు♦రాలికంటె
జీర్ణవస్త్ర సులోచన ♦ శ్రేష్ఠ మనరె! ౨౬

గీ. పండితుండగువాడు ని♦ర్భాగ్యుఁడయ్యుఁ
బలు సభలయందుఁ బూజలఁ ♦ బడయుచుండు
ఒకటియైనను సొమ్ము లే♦కుండుఁగాక
తెలివిగల కన్నులెంతయు ♦ వెలయకున్నె! ౨౭

గీ. అధిక వైభవంబు ♦ నందుచుందురుగాక
బుధు లొకింతయేని ♦ పొంగిపడరు
దివ్యమైన మావి♦ తేనె యబ్బినఁ గోకి
లం బొకింతయును మ♦దంబుఁ గనునె! ౭౮

గీ. లలిత విజ్ఞానశాలికే ♦ వలయుఁగాని
జడునకేల మహోపదే♦శంబులెల్ల?
కనులు గలవానికే సులో♦చనముగాని
యంధునకొసంగుచో వ్యర్థ♦మగునుగాదె! ౭౯

గీ. అజ్ఞుఁడు గుణంబుల గ్రహింప ♦ నంతమాత్రఁ
బండితునకు దోషంబు సం♦ప్రాప్తమౌనె?
ఇంచుకయు గుడ్లగూబ తాఁ ♦ గాంచకున్నఁ
బగటి కాంతికి హైన్యంబు ♦ వచ్చునొక్కొ! ౮౦

గీ. స్వల్పమగు సేవచే బుధుల్ ♦ సంతసింతుర్
గాని మూర్ఖులహృదయంబు ♦ కఱగఁబోదు
జలము వోసినయంత వృ♦క్షములు వోలెఁ
బుడమిపై ఱాళ్ళు నభివృద్ధిఁ ♦ బొందఁగలవె! ౮౧

గీ. పండితుండు గర్వ♦పడఁబోఁడు సుంతైన
పామరుండు మిగులఁ ♦ బదరుచుండు
నిండుకుండ తొణక♦నేరదు రవ్వంత
వట్టికుండ యెపుడు ♦ మిట్టిపడును. ౮౨

గీ. పండితుం డొక్కఁడేని లే♦కుండుచోట
నల్పమతియును గౌరవం ♦ బందఁగలఁడు
అబ్జబాంధవుఁ డుదయింప ♦ నంతవఱకు
దీపమేని ప్రశస్తమై ♦ తేజరిల్లు. ౮౩

గీ. ఇల మహాపండితుఁడు మర♦ణించినంత
నెల్ల పామరులును విజృం♦భింపఁగలరు
ఎంచఁగా సూర్యుఁడొకఁ ♦ డస్తమించినంతఁ
గాయదే మోదమున గ్రుడ్డి♦గూబగూడ ! ౮౪

గీ. చేరి పండితులెల్ల భా♦షించుచోట
ముదమునఁ బామరులుగూడ ♦ వదరుచుంద్రు;
అంచలు కలస్వనంబుఁ గా♦వించుచుండ
నచటఁ గప్పలు బెకబెక♦లాడకున్నె ! ౮౫

## ♦ మూర్ఖుఁడు ♦

గీ. పండితోత్తములను ♦ బరికించి మేలంబు
లాడుచుంద్రు మూర్ఖు♦లైనజనులు
పరమ సాధ్వియైన ♦ పడఁతిని గనినంతఁ
జెడిపెలెల్లఁ బరిహ♦సింత్రుగాదె ! ౮౬

గీ. లేశమేని తెలివి♦లేనట్టి వానికి
నఖిలబోధలును ని♦రర్థకములు
భర్త యంధుఁడైన ♦ భార్య సింగారంబు
లెన్ని చేయుచున్న ♦ నేమిఫలము ! ౮౭

గీ. అక్షరజ్ఞానమే లేని ♦ యట్టి మనుజుఁ
డెంతకాలంబు బ్రదికిన ♦ నేమి ఫలము?
పగతురంగాంచి భయమందు ♦ పంద కెంత
బలముగలిగిన దానిచే ♦ ఫలముగలదె! ౮౮

గీ. అజ్ఞుఁడగువాని గొప్పకా ♦ ర్యమున నిలుప
సర్వమును నొక్కక్షణములో ♦ సమయఁ జేయు
రమ్యమైయొప్పు రత్నహా ♦ రమును గోఁతి
చేతి కిడ ముక్క ముక్కలు ♦ చేయకున్నె! ౮౯

గీ. అధికమూర్ఖుఁడైన ♦ యట్టి మానవునకు
సత్కథావళి ప్ర ♦ సంగమేల?
మిగుల నీచజంతు ♦ వగు గార్ధభమునకు
నింపు నిండునె చంద ♦ నంపుఁబూత! ౯౦

గీ. నేను లేకున్నఁ గార్యంబు ♦ నిర్వహింపఁ
జాలరనుచు వచించును ♦ బాలిశుండు
'కొక్కరోకో' యనుచుఁ గోడి ♦ కూయకున్నఁ
దెల్లవారదొకో తప్పి ♦ దేశమందు! ౯౧

గీ. మూర్ఖులెల్లఁ జేరి ♦ మొఱుగుచుండెడిచోటఁ
బాసి చనుటమేలు ♦ పండితునకు
కాకులెల్లఁ గ్రమ్మి ♦ కర్కశంబుగఁ గూయు
స్థలమునందు హంస ♦ నిలువఁదగునె! ౯౨

గీ. జగతియందు నెపుడు ♦ జడులుద్భవించుట
సాధుజనుల కెల్ల ♦ సంకటంబు
ఆకసమునఁ జంద్రుఁ ♦ డగపడినంతనే
కమలములకు హాని ♦ కలుగుఁగాదె! ౯౩

గీ. పసరమును బోలు మూఢుని ♦ బలమువలన
మాన్యుని గుణంబు సర్వంబు ♦ మాటువడును
గాఢముగఁ బర్వునట్టి మే♦ఘుంబువలనఁ
దప్పక రవిప్రకాశంబు ♦ కప్పవడదె! ౯౪

గీ. అమిత విత్తవంతుఁ♦డగుఁ గాక మూఢుండు
గౌరవంబొకింతఁ ♦ గాంచఁబోఁడు
ఒడలినిండఁ బైడి ♦ తొడవులు నింపిన
గ్రుడ్డివాని కగునె ♦ గొప్పకాంతి! ౯౫

గీ. అనుభవింపరాని ♦ యట్టి వస్తువులేని
పోగుచేయుచుంద్రు ♦ మూఢ జనులు
ఎలుక కొంచెమేని ♦ ఫలము లేకున్నను
పైడి వెండినగలఁ ♦ బట్టితెచ్చు. ౯౬

గీ. ఎంతయును మూర్ఖులను బ్రబో♦ధింతుగాక
సరసభావంబుఁ గలిగింపఁ ♦ జాలరెవరు
కాదనిన లింగమును గట్టఁ ♦ గలరుగాని
లేనిభక్తి యొకింత క♦ల్గింపవశమె! ౯౭

గీ. పుణ్యదాయక సత్క థా♦బోధనమున
మూర్ఖున కొకింతయేనియు ♦ ముదముగాదు
భవ్యమైమించు సంగీత ♦ ఫణితియేని
చెవిటివానికి సంతుష్టి ♦ చేయఁగలదె! ౯౮

గీ. బయట గుణమునుగని భ్రాంతి ♦ పడును జడుఁడు
కానఁగాలేఁడు సుంతైన ♦ లోనిదోసఁగు
కలశమును మీఁదఁజూచి ♦ బంగారమనును
గాని లోపలి రాగిని ♦ గాంచునొక్కొ! ౯౯

గీ. సకలశాస్త్రపురాణ వి♦జ్ఞానులేని
యింద్రియ విజేతలైన యో♦గీంద్రులేని
మిమ్ముఁ గనినంతనే ప్రణా♦మమ్ము లిడుదు
రపరదేవతలో మూర్ఖు♦లార! మీరు! ౧౦౦

—♦ సజ్జనుఁడు ♦—

గీ. సజ్జనులు దాము కష్టముల్ ♦ సైచుచుండి
కోరి పరులకు సుఖము సే♦కూర్చుచుంద్రు
మహిని వృక్షంబు లెండలో ♦ మాడుచుండి
యితరులకుఁ జల్లనగు నీడ ♦ నిచ్చుఁగాదె! ౧౦౧

గీ. సాధుజను లెల్లకాలంబు ♦ సరసఁజేరి
కష్టములఁదీర్చి దీనులఁ ♦ గాచుచుంద్రు
కంటి కీసుమంతయును బాధ ♦ గలుగకుండ
నెల్లవేళల ఱెప్ప ర♦క్షించుఁగాదె! ౧౦౨

గీ. సాధుపుంగవుఁ డగువాని ♦ స్వాంతమందు
దుర్జనుల దూషణంబులు ♦ దూరఁబోవు
ఱాలతోఁ గొట్టినను గూడ ♦ బాలకులకు
మధురఫలము లొసంగదే ♦ మావిచెట్టు! ౧౦౩

గీ. దూషణంబుల వినియును ♦ భూషణములఁ
బల్కుచుండుట సాధుస్వ♦భావమగును
సంద్రమున నుప్పునీర్ద్రావి ♦ జలధరంబు
మఱలఁ దీయని జలమును ♦ గురియుఁగాదె! ౧౦౪

గీ. శత్రువుల కేని యుపకృతి ♦ సలుపుచుంట
సజ్జనుల ధర్మమైయుండు ♦ సంతతంబు
చెఱకు; నములుచుఁ బిప్పిగాఁ ♦ జేయునట్టి
జనుల కీయదె మధురర♦సంబు నెపుడు! ౧౦౫

గీ. సర్వకామితములు గూడ ♦ సాధుజనులు
అడుగకయె పూర్తిచేయుదు ♦ రర్థితతికి
సూర్యచంద్రులు దా మెల్ల♦చోటులందుఁ
గోరకయె కాంతి నెపుడుఁ జే♦కూర్త్రుగాదె! ౧౦౬

గీ. శిష్టజనుఁ డొక్కరుండేని ♦ చెంతనున్న
నింక నమృతంబుకొఱకు వాం♦ఛింపనేల?
దాత యొక్కండు చెంగటఁ ♦ దనరుచున్నఁ
గల్పవృక్షంబుకోసమై ♦ కాంక్షయేల? ౧౦౭

గీ. అధికముగఁ దన్ను బాధించు♦నప్పుడేని
సజ్జనుఁడు శత్రులకు మేలు♦సలుపుచుండు
తన్ను ఛేదించునపుడుఁ జం♦దనకుజంబు
గొడ్డలికి మంచివాసనఁ ♦ గూర్చుకున్నె ! ౧౦౮

గీ. స్వల్పమగు పూజవలననే ♦ సాధుజనులు
సంతసము నొందుచుందురు ♦ సంతతంబు
అమ్మహేశ్వరునకుఁ జిన్న ♦ తుమ్మిపూవు
హరికిఁ దులసిదళంబుఁ బ్రి♦యంబుగాదె ! ౧౦౯

గీ. సత్పురుషులెట్టి కార్యంబు ♦ సలుపనున్న
భావమున మాత్రమే యుండు ♦ బయటఁబడదు
కమలములయందు సూర్యుఁడు ♦ కాంతినిడుట
యెవనికేనియు ముందు వి♦న్పించునొక్కొ ! ౧౧౦

గీ. సజ్జనుని కష్టముల నెల్ల ♦ సమయఁజేయు
సజ్జనులె చాలియుందు రీ ♦ జగతియందు
ఏన్గు పంకంబులోఁ జొచ్చి♦నడల దాని
నేన్గులే గాక యెవరు లుద్ధ♦రింపఁగలరె ! ౧౧౧

గీ. సజ్జనుల గొప్పతనమును ♦ సర్వదిశల
సజ్జనులె చాటుచుందురు ♦ సంతతంబు
పూలలోని సువాసన ♦ గాలి వలన
నెల్లదిక్కులయందును వ్యా♦పించుఁ గాదె ! ౧౧౨

గీ. సాధువుల గౌరవింతురు ♦ సాధుజనులు
అన్యు లపకార మొనరింప ♦ నభిలషింత్రు
చంద్రుని శిరంబున ధరించు ♦ శంకరుండు
చేరి రాహువు కబళింపఁ ♦ గోరుచుండు. ౧౧౩

గీ. ఎట్టి యాపదలేని ప్రా♦ప్తించుఁగాక
సజ్జనుల దివ్యభావంబు ♦ సడలఁబోదు
అగ్నిహోత్రునిచే బాధ ♦ యమరుఁగాక
వీడునే కప్పురపుఁ దావి ♦ వీసమైన ! ౧౧౪

గీ. ఆపదలయందె సజ్జను♦లైనవారి
దివ్యమగు శక్తియంతయుఁ ♦ దేటపడును
అగ్నిలోఁబడి తపియించు♦నపుడె మున్ను
లేనివాసన యగురునం ♦ గానవచ్చు. ౧౧౫

గీ. దుర్జనులతోడ స్నేహంబు ♦ తొడరినంత
సహజసౌమ్యంబు వీడరు ♦ సాధుజనులు
కాకితోఁజెల్మి యెంతేని ♦ కలిగియున్నఁ
గోకిల త్యజించునే మంజు♦కూజితంబు ! ౧౧౬

గీ. ఎపుడు దుష్టులలోఁ బ్రవే♦శించుఁగాక
సజ్జనుని సాధుభావంబు ♦ సడలఁబోదు
అనయమును యమునానదిఁ ♦ మునుఁగుఁగాక
తెల్లనగుహంస యిసుమంత ♦ నల్లఁబడునె ! ౧౧౭

గీ. అరయఁగా సజ్జనుల స్థిరం♦బైన మనసు
దుర్జనులచే రవంతయుఁ ♦ దొట్రుపడదు;
విమలమై యొప్పు రత్నదీ♦పముల కాంతి
తూలి నశియించునే సుడి♦గాలివలన ! ౧౧౮

గీ. కోపమొక్కింత సుజనులఁ ♦ గూడఁగాక
చెఱుపఁగా లేదు వారల ♦ చిత్తవృత్తి;
తలఁపఁగ నపారమగు సము♦ద్రంపునీరు
ఎప్పుడేనింకునే గడ్డి♦నిప్పువలన ! ౧౧౯

గీ. అరయఁగా నొక్క మధురవా♦క్యంబువలన
సజ్జనుల కోపమంతయు ♦ సమసిపోవు;
చల్లనగు నీటి నొక్కింతఁ ♦ జల్లినంతఁ
బాయకుండునె క్షణములోఁ ♦ బాలపొంగు ! ౧౨౦

గీ. సజ్జనునిగాంచి ముద మొందు ♦ సజ్జనుండు
ఖలున కిసుమంత మోదంబు ♦ గలుగఁబోదు;
కమలమునఁ జేరఁ దుమ్మెద ♦ కాంక్ష సేయుఁ
జెంతనేయుండు కప్ప వాం♦ఛించు నొక్కొ. ౧౨౧

గీ. కొండెగాండ్రు చెప్పు ♦ కుటిలవాక్యములచేఁ
జెడదు సాధుజనుల ♦ చిత్త మెపుడు;
సర్పముల విషంపు ♦ సంపర్క మున్నంతఁ
గొలని నీరు చెడునె ♦ కొంచెమైన ! ౧౨౨

గీ. సజ్జనులకు నెంత ♦ సంపద గలిగిన
గర్వ మెప్పుడేని ♦ గాంచఁబోఁడు;
సర్వరత్నములకు ♦ స్థానమైనను సము
ద్రమున కించుకయు మ♦దంబుగలదె! ౧–౨౩

గీ. సాధుజనులు దమకు ♦ సంపదల్గలిగెడు
కొలఁది వినయమూని ♦ మెలఁగుచుండ్రు;
ఇల ఫలించినట్టి ♦ వృక్షంబు లన్నియు
నొప్పమీర వ్రాలి♦యుండకున్నె! ౧–౨౪

గీ. చెడ్డచెలిమివలనఁ ♦ జేరదు దోషంబు
సుంతయేని బుద్ధి♦మంతునందు;
సర్పనిలయమైన ♦ చందనవృక్షంబు
నందు విషమొకింత♦యైనఁ గలదె! ౧–౨౫

గీ. సద్గుణామృతంబు ♦ సమ్మతిం గ్రోలంగ
నవని సజ్జనుండె ♦ యర్హుఁ డగును;
కోకిలం బొకండె ♦ క్రొమ్మావిచిగురుల
మెక్కి సంతసింప ♦ మేటి గాదె! ౧–౨౬

గీ. తలఁచిచూడ సంప♦దలుగాని యాపదల్
గాని సాధువులకె ♦ కలుగుచుండు;
ఎపుడుఁ జందురుఁడె ♦ వృద్ధిక్షయంబులఁ
గాంచునొక్కొ తార♦కాగణంబు! ౧–౨౭

గీ. జగతియందు సాధు♦జను లయాచితముగా
నెల్లరకు ముదంబు ♦ నిచ్చుచుంద్రు;
తలఁప నెల్ల మేఘ♦ములు దమంతటఁ దాము
ప్రజల తాప మెల్లఁ ♦ బాపుఁగాదె! ౧౨౮

గీ. మంచిచెడ్డతనము ♦ లెంచక యెల్లరఁ
బ్రోచుచుండు సాధు♦పుంగవుండు:
చందురుండు తనదు ♦ చంద్రికఁ బఱపుచుఁ
గాంతినిడఁడె యెల్ల ♦ కడలయందు! ౧౨౯

గీ. అరయ ఖలులెంత యౌన్నత్య ♦ మందియున్న
సాటిగారెందు సామాన్య ♦ సజ్జనులకు;
కాకిమూకలు పర్వతా♦గ్రమున నున్న
భూమిపైనుండు హంసలఁ ♦ బోల్పఁదగునె! ౧౩౦

గీ. ఉర్విపై నెల్లజీవుల ♦ నొక్కరీతి
నాదరింతురు సజ్జను♦లైనవారు;
అరయఁగా దోసిటంగల్గు ♦ నట్టిపూలు
కుడి యెడమచేతులకుఁ దావిఁ ♦ గూర్చఁగాదె! ౧౩౧

గీ. సాధువున కెగ్గుఁగావించు ♦ జనుఁడుగూడ
నతనిచే నుపకారంబు ♦ నందఁగలఁడు;
అపుడపుడుఁ దన్ను దహియించు ♦ నా దవాగ్ని
కేని సంద్రంబు తృప్తి గ♦ల్గింపకున్నె! ౧౩౨

గీ. భవ్యదోషసమేతులౌ ♦ వారి కేని
యనయమును మేలు సేత స♦జ్జనుల వ్రతము;
రాగసంయుతమైన నీ ♦ రజమునందు
సూర్యుఁడు స్వకీయ తేజంబుఁ జొనుపకున్నె! ౧౩౩

గీ. సాధువు గుణంబుఁ గొనును దో♦షంబు విడచి
ఖలుఁడు తద్వ్యతిరేకతం ♦ గాంక్ష సేయు;
మంచిగింజలఁ జేట గ్ర♦హించుచుండ
జల్లెడ తదీయవిపరీత ♦ సరణిఁ గాంచు. ౧౩౪

గీ. సజ్జనులొకప్డు తాము దు♦ర్జనులఁ జేరి
నంతమాత్రాన దుష్టత్వ♦మందఁబోరు;
వెలఁది తా సాధ్వియైనచో ♦ వేశ్యయింటఁ
గాపురంబున్న వ్యభిచార♦గతిని గనునె! ౧౩౫

గీ. కుజనసంఘంబునంబుట్టి ♦ సుజనుఁడొకఁడు
బ్రదుకఁగలుగుటఁ జూడ న♦బ్రంబుగాదు;
విషములోఁగూడఁ బురుగు లా♦విర్భవించి
పెరుగుచుండుటలేదె యి♦ద్ధరణియందు! ౧౩౬

గీ. సజ్జనులకొక్కపరి మేలు ♦ సలుపు నెడల
పలుమరుం గొప్పఫలములఁ ♦ బడయవచ్చు;
విత్తనమునాటి నీరొక్క♦వేళఁ బోయఁ
దరములకొలంది ఫలమీదె ♦ తాటిచెట్టు! ౧౩౭

గీ. సజ్జనుల మానసంబులు ♦ సంతతంబు
సత్క్రియలనాచరింప నా♦సక్తిఁగాంచు;
అలగులాబి పూవులకు ని♦రంతరంబు
సౌరభముఁ గూర్చుచుంట నై♦జంబుగాదె! ౧౩౮

గీ. తనకు నుపకారియైనట్టి ♦ జనున కెందు
సజ్జనుండు ప్రత్యుపకృతి ♦ సలుపుచుండు;
మున్ను నీరిచ్చినట్టి స♦ముద్రుగుణము
నెంచి నది తన జలమెప్డు ♦ నిడుటఁగనమె! ౧౩౯

గీ. తలఁపఁగా నొప్పకష్టంబు ♦ గలిగినపుడె
ఘనతరంబగు సాధు ల♦క్షణము దెలియు;
రాతిపైఁబెట్టి బల్మిమై ♦ గీతగీచి
నపుడె బంగారు మేలిమి ♦ నరయువచ్చు. ౧౪౦

గీ. సంపదల నంది తగ్గును ♦ సజ్జనుండు
ప్రబలగర్వంబుచే మిట్టి♦పడును ఖలుఁడు:
ఫలములను గాంచి వృక్షముల్ ♦ వంగుచుండ
వర్షజలమును గని పొంగి♦పడును నదులు. ౧౪౧

గీ॥ సుంతయేనియు నోరెత్త ♦ నంతవఱకు
కుజన సజ్జను లొకరీతి ♦ గోచరింతురు;
రాజిత వసంతకాలంబు ♦ రాకముందు
కాకపికముల భేదంబుఁ ♦ గాంచనగునె! ౧౪౨

గీ. దుర్జనుండు పరీక్షించు ♦ దోషములను
సజ్జనుండు గుణంబునే ♦ సంగ్రహించు ;
పంది దుర్గంధమును భావ♦మందుఁ గోర
హంస క్షీరంబుకొఱకుఁ దా ♦ నాసపడదె ! ౧౪౩

గీ. సాధులకు దోషమునగల్గుఁ ♦ సద్గుణంబు
దోష మొదవును గుణముచే ♦ దుర్జనులకు;
గడ్డిదినియును గోవు దు♦గ్ధముల నీయుఁ
బాలుద్రాగియు విషమును ♦ బామొసంగు. ౧౪౪

గీ. చెప్పునే గాని దుష్టుండు ♦ సేయలేఁడు
చెప్పకుండియు సుజనుండు ♦ చేయుమేలు ;
ఉఱుము శరదంబుధరము తాఁ ♦ గురియఁబోదు
చప్పుడే లేక కురియు వ♦ర్షర్తు ఘనము. ౧౪౫

—♦ దుర్జనుఁడు ♦—

గీ. దుష్టమతు లెందును గ్రహింతు ♦ దోషములనె
యెంచ గుణలేశమేని వీ♦క్షింపలేరు;
స్తనములను బట్టుకొనియును ♦ జలగ తాను
రక్తమునె పీల్చుఁగాని పా♦ల్ద్రావఁగలదె ! ౧౪౬

గీ. మంచిగుణముల నన్నింటి ♦ మాటుపఱచి
దోషములఁ జూపుచుందురు ♦ దుష్టమతులు;
భవ్యరత్నంబు లడుగునం ♦ బడఁగఁద్రొక్కి
జలధి పైకెత్తు గడ్డి పో♦చలనె యెపుడు ! ౧౪౭

గీ. ఖలుఁడు సన్మార్గమును బూని ♦ మెలఁగుటేని
పరులకు నుపద్రవంబుగాఁ ♦ బరిణమించు
వ్యాఘ్రి మెపుడేని దా నుప♦వాసమున్నఁ
బారణముగాదె పశువర్గ ♦ మారణమున! ౧౪౮

గీ. అరయ దుష్టుండు మధురోక్తు ♦ లాడుఁగాక
తుదకు సంప్రాప్త మగుజుమ్మి ♦ దుష్ఫలంబు
చిలువ మెల్లఁగ నోడిలోనఁ ♦ జేరుఁగాక
పిదపఁ దన దుర్గుణంబుఁ జూ♦సింపకున్నె! ౧౪౯

గీ. అవని ఖలుఁ డొక్క చెడ్డకా♦ర్యంబు సేయ
సాధువులకును గొప్ప క♦ష్టంబు గలుగు;
జానకిని రావణుండు తా ♦ సంగ్రహింప
నేదొసఁగులేని జలధి బం♦ధింపఁబడదె! ౧౫౦

గీ. చేరి దుర్జనుఁడొకఁడు వం♦చించు నెడల
సజ్జనులయందు నేనియు ♦ శంకగలుగు;
పాల వేడిమిచే నాల్క ♦ గాలునేని
తక్రమును బూత్కరించియే ♦ త్రాగ నెంత్రు; ౧౫౧

గీ. సంతతంబు స్వజాతి నా♦శనము కొఱకె
వెలయుచుండును దుష్టుల♦బలము లెల్ల;
శక్తిమై డేగ పక్షులఁ ♦ జంపుఁగాక
చేరఁగల్గునె పాముల ♦ చెంతకేని! ౧౫౨

గీ. సజ్జనుల దివ్యగుణములు ♦ సంతతంబు
తూలనాడంగఁజాలును ♦ దుర్జనుండు;
అధిక నిర్మలమైయొప్పు ♦ నాకసంబు
మలినమైపోవుఁగాదె ధూ♦మంబువలన! ౧౫౩

గీ. కుజనుఁడెంతటి శాస్త్రార్థ♦కుశలుఁడైన
సజ్జనత్వంబు నొందఁగఁ ♦ జాలఁడెందు;
నిండు జలమునఁ గలకాల♦ముండుఁగాక
కఠిన శిలలు మృదుత్వంబుఁ ♦ గాంచఁగలవె! ౧౫౪

గీ. ఖలులకు హితోపదేశముల్ ♦ సలుపుకొలఁది
దుర్జనత్వంబె యధికమై ♦ తోఁచుచుండు;
పాములకుఁ బాలుపోసి కా♦పాడుకొలఁది
నెల్లవేళల విషమె వ♦ర్థిల్లుచుండు! ౧౫౫

గీ. ఎట్టి సదుపాయమేని గా♦వించి కూడ
మంచివానిగ దుష్టుని ♦ మార్చలేరు;
ఎంతయుం బున్గుతోడ మ♦ర్దింతుగాక
యుల్లిగడ్డ సువాసన ♦ నొందఁగలదె! ౧౫౬

గీ. సజ్జనులలోన నొక్క దు♦ర్జనుని జేర్చి
నంతమాత్రాన సౌజన్య♦మందఁబోడు;
తెలిసి తెలియక మణులలోఁ ♦ గలిపినంత
గాజుపెంకును రత్నంపుఁ ♦ గాంతిఁ గనునె! ౧౫౭

గీ. ఎంచఁగా సజ్జనుల నెది♦రించు కుమతు
లెల్లఁ దమదోషమున నె న♦శించుచుంద్రు;
అగ్నిపై మోహరించిన ♦ యందువలన
మృత్యువున కెఱగాకున్నె ♦ మిడుత లెల్ల! ౧౫౮

గీ. దుష్టుఁ జేరినంత ♦ దోషంబు లగుచుండు
ఘనతరంబులైన ♦ గుణము లేని;
కరము తీయఁదనము♦గల నదీనీరంబు
అబ్ధిఁగలసి యుప్పు ♦ నగును గాదె! ౧౫౯

గీ. అందఱికిని గర్వ♦ముడఁగించు విద్యయే
దుర్జనులకు మదముఁ ♦ దొడరఁ జేయు;
జనులకెల్లఁ దేజ♦మొనఁగూర్చు రవికాంతి
గ్రుడ్లగూబ కిడదె ♦ గ్రుడ్డితనము! ౧౬౦

గీ. ఎన్నిమార్లు హితము♦నెంచి బోధించిన
ఖలుఁడొకింత తెలివి ♦ గాంచఁబోఁడు;
రాతిమీద నెంత ♦ రాచివేసినఁగూడ
బొగ్గు విమలకాంతిఁ ♦ బొందఁగలదె! ౧౬౧

గీ. ఆలు తన యధీన♦మందు వర్తించినం
బరునిసతికి నాస♦పడును ఖలుఁడు;
చెరువు నిర్మలాంబు ♦ భరితమై యున్నను
గాకి కడవనీరు ♦ గతుకకున్నె! ౧౬౨

గీ. పరుల మోసగింప ♦ భావించి దుర్మార్గు
లతివినమ్రులగుచు ♦ నలరుచుంద్రు;
అరయ ఱంకులాఁడి ♦ యగునట్టి భామిని
మిగుల లజ్జఁబూని ♦ మెలఁగకున్నె! ౧౬౩

గీ. గొప్పవారితోడఁ ♦ గూడియు దుష్టుండు
సహజగుణము వీడఁ ♦ జాలఁ డెందు;
పాలసంద్రమందు ♦ బహుకాలముండినన్
వాయసంబు నలుపు ♦ వాయునొక్కొ! ౧౬౪

గీ. ఘనుల చెంతఁ జేరఁ ♦ గల్గినమాత్రాన
మారఁబోదు ఖలుని ♦ మానసంబు;
విష్ణుచేతియందు ♦ వెలసినన్ శంఖంబు
లోని కుటిలభంగి ♦ మానెనొక్కొ! ౧౬౫

గీ. వైరమునను గాని ♦ వాత్సల్యమునఁ గాని
కుజనుఁ జేరనీయఁ ♦ గూడ దెపుడు;
కుక్క కఱచుఁ గాక ♦ కూర్మితో నాకెడుఁ
గాక మిగుల బాధ ♦ గలుగకున్నె! ౧౬౬

గీ. గొప్ప నీతు లెన్ని ♦ కోరి బోధించిన
ఖలుఁడు మంచితనముఁ ♦ గాంచఁబోఁడు;
విమలమైన పాన ♦ కముఁబోసి పెంచిన
వేపచెట్టు చేదు ♦ విఱుగునొక్కొ! ౧౬౭

గీ. ఎంచి సాధుజనుల ♦ హింసించు ఖలునకుం
దోడు సూపునట్టి ♦ దుష్టులుందురు;
కానలోని చెట్లఁ ♦ గార్చిచ్చు దహియింప
గాలిగూడఁ దోడు♦గాకయున్నె ! ౧౬౮

గీ. పరుల ధనమంతయును వచ్చి ♦ పడునుగాక
ఖలునిచే నర్థులకుఁ దృప్తి ♦ కలుగఁబోదు;
ఇలనుగల నదులన్నియుం ♦ గలియుఁగాక
దప్పిదీరునొకో సము♦ద్రంబువలన ! ౧౬౯

గీ. మనుజుఁ డొకడు దుష్టుఁ♦డని విన్నమాత్రన
నెల్లజనులుఁ గంట♦గింతు రతని;
అరయ దుష్టకీట♦మగు వృశ్చికము కంటెఁ
బడిన చంపకుండ ♦ విడతు రొక్కొ ! ౧౭౦

గీ. జగతిలో దుర్జనులును స♦జ్జనులుఁ గూడ
నేకగర్భంబునం జని♦యించు చుందురు;
అరయఁగా నాడు క్షీరసా♦గరమునందుఁ
గాలకూటామృతంబులు ♦ గలుగవొక్కొ ! ౧౭౧

గీ. అన్యుతోడ వాదు♦లాడకయుండిన
ఖలునకిల ముదంబు ♦ గలుగఁబోదు;
ఎన్నొ రసము లార♦గించుఁగాక యమేధ్య
మింతలేక కాకి ♦ తృప్తిపడునె ! ౧౭౨

గీ. లలితవిద్యచే న ♦ లంకృతుండగుఁ గాక
కోరి దుష్టుచెంతఁ ♦ జేరరాదు;
రత్నకాంతిచే వి ♦ రాజితంబగుఁ గాక
చిలువ భయముగలుగఁ ♦ జేయకున్నె! ౧౭౩

గీ. పామువలన నైనఁ ♦ బడయవచ్చును మైత్రి
కాని కుజనువలనఁ ♦ గాంచలేరు;
శేషశాయియైన ♦ శ్రీకృష్ణునెడల దు
ర్యోధనుండు వైర ♦ మూనలేదె! ౧౭౪

గీ. ఖలున కెంతబోధ ♦ గావించినను గూడ
సాధుభావమొందఁ ♦ జాలఁ డెందు;
సకలవిధములైన ♦ శ్రమలకోర్చినఁ గూడఁ
జక్కఁజేయఁబడునె ♦ కుక్కతోక! ౧౭౫

గీ. ఖలుఁడు వచియించుఁ దీయని ♦ పలుకులేని
భయము గలిగించు మానవ ♦ ప్రకరమునకు;
ఇల నకాలంబునందుఁ బు ♦ ష్పించునట్టి
ప్రసవములు భీతిఁ గొల్పవే ♦ ప్రజలకెల్ల! ౧౭౬

గీ. క్రూరు లపరాధహీనులౌ ♦ వారినేని
బాధ పెట్టుచు నుందురు ♦ పాడిదప్పి;
మంచిచెడ్డల నిసుమంత ♦ యెంచఁబోక
[illegible] ♦ కంటకములు! ౧౭౭

గీ. దీనులగువార లెంత ప్రార్థించుచున్న
ఖలుల హృదయం బొకింతయుఁ ♦ గఱఁగఁబోదు;
ఎంతయును భీతిచే మేక ♦ లేడ్చుచుండఁ
గరకరం గొంతుఁ గోయుఁడే ♦ కటికవాఁడు! ౧౨౮

గీ. దివ్యమై యొప్పెడు సుగూప ♦ దేశ మేని
ఖలుల హృదయంబులకుఁ బీడఁ ♦ గలుగఁజేయు;
నిర్మలంబౌచుఁ దనరారు ♦ నీరమేని
వీనులంజేరి బాధఁ గా ♦ వించుచుండు. ౧౨౯

గీ. ఎపుడు దుర్మార్గమున సంచ ♦ రించువానిఁ
దప్పక త్యజించుటే మహా ♦ ధర్మమగును;
అల్ల రావణుఁ డగ్రజుం ♦ డగును గాక
విడువఁడే దుష్టుఁడనుచు వి ♦ భీషణుండు! ౧౩౦

గీ. అరసి చూడంగ దుర్మార్గు ♦ లైనవారు
ఒప్పులును దప్పులని పల్కు ♦ చుందు రెపుడు;
"ధరణియందున అన్యాయ ♦ పురములోన
ఆలు మగలకు అంక"ను ♦ తీరు వినమె! ౧౩౧

గీ. ఎప్పుడుం దప్పులనె వచి ♦ యించువాని
జీవితంబెల్ల వ్యర్థమై ♦ చెలఁగుచుండు
అరయఁగా "నబద్ధాల పం ♦ చాంగమునకు
నఘవదియు ఘడియలు త్యాజ్య" ♦ మనుటలేదె! ౧౩౨

గీ. ఖలులు స్వీయకార్య ♦ ములు ఫలించుటకునై
బాధఁగూర్చుచుండ్రు ♦ పరుల కెపుడు ;
"ధనము వలసినట్టి ♦ తరుణానఁ గరణంబు
బయటఁబెట్టుచుండుఁ ♦ బ్రాఁత కవిలె" ౧౮౩

గీ. ఇలపయి నొకండు దుష్టుండు ♦ గలుగు నెడల
నతనికి సహాయులుగ నుండు ♦ రట్టివారె
"అకట వికటపురాజున ♦ కమిత మూఢు
డగు ప్రధానియు లభియించు" ♦ ననుట వినమె! ౧౮౪

గీ. జగతిపై నెందు సర్ప దు♦ర్జనులయందు
సర్పమే మంచిదనవచ్చు ♦ శంకదక్క;
జనుల బాధించు నెప్పుడో ♦ సర్పవిషము
సంతతమును బీడించు దు♦ర్జన విషంబు. ౧౮౫

గీ. క్రమముగాఁ గ్రూరభావంబు ♦ గాంచుకొలఁది
తనరహస్యంబు దెలియును ♦ జనులకెల్ల;
శునకపుచ్ఛంబు వక్రత్వ ♦ మెనయుకొలఁది
తెలియుచుండదె మర్మ ప్ర♦దేశమెల్ల! ౧౮౬

గీ. ఎన్ని సత్కారములను గా♦వించుచున్న
సజ్జనులతోడఁ బోరు దు♦ర్జనుఁడు సతము;
క్షీరమున నభిషేకంబుఁ ♦ జేసినంత
వాయసము రాజహంసత ♦ వడయునొక్కొ! ౧౮౭

గీ. సాధులెన్నని బోధలఁ ♦ జలుపు చున్న
ఖలుఁడు సౌజన్యమొక్కింతఁ ♦ గాంచఁబోఁడు
మధురజలపూరితంబులౌ ♦ నదులుగలియ
క్షారత నశించిపోవునే ♦ సాగరమున ! ౧౮౮

గీ. ఎన్నివిధములచే గౌర♦వించుచున్న
ఖలుఁడు లోకోపకారియై ♦ వెలయలేఁడు
కరము నమృతంబుచేఁ బెంపుఁ ♦ గాంచుఁగాక
పనికివచ్చునె విషవృక్ష♦ఫల మొకింత ! ౧౮౯

గీ. మొనసి తాఁబన్ను దుస్తంత్ర♦ముల వలననె
యెప్పుడో దుర్జనుఁడు హాని ♦ నెనయఁగలఁడు ;
ఒకటఁ దానల్లినట్టి యు♦ల్లికల యందె
చిక్కువడి సాలెపురుగు న♦శించుచుండు. ౧౯౦

గీ. దుష్టులైన వారి♦తోఁ వాదమాడిన
సజ్జనులకె నింద ♦ సంభవించు ;
మొనసి తా నశుద్ధ♦మున రాయి రువ్వినఁ
జింది ముఖముమీఁదఁ ♦ జేరకున్నె ! ౧౯౧

గీ. అజ్ఞుఁడయ్యును దుష్టుం డ♦హంకరింప
విద్యగల్గియు సుజనుండు ♦ వినయమూను;
ఏమియునులేని పత్రంబు ♦ లెగసిపడిన
నన్నియునుగల యాకులే ♦ యడఁగియుండు. ౧౯౨

గీ. ఆపదలయందుఁ దనవారి ♦ నాశ్రయించి
పరులకడఁ జేరు ఖలుఁడు సం♦పదల యెడల;
నీరు లేనప్డు నాచునం♦జేరు తేటి
సరసిజముకడ కేగదే ♦ జలము గలుగ ! ౧౯౩

—♦ ఉ త్త ముఁ డు ♦—

గీ. ఉత్తమున కెన్నికష్టంబు ♦ లొదవుచున్న
నీచకార్యంబు లెన్నఁడు ♦ నెరపఁబోఁడు;
సింహ మాఁకలిచేత డ♦స్సిననుగూడఁ
దృణమును గ్రసింపఁగోరునే ♦ మనమునందు ! ౧౯౪

గీ. బహుళ సంపదలందు నా♦పదలయందు
నొక్కరీతిగనేయుండు ♦ నుత్తముండు;
మాన్యుఁడగు సూర్యుఁ డుదయా స్త♦మయములందు
నెఱ్ఱఁగాఁ దోచు టది లోక♦మెఱుఁగదొక్కొ !

గీ. ఘనుఁడు మిక్కిలి సంపద ♦ ల్గాంచుఁగాక
తనదు మర్యాద యొక్కింత ♦ దాటఁబోఁడు;
జలధి తనలోన నదులెన్ని ♦ కలియుచున్నఁ
గాంక్షసేయునె చెలియలి ♦ కట్టదాట ! ౧౯౬

గీ. ఎపుడు దుర్మార్గులందుఁ జ♦రింతురేగాక
మాన్యజనుల స్వభావంబు ♦ మారఁబోదు;
కాకిమూకను బెరుగును♦గాక మధుర
కూజితంబును వీడునే ♦ కోకిలంబు ! ౧౯౭

గీ. ఆశ్రితున కెన్ని దోషంబు ♦ లమరియున్న
నెంచియుత్తముఁ డతనిఁ ద్యజింపఁబోఁడు;
క్షీణతను గళంకంబును ♦ బూనియుండు
చంద్రుని ధరించుచుండఁడే ♦ శంకరుండు! ౧౯౭

గీ. ధరణినుత్తముండు ♦ తనచోటుఁ బాసియు
నమిత గౌరవంబు ♦ నందఁగలఁడు;
జలధిఁ బాసి రత్న♦ములు మహారాజుల
శిరములందుఁ జేరి ♦ మెరయుఁగాదె! ౧౯౮

గీ. అసువులను బాయు సమయంబు♦నందుఁగూడఁ
బావనత్వంబు వీడరు ♦ భవ్యమతులు;
కాల్చివేతురుగాక శం♦ఖంబునందుఁ
గలుగు తెల్లదనంబది ♦ తొలఁగిచనునె! ౨౦౦

గీ. ఘనుల నీచులవోలె న♦గౌరవంబు
సేయుచుండెడువాని దూ♦షింతురి జనులు;
మకుటమునఁ జేర్పఁదగినట్టి ♦ మానికంబు
నందెలోఁ జేర్పఁ బరిహాస ♦ మొందకున్నె! ౨౦౧

గీ. తమకుఁ బ్రియులైనవారి చెం♦తనువసించి
యుత్తములు గొప్పఫలముల ♦ నొందుచుంద్రు;
కోరి మావిపై నెక్కి చిం♦గుళ్ళు మెక్కి
కోకిల మనోహరంబుగాఁ ♦ గూయుఁగాదె! ౨౦౨

గీ. ఇలను బరిశుద్ధులగువారి ♦ హృదయమందుఁ
బరుల కపటంబునిల్వక ♦ బయటఁబడును;
స్వచ్ఛమై ప్రకాశించెడు ♦ స్ఫటికమందుఁ
గానఁ బడకున్న పెఱరాళ్ళ ♦ కల్మషంబు! ౨౦౩

గీ. మిగులఁ బరిశుద్ధభావులై ♦ నెగడువారి
నించుకయు లోభగుణము బా♦ధింపలేదు;
సదమల జలాఢ్యమగు మహా♦సాగరంబు
కలఁతనొందునె చేపపి♦ల్లలు చలింప! ౨౦౪

గీ. ఘనులొకప్పుడు కోపింత్రు ♦ గాక శాంతి
నొందుదురు వెండియును, నీచు ♦ లొందఁబోరు;
కఠినమయ్యును గనకంబు ♦ కఱఁగుఁగాని
కఱఁగునే యెన్నఁడేనియు ♦ గడ్డిపోచ! ౨౦౫

గీ. ఇతరు లెంతేని దమ్ము బా♦ధించుచున్న
సుఖము సేకూర్పుదురు పరి♦శుద్ధమతులు;
క్రాగఁబెట్టినఁ దరిచినఁ ♦ గష్టమనక
వెన్ననిడి మేలు గావింప ♦ కున్న పాలు! ౨౦౬

గీ. స్వజను లాపదలను బొందు ♦ సమయ మందు
నుత్తములు సూచి సుంతయు ♦ నోర్వలేరు;
పాండవులు ఘోరకష్టముల్ ♦ వడయుచుండ
సంతతంబును గృష్ణుండు ♦ సాయపడఁడె! ౨౦౭

గీ. అధిక పరిశుద్ధమానసు♦లైన వారి
కెట్టి ఖలులును హానిఁ గా♦వింపలేరు;
అమల తేజంబుతో వెల్గు♦నట్టి నిప్పు
నవని నెందైనఁ జెదపుర్వు ♦ లంటుకొనునె! ౨౦౮

గీ. ఉత్తముల గుణంబులఁ జెంత ♦ నుండువారు
సకల దిక్కులఁ బ్రకటింతు ♦ సంతతంబు;
పద్మములు వికసింపఁ ద♦త్పరిమళంబు
గాలిచేఁ బర్వదే యెల్ల ♦ కడలయందు! ౨౦౯

గీ. మానవుఁడు శ్రుతి శీల క♦ర్మములచేత
నధికుఁ డగునేని యుత్తముఁ ♦ డనఁగఁ బరగు;
ఎంతయుం గాల్చి యొరసి ఛే♦దింపకున్న
పసిడి మేలిమి యేరీతి ♦ బయలువడును! ౨౧౦

గీ. మాన్యులగువారు దోషముల్ ♦ మాటుపఱచి
గుణములను సంతసమునఁ గై♦కొనుచునుంద్రు;
హరుఁడు హాలాహలము కంఠ♦మందు దాచి
యింపుమైఁ జంద్రు నెత్తి నె♦క్కించుకొనఁడె! ౨౧౧

గీ. ఘనులు సుఖములు కష్టముల్ ♦ గలుగునపుడు
నేకరీతిగనే యుందు ♦ రిది నిజంబు;
పట్టభద్రతయున, వన♦వాస మనిన
నించుకయు రామునందు మా♦ర్పనసె నొక్కొ!

గీ. అధికులగువారు గురువుల ♦ యాజ్ఞ యెడల
మంచిచెడ్డల నిసుమంత ♦ యెంచఁబోరు;
జనకు నాదేశమును శిర♦సావహించి
భార్గవుఁడు దీయఁడే తల్లి ♦ ప్రాణములను! ౨౧౩

గీ. ఉత్తములనమ్మి సేవించు♦చున్న వారు
పూర్తిగాఁ గృతకృత్యతఁ ♦ బొందఁగలరు;
విశ్వనుతుఁడగురాము సే♦వించుకతన
నాంజనేయుండు ధన్యత్వ♦మంద లేదె! ౨౧౪

గీ. ఘనులువల్కెడు స్వల్ప వా♦క్యంబు నేని
ధరణి మానవులెల్ల నౌ♦దల ధరింత్రు;
జనపతులుఁగూడ రోహణా♦చలములోని
రాతిముక్కను దాల్తురు శి♦రంబులందు. ౨౧౫

గీ. అల్పుల స్తుతించినను గాని ♦ యట్టి పనులు
ఘనుని సేవింప సులభంబు♦గా ఫలించు;
మాటికిని సాకులం బ్రితి♦మాలుకంటె
వాదిపాదముల్ పట్టినఁ♦గాదె మేలు! ౨౧౬

గీ. ఉత్తముఁడు ప్రకాశ♦మొందించు సుగుణంబు
అవగుణంబుఁజూపు ♦ నధముఁడెపుడు;
అవనియందుఁజందురుఁ ♦ డమృతంబువర్షించు
[illegible]

గీ. అధముఁడెప్పుడు ధనము ♦ నాశించుచుండంగ
ఘనుఁడు గౌరవమునె ♦ కాంక్ష సేయు;
చెరువునొద్ద కొంగ ♦ చేరిచేపలఁగోర
హంస నిర్మలత్వ ♦ మభిలషించు. ౨౧౮

గీ. ఎట్టి ఘోరకష్ట♦మేని యుత్తముఁ డోర్చుఁ
గాక యధముఁ డోర్వఁ♦గలఁడె సుంత!
రత్న మొకఁడె సాన♦రాతి ఘర్షణ మోర్చుఁ
జేరి నిల్వఁగలదె ♦ చిల్లపెంకు! ౨౧౯

గీ. స్మరణమాత్రాన నుత్తముల్ ♦ సంతసింప
నధములు ధనంబుచే మోద♦మందుచుంద్రు;
జపముచే దేవతలు సుప్ర♦సన్నులైన
నకట! భూతముల్ బలిచేత ♦ హర్షమొందు. ౨౨౦

గీ. భవ్యుఁడు పరోపకృతికి ద్ర♦వ్యంబుఁ గూర్ప
హీనుఁడును గూర్చుఁ బొట్టనిం♦డించుకొనఁగ;
ఉదధిఁ జేరు మేఘము భూమి ♦ నుద్ధరింప
నాత్మతృప్తికై డాయు ద♦వానలంబు. ౨౨౧

—♦ అధముఁడు ♦—

గీ. ఎంత గొప్పచోట♦నేని యుండునుగాక
యధముఁ డుత్తమత్వ ♦ మంద లేఁడు;
రాజితంబులైన ♦ రాజ హర్మ్యములందుఁ

గీ. అధమునకు గౌరవంబిచ్చి ♦ నంతమాత్ర
నుత్తమగుణంబు రవ్వంత ♦ యొదవఁబోదు ;
ఘనమయిన పంజరంబులోఁ ♦ గాకి నుంచఁ
జిలుక పలికిన రీతిగాఁ ♦ బలుకగలదె ! ౧_౧౩

గీ. నీచుఁ డెంత ధనాఢ్యుఁడై ♦ నెగడుచున్న
నుత్తముఁడు వాని సన్నిధి ♦ నుండఁబోఁడు;
పక్వ ఫలసంతతులతోడఁ ♦ బరగుఁగాక
చేరునే హంస బూరుగ ♦ చెట్టుమీద ! ౧_౧౪

గీ. ఘనతఁబొందిన యుత్తముఁ ♦ గాంచినంత
నల్పుఁడు విరోధ భావంబు ♦ నందుచుండు;
ఎంతయుం బూర్ణచంద్రు వీ♦క్షించినంతఁ
గుటిల రాహువు కబళింపఁ ♦ గోరకున్నె ! ౧_౧౫

గీ. పరుల యన్నంబుఁ దిని సదా ♦ బ్రదుకు నధముఁ
డెట్టి గుణవంతుఁడైన గ♦ణింపఁబోరు;
బాల్యమునఁ దమచేఁ బెంపఁ ♦ బడినయట్టి
కోకిలను లెక్కసేయునే ♦ కాకిమూక ! ౧_౧౬

గీ. పరులచే నొకింత ♦ బలము సంపాదించి
యదరిపడుచునుండు ♦ రధము లెల్ల;
అల్ల మేఘుఁ డొసఁగి♦నట్టి నీరము ద్రావి
కప్ప లెల్ల [illegible]

గీ. అల్పమైన సుఖము ♦ నందుచుండిన మాత్ర
నదరిపడుచునుండు ♦ రధము లెపుడు;
మురిగి కంపుఁగొట్టు ♦ బురదనీటిని ద్రావి
కప్ప కూయకున్నె ♦ కాఱుకూత! ౨౨౮

గీ. శూరవరుని గంటఁ ♦ జూడకున్నంత నే
పదరిపడుచునుండు ♦ రధము కెల్ల;
పాము తనదుకంటఁ ♦ బడనంతకాలంబుఁ
గప్ప లఱవకున్నె ♦ కడుముదమున! ౨౨౯

గీ. వీరవరుని రాక ♦ విని శూరులడలంగ
నిర్భయముగనుండ్రు ♦ నీచజనులు;
సింహగర్జనంబు ♦ చెవిసోక నేన్గులు
పరువులెత్తు; నిలుచుఁ ♦ బందులెల్ల! ౨౩౦

గీ. హీనుఁడైనవాని ♦ నెంత పూజించిన
మానఁబోఁడు వాని ♦ హీనబుద్ధి;
కుక్కనందలమునఁ ♦ గూర్చుండఁ బెట్టిన
నెముక కంటఁబడిన ♦ దుముకుగాదె! ౨౩౧

గీ. గొప్పవారిలోని ♦ గుణము రవ్వంతైన
నెఱుఁగఁజాలఁడెందు ♦ హీనజనుఁడు;
ఘుమ్ము ఘుమ్ము మనెడు ♦ గంధంపుఁబొడితావి
గాడ్దె సుంతయెఱుఁగఁ ♦ గలుగునొక్కొ! ౨౩౨

గీ. ఘనులచెంతనుండ్రు ♦ గాక నీచాత్ముల
నెవ్వఁడేని గార♦వింపఁబోఁడు;
చెలఁగి రాజవరులఁ ♦ జేరియుండునుగాక
కుక్క పొందఁగలదె ♦ గొప్పతనము! ౨౩౩

గీ. జగతి కెల్ల మేలు ♦ సలుపు నుత్తముఁడేని
యధములకు విరోధి ♦ యగును జుమ్మ;
ఎల్లరకు ముదంబు ♦ నిచ్చెడు చంద్రుఁడే
జారచోరతతికి ♦ శత్రుఁడగును. ౨౩౪

గీ. జన్మభూమి వదలి ♦ చనినంతఁ బెఱచోట
నధముఁడెపుడు బాధ ♦ నందఁగలఁడు;
కప్ప చెరువువీడి ♦ గట్టుఁ జేరినయంతఁ
గాకివలన బాధఁ ♦ గాంచకున్నె! ౨౩౫

గీ. మంచి చోటునందు ♦ నుంచినన్ నీచుని
సహజ దుర్గుణంబు ♦ సడలఁబోదు;
స్వచ్ఛమైన గంగ ♦ జలములోఁ జేర్చినన్
బంది బురదమీఁద ♦ భ్రాంతి విడునె! ౨౩౬

గీ. అధముఁ డెంతయుఁ గష్టంబు ♦ నందుఁగాక
పూర్ణమైనట్టి ఫలమును ♦ బొందలేఁడు;
మూట లెన్నని యోర్పుతో ♦ మోయుఁగాక
గాడిదకు మేత యుండునే ♦ కడుపునిండ! ౨౩౭

గీ. అల్లుఁడగువాని కధికార ♦ మబ్బినంత
నెల్లజనులను మిగుల వే♦ధింపఁగలఁడు;
"తేలునకుఁ బెత్తనం బీయఁ ♦ దెల్లవార్లు
కఱచుచుండు" నటన్న వా♦క్యంబు వినమె! ౨౩౮

గీ. కాంచఁగా నెందుకుం గొఱ♦గాని వారె
యెల్లపనులకు ముందుగా ♦ నేగుదెంత్రు;
పైస నీయనివాఁలే ♦ పడవమీఁద
నధివసింపరె యందఱ♦కంటె ముందు! ౨౩౯

గీ. భవ్యచరితు లచింత్యప్ర♦భావులగు మ
హాత్ములను గూడ దూషింత్రు ♦ రల్పమతులు;
అఖిలలోకైక పూజ్యుఁడై ♦నట్టి కృష్ణుఁ
జేదినాథుండు కడు నింద♦ సేయఁడొక్కొ! ౨౪౦

గీ. మానహీనుండు స్వల్ప సం♦పాదనమునఁ
దృప్తిఁగనుఁగాక శ్రమమింత ♦ తీరఁబోదు;
ఎముక నొకదానిఁ గని కుక్క ♦ యెగిరిపడును
ఆకలి శమించునొక్కొ ర♦వ్వంతయైన! ౨౪౧

—♦ మహాత్ముఁడు ♦—

గీ. పరుల దోషములను ♦ బరికించియు మహాత్ము
లంతరంగమున నె ♦ యుంత్రువాని;
కాలకూటమెల్ల ♦ గ్రసియించి విడువక
శివుఁడు కంఠమందుఁ ♦ జేర్చికొనఁడె! ౨౪౨

గీ. అరయ నెట్టి దుష్టు♦లైన మహాత్ముల
చెంతఁ జేరి వారిఁ ♦ జెఱుపలేరు ;
కంఠసీమ యందుఁ ♦ గాలకూటము సేర
శివున కేమియైనఁ ♦ జేటుకలదె ! ౨౪౩

గీ. అల మహాత్ము లాప♦దలఁ బొందుచుండియుఁ
గొందఱకు ముదంబుఁ ♦ గూర్చుచుంద్రు;
చందురుండు క్షయము ♦ నొందుచుండియుఁగూడ
నమరులకు నొసంగు ♦ నమృతరసము ! ౨౪౪

గీ. జగతి నొక్క మహాత్ముని ♦ శక్తివలన
అన్యుల సమస్తశక్తులు ♦ నడఁగుచుండు;
సన్నుతంబైన సూర్య తే♦జంబువలనఁ
దారకల కాంతియంతయుఁ ♦ దఱిగిపోదె ! ౨౪౫

గీ. ఎంచఁగా నీచుఁడు దిరస్క♦రించినంతఁ
దఱిగిపోదు మహాత్ము ను♦ద్దండశక్తి;
వాయసము నెత్తిపై రెట్ట♦ వేయునంత
నేన్గు గొప్పతనంబు క్షీ♦ణించునొక్కొ ! ౨౪౬

గీ. ఎంత గర్వవంతు♦లేని మహాత్ముల
చెంత నమ్రులగుచుఁ ♦ జెలఁగుచుంద్రు;
అమిత గర్వియైన ♦ యా వింధ్యగిరి మాని
పాదయుగము చెంత ♦ వ్రాలలేదె ! ౨౪౭

గీ. గొప్పవారికి నాపదల్♦గూడ దీర్ఘ
కాలము శ్రమంబు గల్గింపఁ♦జాలకుండు;
తలఁపఁ జంద్రుని కల రాహు♦వలనఁగలుగు
కష్టకాలంబు స్వల్పంబు♦గాకయున్నె! ౨౪౮

గీ. నెగడుదురు మహాపురుష సా♦న్నిధ్యమందు
సజ్జనులు దుర్జనులు వైర♦సరణి వీడి;
చంద్రసర్పంబు, లనలంబు ♦ జలముఁగూడి
శివునిసన్నిధి మైత్రితోఁ ♦ జెలఁగుఁగాదె! ౨౪౯

గీ. ఖలులచే నెంతయును బాధ ♦ గలుగుఁగొలఁది
ఘనుల మహిమంబు స్పష్టమై ♦ కానుపించు;
బూడిదను మాటిమాటికిఁ ♦ బూయుఁగొలఁది
అమలతేజంబు గలుగదే ♦ యద్దములకు! ౨౫౦

గీ. ఇల మహాత్ముల మహిమచే ♦ నితరులెల్లఁ
బొందు మేలు సమీపస్థు ♦ లొందఁబోరు;
దీపమునఁ జుట్టుపట్లఁ బ్ర♦దీప్తి గలుగఁ
గ్రిందిభాగంబు చీకటి ♦ నొందకున్నె! ౨౫౧

గీ. పిలువకున్నను మహితుల ♦ పేరువినుచు
నెందఱో వచ్చి యుపకార ♦ మందుచుంద్రు;
బహుఫలాన్వితమగు పాద♦పంబుకడకు
నెల్లపక్షులు స్వయముగా ♦ నేగిరి చనవె! ౨౫౨

గీ. హీనులైన వార ♦ లెంత నిందించినఁ
గోపమూనఁబోరు ♦ గొప్పవారు;
నక్కలెల్ల మదపుఁ ♦ దిక్కెక్కి దూషింప
సింహ మింత లెక్క ♦ సేయు నొక్కొ! ౨౫౩

గీ. బహుళ కష్టగతులు ♦ ప్రాప్తించినను గూడ
ఘనులు హీనబుద్ధిఁ ♦ గాంచఁబోరు;
ఎండ వేడిచేత ♦ నెంత తపించియు
నేన్గు బురదనీటి ♦ కేగునొక్కొ! ౨౫౪

—♦ సుపుత్రుఁడు ♦—

గీ. గుణగణాఢ్యుఁడైన ♦ తనయుఁడొక్కఁడుచాలు
నేమిఫలము నీచు♦లెందఱున్న?
చందురుం డొకండె ♦ జగమెల్ల వెలిగించుఁ
జుక్క లెన్నియున్న ♦ శోభకలదె! ౨౫౫

గీ. పరమధార్మికుండొ ♦ పండితవర్యుఁడో
గాని సుతునివలన♦గలదె ఫలము!
పాడిదైన లేక ♦ చూడిదియైనను
గాని ధేనువునకుఁ ♦ గలదె విలువ! ౨౫౬

గీ. ఖలులు పదిమందిబిడ్డలు ♦ గలుగుకంటె
నొక్కఁడైనను జాలఁడే ♦ యుత్తముండు!
పంది తా వందపిల్లలఁ ♦ బడయుఁగాక
యేన్గునకుఁబుట్టు నొకపిల్ల ♦ కీడుగావు! ౨౫౭

గీ. ఎంచఁగా నొక్కనికిఁ బుత్త్రు♦లెందఱున్న
నెవ్వఁడో యొక్కఁడే కీర్తి ♦ నెనయఁగలఁడు;
శంఖములుపుట్టె నెన్నియో ♦ సాగరమునఁ
బాంచజన్యంబె హరిమెప్పు ♦ వడయఁగలిగె. ౨౫౮

గీ. సర్వగుణభూషితుఁడుఁ గళా♦సహితుఁడైన
తనయుఁగని తండ్రి మిగుల మో♦దంబుఁగాంచు;
పచ్చనై ధాన్యకలితమౌ ♦ పైరుఁజూచి
చెలఁగఁడే సంతసమునఁ గృ♦షీవలుండు! ౨౫౯

గీ. ఎన్నివిధముల సంపద ♦ లున్ననేమి?
సుతులులేని గృహంబది ♦ శూన్యమెయగు;
పలురకంబుల పక్షులు ♦ వెలయుఁగాక
హంస లేనట్టి చెరువున ♦ కందమున్నె! ౨౬౦

గీ. తల్లిదండ్రులఁ బోషించి ♦ ధన్యుఁడైన
యుత్తమ సుతుండు చాలఁడే ♦ యొక్కఁడేని!
'అచ్చివచ్చినచో భూమి ♦ యడిగెడైన
జాలు' ననుమాట వెలయదే ♦ జగతియందు! ౨౬౧

## —♦ కుపుత్త్రుఁడు ♦—

గీ. దుష్టుఁ డొక్కఁడు కులమునం♦దున జనింప
నా కులంబెల్ల నాశన♦మందు నిజము;
అరయఁగా నొక్క తొఱటలో ♦ నగ్నియున్నఁ
గాల్చుకుండునె గొప్ప వృ♦క్షంబునెల్ల! ౨౬౨

గీ. ఎంచఁగా నీచులగు పుత్త్రు ♦ లెందఱున్నఁ
దల్లిదండ్రుల భారంబు ♦ తఱుగఁబోదు;
గాడిదల కెన్ని పిల్లలు ♦ గలిగియున్నఁ
జాకిమూటలు మోయవే ♦ చచ్చువఱకు! ౨౬౩

గీ. శూరులగు పుత్త్రులను జాల ♦ గారవింప
జనకునకుఁ గష్ట మెంతేని ♦ సంభవించు;
ఇంటి దీపమటంచు ము♦ద్దిడిన కొలఁదిఁ
గాలకుండునె మూతి మీ♦సాలు రెండు! ౨౬౪

గీ. తలఁప నుత్తములౌ తల్లి♦దండ్రులకును
బుట్టుదు రొకప్పు డధములై♦నట్టి సుతులు;
అఖిలలోకైక పూజ్యులై ♦ నట్టివారి
కవతరింపఁడె కడు నింద్యుఁ♦డైన మరుఁడు! ౨౬౫

—♦ దాత ♦—

గీ. ప్రాణహాని తనకుఁ ♦ బ్రాప్తించినను గూడ
దాత లోభగుణముఁ ♦ దాల్పఁబోఁడు;
నీరు చల్లినంత ♦ నారిపోవునుగాక
యగ్ని చల్లఁదనము ♦ నందునొక్కొ! ౨౬౬

గీ. ధనము క్షీణించుఁగాక యు♦త్తమ జనుండె
యాచకుల కోర్కెఁదీర్పంగ ♦ నర్హుఁడగును;
ఎండిపోయిన దగుఁగాక ♦ యేరు; దాని
యందె జలమునకై త్రవ్వు♦చుందురు జనులు. ౨౬౭

గీ. ఇలను సామాన్యమానవు ♦ లెందఱున్న
దాతవలె యాచకుల నెల్లఁ ♦ దనుపలేరు;
ఎంచఁగా నన్యవృక్షంబు ♦ లెన్నియున్నఁ
గామ్యములఁ దీర్చునే కల్ప♦కంబువోలె! ౨౬౮

గీ. హీనుఁడైనను దాత సే♦వింప నర్హుఁ
డధికుఁడైనను లోభి యన♦ర్హుఁడగును;
జలముకై చిన్న బావికిఁ ♦ జనునుగాక
సంద్రమున కేగునే యెట్టి ♦ చవటయైన! ౨౬౯

గీ. సమయమెఱిఁగి వచ్చు ♦ జనునకే ధనమిత్తు
ననెడువాఁడు దాత♦యనఁగఁ దగఁడు;
కాలమందె ఫలముఁ ♦ గాంచఁగల్గినచెట్టు
కల్పవృక్షమనెడు ♦ ఖ్యాతిఁగనునె! ౨౭౦

గీ. అత్యుదారులగుచు ♦ నలరారువారికి
నీయరానివస్తు ♦ వేదికలదు?
జీవమొసఁగఁడొక్కొ! ♦ జీమూతవాహుండు
ఎముక దివిచి యీయఁ♦డే! దధీచి. ౨౭౧

గీ. ఒక్క దుర్గుణమేదేని ♦ యుండుఁగాక
దాతయగువాఁడు జనుల స్తో♦త్రముల వడయు;
చంచలత్వమ్ము మేఘంబు ♦ గాంచుఁగాక
జలమొసఁగి జీవకోటి ప్ర♦శంసఁగనదె! ౨౭౨

గీ. దాతయగు రాజుఁ జేరు వి♦ద్వజ్జనులును
ధాతృతం గాంచి కీర్తిచేఁ ♦ దనరఁగలరు;
సాగరము నాశ్రయించెడు ♦ జలదములును
జీవనమొసంగి ప్రజల ర♦క్షింపకున్నె! ౨౭౩

గీ. పూన్కిమై దాచినను నిల్వఁ♦బోదు ధనము
కాన దానంబు సేయుటే ♦ ఘనతరంబు;
కర్ణ శిబి విక్రమార్కాది ♦ ఘనుల కీర్తి
శాశ్వతంబై వెలుంగదే ♦ జగతియందు! ౨౭౪

గీ. యోగ్యులకు దాన మొనరించు ♦ టొప్పు నిలన
యోగ్యుల కొనర్ప వ్యర్థమౌ♦చుంట నిజము;
ఎప్పుడును శుక్తిలోఁ గాక ♦ యిసుకయందుఁ
బడ నిరర్థకమగుఁ గదా ♦ స్వాతి చినుకు! ౨౭౫

గీ. దాత తనద్రవ్యమెల్లఁ బే♦దలకు నిడి ద
రిద్రుఁ డగుఁ గాక సత్కీర్తి ♦ వృద్ధియగును;
సానదీరిన రత్నంబు ♦ తూనికయెడఁ
దఱుగువడుఁ గాక వెలచాలఁ ♦ బెరుగుఁ గాదె! ౨౭౬

గీ. ఎవ్వఁడో యొకకొంత యా♦చించినంత
దాత యెల్లర కమితమో♦దంబుఁ గూర్చు;
చాతకముగోర నొక రెండు♦జలకణములు
నీటితో నింపదే ధరణి ♦ నీరదంబు! ౨౭౭

—♦ లోభి ♦—

గీ. ధనము నార్జించుఁగాక దా♦ననుభవింప
నేని యసమర్థుఁడగు లోభి♦యైనవాఁడు;
పొలతి గల్గునుగాక న♦పుంసకుండు
ఇంచుకైనను దాను సు♦ఖింపఁగలఁడె! ౨౭౮

గీ. ఎంతయును లోభి ధనధాన్య♦వంతుఁడైన
వాని చెంతకుఁబోరు వి♦ద్వాంసు లెపుడు;
చక్కఁదనము, బలంబు నె♦సంగుఁగాక
చాన యరుదెంచునే నపుం♦సకుని కడకు! ౨౭౯

గీ. పరివిమలానందకరములౌ ♦ కవుల నుడులు
అనయమును లోభులకు నస♦హ్యంబులగును;
తరుణిగావించు సొగసులుం ♦ దళుకుబెళుకు
లల్ల ముదిమగనికి నాగ్ర♦హంబునిడవె! ౨౮౦

గీ. విద్య హృద్యానవద్యమై ♦ వెలయు నెడల
లోభు లాదరింపకయున్న ♦ లోపమేమి?
షండులగు మానవుల తిర♦స్కార వశతఁ
గాంతకుచకుంభముల కింత ♦ కాంతి చెడునె! ౨౮౧

గీ. అతులితంబైన సంపద ♦ యమరియున్నఁ
బరుల సంపదకై యాస♦పడును లోభి;
పరమసౌందర్య ఖనియైన ♦ భార్యయుండఁ
క్రూరుఁ డేవేళఁ బరసతిం ♦ గోరకున్నె! ౨౮౨

గీ. అనుభవింపఁడు ధర్మ కా♦ర్యముల కిడఁడు
భ_క్తితో లోభి ధనముఁ గా♦పాడుచుండు;
పైరుపంటల నేవేళఁ ♦ బరులకొఱకుఁ
గష్టపడి కాచుచుండదే ♦ దృష్టిబొమ్మ! ౨౮౩

గీ. ఎపుడు ధర్మములకు ♦ నీయకుండిన లోభి
కెంత ధనముగల్గ ♦ నేమి ఫలము!
బిట్ట బిగిసియుండు ♦ పీనుఁగు మెడ నెన్ని
పూలదండ లిడిన ♦ మేలుగలదె! ౨౮౪

గీ. దానమనుమాట స్వప్నమం♦దేని లేని
లోభి సిరిచేత జగతికి ♦ లాభమేమి?
అడవిఁగాచిన వెన్నెల ♦ యబ్ధియందుఁ
బడిన వర్షంబు జనులకే♦ఫల మొసంగు! ౨౮౫

గీ. లోభగుణ మొక్కటి మనంబు♦లోనఁగలుగ
నంతకంటెను నీచత్వ♦మరయ నేల?
ఘనతరంబగు నపకీర్తి ♦ కలిగియున్న
నింక మృత్యువుకొఱకు వాం♦ఛింప వలెనె! ౨౮౬

గీ. ఇలఁ బరోపకార ♦ హీనుఁడౌ మనుజున
కంటె దృణము వినుతిఁ ♦ గాంచఁగలదు;
భీరువులను గాచు ♦ ఘోరరణంబున
ఘాసమగుచుఁ బసుల♦కడుపు నింపు. ౨౮౭

గీ. అన్యులకు మేలుసేయని♦యట్టివాఁడు
పరమనీచాత్ముఁడగు మృత♦పశువుకంటె;
చచ్చినం బసరము దాని ♦ చర్మమేని
మిగుల లోకోపకారియై ♦ నెగడుచుండు ! ౨౮౮

గీ. ఆశ తనకులోఁబడు మాన♦వాళిచేత
నెట్టి దుష్కార్యమేని చే♦యింపఁగలదు;
లలితమని తన మోహజా♦లమునఁబడిన
విటుల నాడింపకుండునే ♦ వేశ్యకాంత ! ౨౮౯

గీ. దానమును భోగమును లేక ♦ ధనముగలిగి
నంతనే వాఁడు ధనవంతుఁ ♦ డనఁగఁదగఁడు;
అల్ల మేరువుచెంత ను♦న్నట్టివార
లెల్లరు ధనాఢ్యులనుచు వ♦చింపఁదగునె ! ౨౯౦

గీ. ఎంతయుధనంబు లోభి యా♦ర్జించుఁగాక
యించుకయు గౌరవంబు ల♦భింపఁబోదు;
ఎన్నియో భూషణముల ధ♦రించుఁగాక
మగలవలపును గాంచునే ♦ మాచకమ్మ ! ౨౯౧

గీ. దానభోగ విహీనుఁడౌ ♦ మానవుండు
బ్రదుకుచుండును గాకది ♦ బ్రతుకుగాదు;
గాలిపీల్చును విడచును♦గాక తిత్తి
అరయ నుచ్ఛ్వాసనిశ్వాస ♦ సరణియగునె ! ౨౯౨

గీ. ఎంచి లుబ్ధునిధనము హ♦రింపఁగల్గు
చతురమతులైనవారు నీ♦జగతినుండ్రు;
సంద్రమున నిండియుండిన ♦ జల మదెల్ల
క్షణములో బడబాగ్ని వ♦శంబుగాదె. ౨౯-౩

గీ. అలఘుతరమైన లోభ మ♦హాత్మ్యమెన్న
నలవియగునొక్కొ యెట్టి ప్రా♦జ్ఞులకునేని!
తనదు తేజంబు దివ్వె లం♦దునిచి మరలఁ
బడయుచుండుఁజుమీ లోక♦బాంధవుండు. ౨౯-౪

గీ. లలిత చారిత్రులగు మహా♦త్ములనుగూడ
నాశ విషువలె బాధించు ♦ ననుట నిజము;
సకలరత్నపరిపూర్ణుఁడౌ ♦ సాగరుండు
ఎపుడుఁ జంద్రోదయమును గాం♦క్షించుచుండు! ౨౯-౫

గీ. పుడమిపై లోభమునకు లోఁబడిన వార
లెట్టి పాతకమేని గా♦వింపఁగలరు;
సారతరమైనదనుచుఁ గ♦స్తూరికొఱకు
అదయులై మృగములను జం♦పుదురు సుమ్మ! ౨౯-౬

గీ. బహుళ సంపదలకు నాశ♦పడెడు వాఁడు
చుట్టముల సోదరులనేని ♦ చూడఁబోఁడు;
కౌరవాధీశ్వరుఁడు రాజ్య♦కాంక్షచేత
బాధపెట్టఁడె కృష్ణుని ♦ బాండవులను! ౨౯-౭

గీ. కాసులేకయు వీరుండు ♦ గాంచు యశము
బహుధనం బుండియును లోభి♦బడయ లేఁడు;
సహజముగ సింహమొందు తే♦జంబొకింత
కుక్కకు లభించునే పైడి♦గొలుసు లిడిన! ౨౯౮

గీ. ఇష్టమగువస్తుచయము నా♦శించునపుడు
కష్టపడలేనియపుడు సు♦ఖంబుఁగలుగు;
ధనము చేకూర్చునప్పుడు ♦ దాచునపుడుఁ
గలుగు దుఃఖంబు వదలుచోఁ♦గలుగునొక్కొ! ౨౯౯

గీ. ఎంత ధనమున్న నర్థుల♦కీయ లేని
వాఁడును దరిద్రుఁడే సుమ్ము ♦ వసుధయందు;
బహుజలంబుండి యుపయోగ♦పడని కతన
సాగరము మరు భూమితో ♦ సాటిగాదె! 300

గీ. తలఁపఁగా లోభియగువాఁడు ♦ ధనము నెపుడుఁ
జూచుకొను దానఁ గష్టముల్ ♦ చూడఁబోఁడు;
పిల్లి పాలనె తిలకించుఁ ♦ బిదపవచ్చు
కఱ్ఱదెబ్బను సుంతైనఁ ♦ గాంచఁగలదె! 30౧

గీ. పలువు రొకవస్తువున కాశ♦పడుటవలన
నెల్ల కలహంబులును సంభ♦వించుచుండు;
మును దిలోత్తమపైఁ దీవ్ర♦ మోహవశత
సుందుఁ డుపసుందుఁడును నాశ♦మొందలేదె! 30౨

గీ. ఎంచ లోభిచెంత ♦ నెంత ధనంబున్న
సొంత జనులకైన ♦ సుఖము సున్న;
సంద్రమందు నెంత♦జలముండినఁ గళాసు
బయటినీరు త్రాగి ♦ బ్రదుకవలయు. 303

గీ. మిగుల సిరులతోడ ♦ మెలఁగుచుండియులోభి
యించుకేని యనుభ♦వింపలేఁడు;
గొంతుబంటి నీటి♦కొలనిలోనుండియు
నాల్కతోడఁ గుక్క ♦ నాకుచుండు. 30౪

గీ. ఆర్యులంద్రు పూర్వ♦మందుఁ బెట్టనివారి
కిపుడు దొరకదనుచు ♦ నిది నిజంబు;
భూమియెల్ల నుదక ♦ పూరితంబైనను
చాతకమున కింత ♦ జలముగలదె! 30౫

గీ. అధికమగు నాశఁబొందిన ♦ యట్టివాఁడు
తుదకు భరియింపరాని యా♦పదలఁగాంచు;
పాండుపుత్త్రుల కైదూళ్ళుఁ ♦ బంచియీయ
నొల్లక సుయోధనుఁడు నాశ♦మొందలేదె! 30౬

గీ. కోరిక యొకింతఁ దీర్చెదు ♦ వారలున్న
నెల్ల యైశ్వర్యములఁబొంద ♦ నెంచు లోభి;
"ఆవగింజంత సందున్న ♦ నరువదైదు
గారెలందూర్తు" రనియెడు ♦ తీరువినమె! 30౭

గీ. అన్యులకు మేలొ కీడొ యే♦దైననేమి
తనదు లాభంబుమాత్రమే ♦ తలఁచులోభి;
"అట్లయిన వైద్యకట్నంబు ♦ నిట్లగునెడ
వైతరణి ధేనుదాన''మన్న ♦ వాక్కులేదె! ౩౦౮

గీ. సతిని జేకొని లోభి సం♦సారసుఖము
నందుటకుఁగూడఁ గడుభీతిఁ♦జెందుచుండు;
కర్మగతిచేత బిడ్డలు ♦ గలుగునెడల
నార్జిత ధనంబుకొంత పా♦డగునుగాన. ౩౦౯

గీ. యాచకుని గాంచినంతనే ♦ యదరిపడెడు
పిసినిగొట్టులు నడయాడు ♦ పీన్గులుండ
తరులు గిరులు మహాసము♦ద్రములు భువికి
భారమని పల్కు టది వెఱ్ఱి♦పలుకుగాదె! ౩౧౦

గీ. అమిత సాహాస మతి కష్ట ♦ మతివిచిత్ర
మేమని వచింపఁగావచ్చు ♦ నివి గూర్చి
ఎంచకయె ప్రాణములనైన ♦ నిచ్చుఁగాని
యీయఁగాఁజాలఁడొక పైస♦యేని లోభి. ౩౧౧

గీ. అర్థిపొగడంగ లోభియు ♦ నతనిఁబొగడు
వర్ణనమొనర్పఁదాఁజేయు ♦ వర్ణనంబు
అంతమున నేగుచున్నాఁడ♦నంచుఁ బలుక
మనమునంబొంగి వంగి న♦మస్కరించు! ౩౧౨

గీ. అధిక మధురామ్లరుచ్యంబు ♦ లమరియుండ
మట్టిఁదిన గర్భవతి కిచ్చ♦పుట్టినట్లఁ
గారణము వేఱె యుండునే ♦ గర్భమందు
నొక్క లుబ్ధుండు నివసించు♦చుంట దక్క ! ౩౧౩

గీ. పామునకు రాహునకు సుధా♦పానవశత
జిహ్వయు శిరంబుఁ జెడెనన్న ♦ చింతచేత
మిగుల భయమందుచుం బెడ♦మొగము వెట్టి
తారు నిల లోభి కావ్యామృ♦తంబటన్న. ౩౧౪

గీ. తెల్లఁబడుఁగాక వెంట్రుక♦లెల్లఁ, బండ్లు
రాలుఁగాక, కన్నులుఁ గాన♦రావుగాక
ఇంచుకేనియుఁ బురుషుం ద్య♦జింపఁబోదు
ఆశతో సాటియగుసాధ్వి ♦ యవనిగలదె ! ౩౧౫

గీ. ఆశయనునది లుబ్ధ జ♦నాళికెల్లఁ
జిత్రమగు సంకెలయటంచుఁ ♦ జెప్పవచ్చు;
పరుగులిడుదురు బంధింపఁ ♦ బడినవారు
బంధము సడల్పఁగూర్చుందు్రి ♦ పంగులవలె! ౩౧౬

గీ. జవ్వనము వార్ధకంబుచేఁ ♦ జచ్చిపోవ
వ్యాధివలన నారోగ్యంబు ♦ వదలిచనఁగ
జీవమునుగూడ మిత్తి భ♦క్షింపనుండ
ఆశమాత్రము సుఖముగా ♦ నలరుచుండు. ౩౧౭

గీ. హస్తముననుండి పేటిక♦యందునుండి
యీవల దాఁకింత నోటిప♦ల్కివ్వఁటన్నఁ
జింతిలును లోభియని గేలి♦సేయ నేల ?
తిట్టవలె వానిఁ బుట్టించి♦నట్టి విధిని. ౩౧౮

గీ. సంపదను గాంచియును లోభి ♦ సౌఖ్యమందఁ
డనుచు దూషించుట యధర్మ♦మగు నొకప్డు;
అన్యునకు నీయఁగాఁ దగి♦నట్టి కూతు
తోడఁ దండ్రి సుఖించుట ♦ పాడియగునె ! ౩౧౯

గీ. అరయఁగా లోభితో సాటి♦యైనదాత
పుట్టఁగాలేదు మున్ముందుఁ ♦ బుట్టఁబోఁడు;
కూర్చిపేర్చిన లక్షల♦కొలఁది ధనము
నిచ్చును స్పృశింపకయె తాను ♦ జచ్చునపుడు. ౩౨౦

—♦ యాచకుఁడు ♦—

గీ. విద్య, సుజనత్వమును; శౌర్య ♦ వీర్యపటిమ
సర్వమును యాచ్ఞవలన నా♦శంబుగాంచు;
పాడి దప్పిన యొక రంకు♦లాఁడివలన
వంశగుణ గౌరవాదులు ♦ వమ్ముగావె ! ౩౨౧

గీ. ఇతరులంజేరి ధనము యా♦చించుకంటెఁ
గటికి దారిద్ర్యమేని యో♦ర్చుటయె మేలు;
వ్యాధిపీడితునకె గాక ♦ యౌషధంబు
బాగుగ సుఖించునట్టి నీ♦రోగి కేల ! ౩౨౨

గీ. తృణముకంటెను దూదియే ♦ తేలికయగు
నంతకంటెను దేలిక ♦ యాచకుండు;
తన్నెటులనైన యాచించు♦నన్న భీతి
వాయువీతనిఁ బైకెత్తి ♦ వేయకుండె. ౩-౨౩

గీ. కంఠమున మాటరాకుంట, ♦ కాయమెల్లఁ
జెమటపట్టుట, మొగమెంతో ♦ చిన్నవోయి
వెల్లనైయుంట సర్వంబు ♦ వీకు సేయఁ
జావనున్నట్టివాఁడు, యా♦చకుఁడు నొకటె. ౩-౨౪

గీ. ఆస్యముననుండి వెడలు యా♦చ్ఞాక్షరముల
తోడనే పంచప్రాణముల్ ♦ గూడ వెడలు;
దాత యిచ్చెదనన్న యా♦దరపుఁబలుకుఁ
జేరి కర్ణంబులం బ్రవే♦శించు మఱల. ౩-౨౫

గీ. ఎంత ఘనుఁడేని యొరు నాశ్ర♦యించు నెడల
క్షణములో వాని ఘనత నా♦శంబుఁ గాంచు;
బరువుగలయట్టి పెనురాతి ♦ బండయేని
తెప్పనుంజేరి నీటిపైఁ ♦ దేలకున్నె ! ౩-౨౬

గీ. పరుల ధనమునకై యాస♦పడు నరుండు
ఎట్టి యావమానమేని స♦హించుచుండు;
భ్రమరములు వీనులం గొట్టఁ♦బడును గాక
యేన్గు గండస్థలంబుఁ ద్య♦జించునొకొ ! ౨-౧౨

గీ. యాచనంబున నరుని మ♦హత్త్వమెల్ల
సత్వరంబుగ నశియించు ♦ జగతియందు;
బలిని యాచించి తనకోర్కె ♦ వడయునెంచి
వామనుఁడుగాఁడె శ్రీరమా♦వల్లభుండు ! ౩౨౮

గీ. ఉత్తముండును నముద్రైడై ♦ యొకోర్కెవ్వ
డెంచి యితరుల మిగుల యా♦చించుచుండు;
తలఁపగాఁ గౌస్తుభాది ర♦త్నములకొఱకు
నంబుధిని వేడలేదె నా♦రాయణుండు ! ౩౨౯

గీ. ఫలమునొసఁగెడు గుణమింత ♦ గలిగెనేని
ఎంత ధనహీనునైన యా♦చింపఁదగును;
వస్త్రములునేయ నుపయోగ♦పడునటంచు
నభిలషింపరె నీరసం♦బైన ప్రత్తి ! ౩౩౦

గీ. కాకియును యాచకుం డొక్క ♦ క్రమమువారె
కాని యిర్వురిలోఁ గొంత ♦ కాకిమేలు;
కాకి మేతకై పిల్చును ♦ గాకములను
యాచకుఁడు పారఁదోలును ♦ యాచకులను. ౩౩౧

గీ. జనులు భారంబుగానుండుఁ ♦ జచ్చినపుడు
కానఁబడె నేటి కద్దాని ♦ కారణంబు;
ధరణిలో లాఘవమున కా♦ధారమైన
యాచనంబు శవంబుల ♦ నంటఁబోదు. ౩౩౨

గీ. పగులకై సంద్రమున నీటఁ ♦ బడయు కార
ణమున మేఘంబు నిలువెల్ల ♦ నల్లఁబడఁగ;
తనకొఱకు నన్యుల ధనంబుఁ ♦ గొనెడువాని
వదన మది నల్లబడుట న♦బ్రంబు గలదె! 333

గీ. కుత్సితుల కొంపకేగని ♦ కుంటివాఁడు
క్రూరకర్ములఁ గనఁబోని ♦ గ్రుడ్డివాఁడు
ధన మదోన్మత్తు పల్కు వి♦నని బధిరుఁడు
యాచకునికంటె మిగుల ధ♦న్యాత్ము లరయ. 33౪

గీ. ఘనతరంబగు నాశ ముం♦దునకుఁ ద్రోయ
లజ్జ మెడఁబట్టి వెన్కకు ♦ లాగుచుండుఁ
గాన నీ రెంటి మధ్యభా♦గమునఁ జిక్కి
యాచకుని మానసం బూగు♦లాడు నకట! 33౫

గీ. యాచ్ఞ పరుష మొ, మఱి హాలా♦హలము కటువొ
రెండును సమానగుణముతో ♦ నుండఁగలవొ
తెలిపి శంకర! యీ శంకఁ ♦ దీర్పుమయ్య!
భేదము నెఱుంగును గదయ్య! ♦ నీదునాల్క. 33౬

—♦ ప్ర భు వు ♦—

గీ. అవనినాయకుఁ డవివేకి ♦ యైన యెడల
నఖలవిద్యలు గూడ ని♦రర్థకములు;
పురుషుఁడు నపుంసకుండైనఁ ♦ దరుణి నిండు
జవ్వనంబెల్ల వ్యర్థమై ♦ చనకయున్నె! 33౭

గీ. కోపమును, బ్రసాదంబును ♦ గొంచెమేని
సార్థకముగాని ప్రభువేల ♦ జగతియందు?
అరయఁగా షండుఁడగునట్టి ♦ పురుషుచెంతఁ
జేర వాంఛించు నాకో యే ♦ చెలువయేని! ౩౩౮

గీ. శక్తిలేనివాఁడు ♦ జనపతి యైనచోఁ
బ్రజల ఘనతగూడఁ ♦ బదటఁగలియు;
వావి విడచి వెళ్ళె ♦ వాని పెండ్లాము
వదినె! యనరె వాడ ♦ వార లెల్ల! ౩౩౯

గీ. క్రూరుఁడైన రాజు ♦ కొలువు సేయుటకంటె
నడవిలో వసించు ♦ టదియె ఘనము;
ధూర్తుఁడైన భర్తతోఁ ♦ గాపురము కంటె
సరసిజాక్షి కేఁదుఁ ♦ జావు మేలు. ౩౪౦

గీ. క్రూరుఁ డగురాజుచే మెప్పు ♦ గొనుటకంటె
సామ్యుచే శిక్షఁబొందుట ♦ చాల ఘనము;
అధమునకు భార్యయై సౌఖ్య ♦ మందుకంటె
నుత్తముని పత్నియై బాధ ♦ నొందఁదగదె! ౩౪౧

గీ. రక్షణాదిగుణంబుల ♦ రాజుప్రజకు
హర్ష మొనఁగూర్పకున్న ని ♦ రర్థకుఁడగు;
పాల నిడి బిడ్డయాఁకలిఁ ♦ బాపలేని
మేకమెడ చన్నులట్ల సుంత ♦ మేలుగలదె! ౩౪౨

గీ. శౌర్యహీనుఁడైన ♦ జనపతిం దనవారు
నితరులును దిరస్క♦రించుచుండ్రు;
వేడిలేకయున్న ♦ బూడిదం బదముతోఁ
ద్రొక్కుచుందు రనుట ♦ నిక్కువంబు. ౩౮౩

గీ. రాజు సర్వగుణ వి♦రాజితుం డైనను
ఖలుల మధ్యముననె ♦ మెలఁగుచుండు;
అతిసుగంధయుక్త♦మగు కేతకీసుమం
బెవుడు ముండ్లనడుమ♦నే వసించు. ౩౮౪

గీ. క్షితిపతుల చెంతఁ గ్రూరులు ♦ చేరియుందు
రనుటలో నబ్బురము గొంచె♦మైన లేదు;
వరనిధానంబుకడఁ గ్రూర♦తరములైన
సర్పములు చేరియుండవే ♦ సంతతంబు! ౩౮౫

గీ. రాజ్యమెల్ల దుష్టులకు స♦ర్పణముఁ జేసి
సౌఖ్యములఁ గోరురాజు నా♦శమును గాంచు;
పాలకుండను బిల్లుల♦వద్దఁ జేర్చి
హాయిగా నిద్రపోవుట ♦ హాని గాదె! ౩౮౬

గీ. ప్రభువు దుర్మార్గుఁడైనను ♦ బ్రజలు వాని
యాజ్ఞఁ బాలింతు రితడా భ♦యంబువలన;
మగఁడు దానెంత పాపిష్ఠు ♦ డగునుగాక
కులసతియు దెబ్బలకునోడి ♦ కొలువకున్నె! ౩౮౭

గీ. ఎంతమందిని గవులఁ బో ♦ షించుచున్న
ఫలము గలుగదు విరసుఁడౌ ♦ పార్థివునకు;
ఎంచ గురివెందనగల ధరించు బోయ
స్వర్ణకారునిచే మేలు ♦ వడయఁగలదె! ౩౪౮

గీ. పామరుండగు భూపతిం ♦ బ్రస్తుతించు
కతన సత్కవులకు మేలు ♦ గలుగఁబోదు;
అమలమైయొప్పు చుండెడు ♦ నద్దమేని
యంధున కొసంగ ఫలము ర ♦ వ్వంత యున్నె! ౩౪౯

గీ. ఎంత గుణహీనుఁడైనను ♦ జెంతఁజేరు
వానినే యాదరించు భూ ♦ వల్లభుండు;
ఎన్నివంకలు దిరిగిన ♦ నేని తనదు
పజ్జఁగల చెట్టుపై; దీగ ♦ పాకుఁగాదె! ౩౫౦

గీ. అరయఁగా లోకబాంధవుం ♦ డగు ప్రభునకుఁ
బ్రజల బిడ్డలవోలెఁ గా ♦ పాడుట విధి;
అనయమును లోకబాంధవుం ♦ డగు నినుండు
కోరి జీవులకెల్ల మే ♦ ల్గూర్చుగాదె! ౩౫౧

గీ. పావనచరిత్రులైన సే ♦ వకులవలన
నెల్లకార్యముల్ ప్రభువు సా ♦ ధింపఁగలఁడు;
తలఁపఁగా నాంజనేయుని ♦ వలనఁ గాదె
జనకకన్య లభించె రా ♦ మునకు మున్ను. ౩౫౨

గీ. అధిపుల కనుగ్రహం బింత ◆ యమరెనేని
దోషమైనను గుణముగాఁ ◆ దోఁచుచుండు;
అంబుజాప్తుండు వికలాంగు ◆ డగు ననూరు
సారథిగ నుంచుకొనఁడొకో ◆ సంతతంబు! ౩౫౩

గీ. పాలకులు దౌష్ట్యమొనరించు ◆ పట్టునందుఁ
బాలితులు నోరువిప్పి చె◆ప్పంగలేరు;
అరయఁగా నత్తచేసిన యట్టిపనుల
యందుఁ దప్పన్నఁ గోడలి ◆ కలవియగునె! ౩౫౪

గీ, క్రూరుఁడగువాఁడు రాజ్యాధి◆కారియైన
మిగుల గర్వంబు వహియించి ◆ మిట్టిపడును;
అల్పునకు గొప్ప యైశ్వర్య ◆ మబ్బునెడల
నర్ధరాత్రిన గొడుగుఁ దె◆మ్మనకయున్నె! ౩౫౫

గీ. ధనముకై చెంతఁజేరెడు ◆ జనులు ప్రభున
కించుకైనను మేలుఁ గా◆వింపఁబోరు;
అద్దెకని తీసికొనివచ్చి◆నట్టి గుఱ్ఱ
మగడితం దాటఁగలదె జ◆యంబు గలుగ! ౩౫౬

గీ. జనుల నెల్లరఁ గూర్మితో ◆ సాకునెడలఁ
బ్రభున కెపుడేనియు సహాయ ◆ పడకపోరు;
పిల్లమొక్కను నీరోసి ◆ పెంచునెడల
ఫలముల నొసంగి సంతోష ◆ పఱుపకున్నె! ౩౫౭

గీ. ప్రభువనకుంగల్గు సుఖదుఃఖ ♦ భంగివలనఁ
ప్రజల సుఖదుఃఖములుఁ గూడఁ ♦ బరగుచుండు;
అల్ల రవి యుదయాస్తమ♦యముల వలనఁ
బడయువే మోదఖేదముల్ ♦ పద్మతతులు! ౩౫౮

గీ. ప్రభువు లేకున్నచో జన♦ప్రకరమెల్లఁ
బలువిధంబుల కష్టముల్ ♦ వడుట నిజము;
నావికుఁ డొకండు లేనిచో ♦ నావ జలధి
యందు మునిఁగి వినాశంబు ♦ నొందకున్నె! ౩౫౯

గీ. సంపదలు నిండుగానుండు ♦ సమయమందు
జనుల సంతుష్టులం జేయుఁ ♦ జను విభుండు;
పాడియావు సమృద్ధిగాఁ ♦ బాలనొసఁగి
ప్రజల కత్యంత సౌఖ్య మే♦ర్పఱుపకున్నె! ౩౬౦

గీ. పామరుండగు రాజు వి♦ద్వాంసుచెంతఁ
జేరి విజ్ఞానసంపదఁ ♦ జెందఁగలఁడు;
ఏటిదరినున్న వృక్షంబు ♦ లెంతయేని
పెంపుఁగాంచుచు మిగుల ఫ♦లింపకున్నె! ౩౬౧

గీ. అవని నాథుండు ప్రియవాది ♦ యైనయెడల
నఖిలశాత్రవులకు నిష్టుఁ♦డగుట నిజము;
కడుభయంబునఁ బాగు మృ♦గంబులేని
వశముగాకున్నె తీయని ♦ వాక్కుచేత! ౩౬౨

గీ. అధిపుల కనుగ్రహం బింత ♦ యమరెనేని
దోషమైనను గుణముగాఁ ♦ దోఁచుచుండు;
అంబుజాప్తుండు వికలాంగు ♦ డగు ననూరు
సారథిగ నుంచుకొనఁడొకో ♦ సంతతంబు! ౩౫౩

గీ. పాలకులు దౌష్ట్యమొనరించు ♦ పట్టునందుఁ
బాలితులు నోరువిప్పి చె♦ప్పంగలేరు;
అరయఁగా నత్తచేసిన యట్టిపనుల
యందుఁ దప్పెన్నఁ గోడలి ♦ కలవియగునె! ౩౫౪

గీ. క్రూరుఁడగువాఁడు రాజ్యాధి♦కారియైన
మిగుల గర్వంబు వహియించి ♦ మిట్టిపడును;
అల్పునకు గొప్ప యైశ్వర్య ♦ మబ్బునెడల
నర్ధరాత్రిన గొడుగుఁ దె♦మ్మనకయున్నె! ౩౫౫

గీ. ధనముకై చెంతఁజేరెడు ♦ జనులు ప్రభున
కించుకైనను మేలుఁ గా♦వింపఁబోరు;
అద్దెకని తీసికొనివచ్చి♦నట్టి గుఱ్ఱ
మగడితం దాటఁగలదె జ♦యంబు గలుగ! ౩౫౬

గీ. జనుల నెల్లరఁ గూర్మితో ♦ సాకునెడలఁ
బ్రభున కెపుడేనియు సహాయ ♦ పడకపోరు;
పిల్లమొక్కను నీరోసి ♦ పెంచునెడల
ఫలముల నొసంగి సంతోష ♦ పఱుపకున్నె! ౩౫౭

గీ. ప్రభునకుంగల్గు సుఖదుఃఖ ♦ భంగి వలనఁ
ప్రజల సుఖదుఃఖములుఁ గూడఁ ♦ బరగుచుండు;
అల్ల రవి యుదయాస్తమ♦యముల వలనఁ
బడయువే మోదఖేదముల్ ♦ పద్మలతతులు ! 3౫౮

గీ. ప్రభువు లేకున్నచో జన♦ప్రకరమెల్లఁ
బలువిధంబుల కష్టముల్ ♦ పడుట నిజము;
నావికుఁ డొకండు లేనిచో ♦ నావ జలధి
యందు మునిఁగి వినాశంబు ♦ నొందకున్నె ! 3౫౯

గీ. సంపదలు నిండుగానుండు ♦ సమయమందు
జనుల సంతుష్టులం జేయఁ ♦ జను విభుండు;
పాడియావు సమృద్ధిగాఁ ♦ బాలనొసఁగి
ప్రజల కత్యంత సౌఖ్య మొ♦నర్పకున్నె ! 3౬౦

గీ. పామరుండగు రాజు వి♦ద్వాంసుచెంతఁ
జేర విజ్ఞానసంపదఁ ♦ జెందఁగలఁడు;
ఏటిదరినున్న వృక్షంబు ♦ లెంతయేని
పెంపుఁగాంచుచు మిగుల ఫ♦లింపకున్నె ! 3౬౧

గీ. అవని నాథుండు ప్రియవాది ♦ యైనయెడల
నఖిలశాత్రవులకు నిష్టుఁ♦డగుట నిజము;
కడుభయంబునఁ బాగు మృ♦గంబులేని
వశముగాకున్నె తీయని ♦ వాక్కుచేత ! 3౬౨

గీ. అరయఁగా నెంత గొప్ప రా♦జైనఁగాని
యంగబలమది లేక వి♦ఖ్యాతిఁగనఁడు;
పరమ తేజో౽న్వితుండైన ♦ భాస్కరుండు
కిరణములు లేక సర్వత్ర ♦ వరలునొకొ! ౩౬౩

గీ. సహనమొ, ప్రతాపమో యొండు ♦ చాలఁబోదు
రెండునుంగూడ రాజున ♦ కుండవలయు;
అమల రసభావకలితుఁడై ♦ నట్టి కవికి
చాలునె ప్రసాద మొకటి యో♦జస్సులేక! ౩౬౪

గీ. ఫలముగోరినయట్టి భూ♦పాలకుండు
ప్రజలఁ గడు శ్రద్ధతోడఁ గా♦పాడవలయు;
వాటముగఁ బండ్లకాశించు ♦ తోటమాలి
చెట్లకు జలాదు లొసఁగి పో♦షింపకున్న! ౩౬౫

గీ. ఎంచి బలహీనుఁడగు శత్రు♦వేమిసేయు
నని యుపేక్షింపఁగారాదు ♦ జనవిభుండు;
ప్రాలుమాలక యొకచిన్న ♦ పాము నేని
గట్టిగాఁగొట్టరే పెద్ద ♦ కఱ్ఱతోడ! ౩౬౬

గీ. పరభృతశరీరుఁ డతిలోక ♦ పరివృతుఁడగు
మనుజపతి యన్యవిషయముల్ ♦ వినఁడు కనఁడు;
పరభృతశరీర మతిలోక ♦ పరివృతంబు
నైన పీనుఁగు కన విన ♦ నర్హమగునె! ౩౬౭

## —♦ మంత్రి ♦—

గీ. యాచకులకుఁ బ్రభుండు ద్ర♦వ్యంబొసఁగు
సమయమున నడ్డుపడును దు♦ష్టప్రధాని;
చాతకములకు మేఘుండు ♦ జలమొసంగు
పట్టునను గాలి యేతెంచి ♦ పాడుసేయు. ౩౧౮

గీ. రాజునకు రైతులకుఁగల్గు ♦ రణమునందు
మంత్రులకు నష్టముండ దా♦వంతయేని;
తల్లిపిల్లల గండముల్ ♦ చెల్లుఁగాని
మంత్రిసాని గండంబది ♦ మహినిగలదె! ౩౧౯

గీ. భవ్యసామర్థ్య యుతుఁడైన ♦ ప్రభునకేని
దుష్టమంత్రులచే హాని ♦ దొడరుచుండు;
ఉరుతరైశ్వర్యయుతుఁడు సు♦యోధనుండు
శకుని ముఖ్యులచే వినా♦శంబుఁగనఁడె! ౩౨౦

గీ. మంత్రియైనట్టివాఁడు దు♦స్తంత్రుఁడైన
నతనిఁ దొలఁగింపవలయు రా♦జ్యంబునుండి;
మొదలు బిగిచెడి దంతంబు ♦ కదలుచున్నఁ
దెగువమైఁ బూర్తిగా నూడఁ♦దీయరొక్కొ! ౩౨౧

గీ. పరమధీమంతుఁడగు మంత్రి♦వరుఁడులేక
యెట్టి ఘనరాజ్యమేని న♦శించితీరు;
పూర్తిగాఁ జక్రమొకటూడి ♦ పోవునెడల
బండి మొదలంట చెడి పాడు♦పడును గాదె! ౩౨౨

గీ. ఎంతయు గభీరుఁడగు రాజు ♦ చెంత మంత్రి
లేకయుండినఁ బ్రజలకు ♦ లేదు మేలు;
మిగుల లోతైనబావికిఁ ♦ దగినయట్టి
త్రాఁకులేకున్న జలముఁ బొం ♦ దంగ వశమె! ౩౭౩

గీ. మానవాధీశ్వరుండు సా ♦ మాన్యుఁడయ్యుఁ
జతురుఁడైన ప్రధానిచే ♦ జయముగాంచు;
అరయఁగాఁ జంద్రగుప్త ధ ♦ రాధిపుండు
మాన్యతఁగనండె చాణక్య ♦ మంత్రివలన! ౩౭౪

—♦ విద్య ♦—

గీ. ఇతరగుణము లెన్ని ♦ యేని యుండునుగాక
విద్యలేనిజన్మ ♦ వృథయసుమ్ము;
చూడఁ గనులులేని ♦ చో నితరాంగంబు
లెన్నొ యుండుఁగాక ♦ యేమి సొగసు! ౩౭౫

గీ. చక్కఁదనమెంత యుండినం ♦ జదువులేక
గౌరవంబు రవంతయుఁ ♦ గలుగఁబోదు;
అందముగనుండి తావి ర ♦ వ్వంతలేని
కతన మోదుగపూవు వి ♦ ఖ్యాతిఁగనునె! ౩౭౬

గీ. విద్యలందునఁ గడునేర్పు ♦ వెలయవలయు
ఫలముగలుగదు విలువ దు ♦ స్తులను దాల్ప;
సర్వవిద్యలలో మేటి ♦ చతురుఁడయ్యుఁ
జర్మములఁదాల్చి తిరుగఁడే ♦ శంకరుండు! ౩౭౭

గీ. అధమునం దేని యుత్తమ మైన విద్య
దనరుచుండిన దానిఁ గైకొనఁగఁదగును;
అమలకాంచన మపవిత్ర మైనచోటఁ
బడినమాత్రాన నెవఁడైన విడువఁగలఁడె! ౩౭౮

గీ. కష్టకాలంబునందు నక్కఱకు వచ్చు
విద్యలఁ బరిశ్రమంబుఁ గావింపవలయు;
పార్థునకు నాఁడు విరటుని భవనమందు
నిత్యగౌరవ మొనఁగూర్చె నృత్యవిద్య. ౩౭౯

గీ. సాధువులు నైజముగఁ గీర్తి సహితులైన
నింక సద్విద్యచేత శోభిల్లఁగలరు;
కడు మనోహరమగు తొలి కారుమబ్బు
ఇంద్ర చాపంబుచేఁ బ్రకాశించుమిగుల. ౩౮౦

గీ. బాల్యమున విద్య చక్కఁగాఁ బట్టువడును
అవల నేర్చిన శ్రమ వ్యర్థమై తనర్చు
అరయఁగాఁ గ్రొత్త వలువకే యంటుఁగాని
ప్రాతవస్త్రంబునకు రంగు పట్టునొక్కొ! ౩౮౧

గీ. అనయము నరుండు తా నేర్చి నట్టి విద్య
పరుల కిడఁ బెర్గు లేకున్నఁ దఱిగిపోవు;
చెలమనీ రెప్డు వాడుక సేయుకొలఁది
ప్రవిలంబగు; లేనిచోఁ బాడుగాదె! ౩౮౨

గీ. పరమ విద్యార్థియగు గుణ♦వంతుఁ డెన్ని
భంగములుగల్గినను బట్టు ♦ వదలఁబోఁడు;
ఎంతయుం ద్రోణుఁడు నిరాక♦రించుఁగాక
యేకలవ్యుండు విద్య సా♦ధింపలేదె! ౩౮౩

గీ. అరయఁగాఁ గొందఱవిచార♦సరణిచేత
విద్య యొక ధనమంచు భా♦వించుచుంద్రు;
విద్య కులకాంతవలె నరు♦న్విడువ దెపుడు
వెడలును ధనంబు పలుమారు ♦ వేశ్యవోలె. ౩౮౪

—♦ వి న య ము ♦—

గీ. వినయగుణముతోడ ♦ వెలయుచుండెడి విద్య
యెవని చిత్తమును హా♦రింపకుండు?
కాంచనంబు రత్న♦కలితంబు నైనచోఁ
గనులకుం బ్రమోద♦కరము గాదె! ౩౮౫

గీ. వినయ మొసఁగునట్టి ♦ విద్యయే యవినయ
హేతువైన నెవ్వఁ♦డేమిసేయు?
కంటికెప్పవోలెఁ ♦ గాపాడు తల్లియే
విషముఁబెట్ట దిక్కు ♦ వేఱెకలదె! ౩౮౬

గీ. శౌర్యధనులును లోఁగిన ♦ శత్రులయెడ
వినయమునుజూపఁ గీర్తిచే ♦ వెలయఁగలరు;
మున్ను రాముండు పరశురా♦మునకు మ్రొక్కి
ఘనతర యశోవిభూతిని ♦ గాంచలేదె! ౩౮౭

గీ. ఇతరుల జయింపఁగా మది ♦ నెంచువారు
ముందువినయంబుఁ జూపుటే ♦ ముఖ్యతమము;
సింగమేనియు ముందుగా ♦ వంగి పిదప
నేపుమై గజమును సంహ♦రించుచుండు. ౩౮౮

గీ. భవ్య వినయంబుచేఁ గప్పఁ♦బడినయట్టి
యన్య సుగుణంబు లతిశోభ♦నందఁగలవు;
కుసుమ కోమలులకు మేలి♦ముసుగువలన
నెక్కుడై కానుపింపదే ♦ చక్కఁదనము! ౩౮౯

గీ. వినయగుణముతోడ ♦ వెలయు మానవులెల్ల
నున్నతిని వహింతు ♦ రొక్కవేళ;
అరయఁ బాదతలము ♦ నంటియుండెడు ధూళి
యెప్పుడేని మీఁది ♦ కెగురకున్నె! ౩౯౦

గీ. విద్యయే ఘనమంచు భా♦వించుచుంద్రు
ఘనతరము దానికంటెను ♦ వినయగుణము;
విద్యయది రాజవశ్యమై ♦ వెలయుచుండ
వినయము త్రిలోకవశ్యమై ♦ వినుతిఁగనదె! ౩౯౧

——♦ వి వే క ము ♦——

గీ. ఏ స్థలంబునందు ♦ నేకార్య మొనరింప
వలయునో యెఱుంగ♦వలె నరుండు;
నీటిమీఁద బండి, ♦ నేలపైఁ బడవను
గడఁగి యెవ్వఁడైన ♦ నడుపఁగలఁడె! ౩౯౨

గీ. ఆర్యజనులయందు ♦ నల్ప వివేకియా
వాఁడొకింత కీర్తి ♦ పడయఁబోఁడు;
సురుచిరంబులైన ♦ సూర్యకాంతులమధ్య
దివ్వె సుంతయైన ♦ దీప్తిఁగనునె! ౩౯౩

గీ. బుద్ధిశాలియైన ♦ పురుషుండు దుష్టుల
యుక్తిచేతఁ గెలుచు♦చుంట నిజము;
పూని చెంతనున్న ♦ భూమిఁ ద్రవ్వినయంత
గొప్పవృక్షమైనఁ ♦ గూలిపడదె! ౩౯౪

గీ. సొంతమైన తెలివి ♦ సుంతయు లేనట్టి
వానికేల శాస్త్ర ♦ వర్గమెల్ల?
అంధుఁడైనవాని ♦ కద్దంబొసంగుట
వలన సుంతయైన ♦ ఫలముగలదె! ౩౯౫

గీ. లోనిసార మింత ♦ లేనట్టివానికి
సాయ మెవ్వరేమి ♦ చేయఁగలరు?
మలయగిరి సమీప♦తలమునఁ బుట్టిన
వెదురుచందనంపు ♦ విధముఁ గనునె! ౩౯౬

గీ. నమ్మి చెంతఁ జేరు ♦ నరులను వంచించు
టదియు నొక్క ప్రజ్ఞ ♦ యనఁగఁదగదు;
కడు శ్రమంబు నొంది ♦ తొడపైని నిద్రించు
వానిఁ జంపు టదియుఁ ♦ బౌరుషంబె! ౩౯౭

గీ. అతి వివేక సమన్వితుం ♦ డైన నరుఁడు
పామరుని దూషణములకు ♦ బాధపడఁడు;
ఉన్నత గజంబుపై నెక్కి ♦ యున్నవాఁడు
కుక్కకూతకు జడియునే ♦ కొంచెమేని! ౩౯౮

గీ. చతురమతి యైనవాఁడు దు ♦ ర్జనులతోడ
స్నేహమును విరోధమును వ ♦ ర్జింపఁదగును;
కుక్క నాకినఁ గఱచిన ♦ గొప్పబాధ
కలుగుచుంట యథార్థంబు ♦ గాకయున్నె! ౩౯౯

గీ. మనుజుఁడొక కార్య మాచరిం ♦ పకయమున్నె
యెంతయును మంచిచెడ్డ యో ♦ జింపవలయు;
కోరితా నత్తి గొరిగించు ♦ కొన్న పిదప
ఫలముగలుగునె తిథివార ♦ ములఁ దలంప! ౪౦౦

గీ. అతిమనీషా సమన్వితుం ♦ డైన వాని
నట్టి శాత్రవులేని బా ♦ ధింప లేరు;
హస్తమున ఛత్రము ధరించి ♦ నట్టి వాని
కెంత వర్షంబు గురిసిన ♦ నేమి భయము! ౪౦౧

గీ. శత్రువులబాధ రానున్న ♦ సమయమందు
వినయమూని మెలంగు వి ♦ వేకశాలి;
బాలకులు పెట్టుబాధ తా ♦ బేలెఱింగి
తనదు దేహంబు లోలోన ♦ దాచుకొనదె! ౪౦౨

గీ. ఒరులు బాధించునెడ నూర♦కుండఁ బోక
యే పగిదినైనఁ దనశక్తిఁ ♦ జూపవలయు;
ఇతరు లెపుడేని దన్నుఁ బీ♦డింత్రుగాక
పాము బుస్సుమనంగనే ♦ పరుగులిడరె! ౪౦౩

గీ. అరసి యేకాలమున కేది ♦ యవసరంబొ
దానిఁ జేకొనువాఁడె పో ♦ ధన్యతముఁడు;
పాత్రియును ద్రాదులేక కూ♦పమ్ముఁ జేరు
వాఁడు పరిహాసపాత్రుండు ♦ గాఁడె జగతి! ౪౦౪

గీ. ఎచట నే కార్యమును బొన♦రింపవలెనొ
తెలియకున్న నొకింతయు ♦ ఫలము సున్న;
తురకవీధిఁ యతీంద్రుండు ♦ తిరుగుచున్న
నెవ్వరేనియు భిక్షఁ గ♦ల్పింతురొక్కొ! ౪౦౫

గీ. ఉచిత మనుచిత ♦ మెఱుగక యున్నవాఁడు
పలుకు వాక్యంబు పరిహాస ♦ భాజనమగు;
దున్న యీనినదనినంత ♦ దూడ నెచటఁ
గట్టివేయుదమన వెఱ్ఱి ♦ గాక యున్నె! ౪౦౬

గీ. తనకుఁ దగినట్టిపనిఁ బూనఁ♦దగును గాని
యలవిగానట్టి దానికై ♦ యాశ తగదు;
చెట్టిశేరు లింగము సవా♦శేరు నయిన
నెల్లజనులును మిగుల హా♦సింత్రుగాదె! ౪౦౭

గీ. పండితుడువోలె మూర్ఖుండుఁ ♦ బరగుఁగాక
తెలివి నోర్విప్పినంతనే ♦ తేటపడును;
హంసవలె కొంగ తెల్లగా ♦ నలరుఁగాక
పాలునీరేకమైన వే♦ర్పఱుపఁ గలదె! ౪౦౮

గీ. ముందురాబోవు సంకటం♦బును దలఁపక
యేపనియుఁ జేయఁగా సాహ♦సింపరాదు;
కంచె యావలిగుంటను ♦ గాంచఁబోక
దుముకుచో నందులోఁబడి ♦ తుంగకున్నె! ౪౦౯

గీ. పరుల దోషంబు వెదకెడు♦వాఁడు ముందు
తనదు లోపఁబులను దిద్దు♦కొనఁగవలయు;
కుంటివానిని నిరసింపఁ ♦ గోరువాఁడు
కదువడిం దాను ముందుగా ♦ నడువ వలదె! ౪౧౦

గీ. బుద్ధిమంతులు తమ శాత్రు♦వుల వలనను
స్వీయకార్య సమాప్తిఁ గా♦వించుకొందు్రు;
కోకిలము తనబిడ్డలఁ ♦ గాకివలనఁ
బెంపుఁగాంచెదు నట్లాచ♦రింపకున్నె! ౪౧౧

గీ. బలముగలవారు కలహించు ♦ పట్టునందు
దుర్బలులు వారి నడుమను ♦ దూరరాదు;
ఆవులావులు పోట్లాడు♦నట్టి దెసకు
వెళ్ళ లేగల పాదముల్ ♦ విఱుగకున్నె! ౪౧౨

గీ. పుట్టునపుడె తెల్వి ♦ పుట్టంగవలెఁగాక
కోరి తెచ్చిపెట్టు♦కొనఁగరాదు;
కడుపులోనలేని ♦ కరుణ రవ్వంతైనఁ
గాగిలించుకొన్నఁ ♦ గలుగునొక్కొ! ౪౧౩

గీ. శిష్యులకునొజ్జ సమముగాఁ ♦ జెప్పువిద్య
బుధుఁడొకండగు, నొక్కండు ♦ మూఢుఁ డగును;
ఎదుటి వస్తుబింబమును గ్ర♦హించుటందు
అద్దమున కీడగునె మంటి♦ముద్దగూడ! ౪౧౪

గీ. సకలశాస్త్రంబులఁ బఠించి ♦ సారమెల్ల
నరయుచు వివేకి సంతోష ♦ మందుచుండు;
వివిధకుసుమంబులన్ బహు♦విధ రసముల
నాని సంతుష్టిఁ గాంచదే ♦ తేనెటీగ! ౪౧౫

గీ. చదివి, వ్రాసి, చూచి, ♦ సంప్రశ్న చేసి పం
డితులవలనఁ దెలియు ♦ నతని బుద్ధి;
యలఘు సూర్యకిరణ♦ములచేతఁ బద్మప
త్రమ్మువోలె వికస♦నమ్ముఁ గాంచు. ౪౧౬

—♦ అవివేకము ♦—

గీ. జ్ఞానహీనతచే నెవ్వఁ♦డేని కోర
రానియది కోరఁ దప్పక ♦ హానిగలుగు;
పక్వఫలమని భావించి ♦ పడయ నెంచి
యగ్గిలోఁబడి మిడుతలు ♦ మ్రగ్గకున్నె! ౪౧౭

గీ. బలయుతుం డరుదెంచి పైఁ♦బడెడువేళ
ఎదురుకొనునట్టివాఁడు న♦శించితీరు;
హెచ్చుగా నీటి వెల్లువ ♦ వచ్చునపుడు
గొప్పవై నిల్చు చెట్లెల్లఁ ♦ గూలిపడవె! ౪౧౮

గీ. అల్పలాభంబునకు మది ♦ నాసచెంది
యధిక నష్టంబుఁ బొందు నొ♦కప్డు నరుఁడు;
ఓలితక్కువయని యంధు♦రాలిఁ గొన్నఁ
గుండ లన్నియుఁ బిండిగాఁ ♦ గొట్టుకున్న! ౪౧౯

గీ. అజ్ఞులగు మానవులు భవి♦ష్యద్విధాన
ములఁ దలంపక లోలోన ♦ మురియుచుందురు;
ఆలు లేదు విచారింపఁ ♦ జూలు లేదు
కొడుకు పేరేమియని మూర్ఖు♦లడుగ వినమె! ౪౨౦

గీ. తనదు శక్తికెందుఁ ♦ దగనట్టి కార్యంబుఁ
బూనుకొనిన నిందఁ ♦ బొందఁగలరు;
"ఆకలిని దలంప ♦ నాకాశమంతయు
గొంతు సూదిబెజ్జ♦మంత" యనరె! ౪౨౧

గీ. అన్ని ధర్మంబులెఱిఁగిన ♦ యట్టివాని
యందవిశ్వాస మెంతయుం ♦ బొందరాదు;
'ఇచ్చువానికిఁ బత్రంబు ♦ చచ్చువాని
కౌషధంబు నిరర్థకం♦బనఁగ వినమె! ౪౨౨

గీ. పుట్టునపుడె తెల్వి ♦ పుట్టంగవలెఁగాక
కోరి తెచ్చిపెట్టు♦కొనఁగరాదు;
కడుపులోనలేని ♦ కరుణ రవ్వంతైనఁ
గాఁగిలించుకొన్నఁ ♦ గలుగునొక్కొ! ౪౧౩

గీ. శిష్యులకునొజ్జ సమముగాఁ ♦ జెప్పువిద్య
బుధుఁడొకండగు, నొక్కరుండు ♦ మూఢుఁ డగును;
ఎమటి వస్తుబింబమును గ్ర♦హించుటందు
అద్దమున కీడగునె మంటి♦ముద్దగూడ! ౪౧౪

గీ. సకలశాస్త్రంబులుఁ బఠించి ♦ సారమెల్ల
నరయుచు వివేకి సంతోష ♦ మందుచుండు;
వివిధకుసుమంబులఁ బహు♦విధ రసముల
నాని సంతుష్టిఁ గాంచదే ♦ తేనెటీగ! ౪౧౫

గీ. చదివి, వ్రాసి, చూచి, ♦ సంప్రశ్న చేసి పం
డితులవలనఁ దెలియు ♦ నతని బుద్ధి;
యలఘు సూర్యకిరణ♦ములచేతఁ బద్మప
త్రమ్మువోలె వికస♦నమ్ముఁ గాంచు. ౪౧౬

—♦ అవివేకము ♦—

గీ. జ్ఞానహీనతచే నెవ్వఁ♦డేని కోర
రానియది కోరఁ దప్పక ♦ హానిగలుగు;
పక్వఫలమని భావించి ♦ పడయ నెంచి
యగ్గిలోఁబడి మిడుతలు ♦ మ్రగ్గకున్నె! ౪౧౭

గీ. బలయుతుం డరుదెంచి పైఁ♦బడెడువేళ
నెదురుకొనునట్టివాఁడు న♦శించితీరు;
హెచ్చుగా నీటి వెల్లువ ♦ వచ్చునపుడు
గొప్పవై నిల్చు చెట్లెల్లఁ ♦ గూలిపడవె! ౪౧౮

గీ. అల్పలాభంబునకు మది ♦ నాసచెంది
యధిక నష్టంబుఁ బొందు నో♦కప్పు నరుఁడు;
ఓలితక్కువయని యంధు♦రాలిఁ గొన్నఁ
గుండ లన్నియుఁ బిండిగాఁ ♦ గొట్టుకున్న! ౪౧౯

గీ. అజ్ఞులగు మానవులు భవి♦ష్యద్విధాన
ములఁ దలంపక లోలోన ♦ మురియుచుంద్రు;
ఆలులేదు విచారింపఁ ♦ జూలులేదు
కొడుకు పేరేమియని మూఢు♦లడుగ వినమె! ౪౨౦

గీ. తనదు శక్తికెందుఁ ♦ దగనట్టి కార్యంబుఁ
బూనుకొనిన నిందఁ ♦ బొందఁగలరు;
"ఆకలిని దలంప ♦ నాకాశమంతయు
గొంతు సూదిబెజ్జ♦మంత" యనరె! ౪౨౧

గీ. అన్ని ధర్మంబులెఱిఁగిన ♦ యట్టివాని
యం దవిశ్వాస మెంతయుం ♦ బొందరాదు;
'ఇచ్చువానికిఁ బత్రంబు ♦ చచ్చువాని
కౌషధంబు నిరర్థకం♦బనఁగ వినమె! ౪౨౨

గీ. హెచ్చుగ నదృష్టకాలంబు ♦ వచ్చెననుచుఁ
కెడ్డపనులను మనుజుండు ♦ సేయరాదు
"దినము మంచిదటంచును ♦ దెల్లవార్లు
దొంగిలించినఁ" గష్టముల్ ♦ దొడరకున్నె! ౪౨౩

—♦ డంబము. ♦—

గీ. నీచుఁ డెన్నని డంబముల్ ♦ నెరపుఁగాక
యించుకయు గొప్పతనము లభింపఁబోదు;
హెచ్చు వెలగల బంగారు ♦ ముచ్చెలేని
పాదముల యందె ధరియింత్రు ♦ గాదె జనులు; ౪౨౪

గీ. లేశమును మంచిపనిఁ జేయ ♦ లేనివాఁడు
ప్రల్లదములాడ నెవ్వండు ♦ పరిగణించు?
"అల్పమగు సున్నమే పుట్ట ♦ నట్టిచోట
నన్నము లభించు" ననుట హా ♦ స్యమ్ముగాదె! ౪౨౫

గీ. అధిక శక్తివంతుఁ ♦ డైనచో నాడంబ
రంబులేల గౌర ♦ వంబు కొఱకు;
మిగుల దీప్తిగలుగ ♦ మృగరాజ పట్టాభి
షేక మెవఁడు సేసె ♦ సింహమునకు! ౪౨౬

గీ. ఆత్మలాభంబుకై చేయు ♦ నట్టి పనులు
పరుల మేలునకే యంచుఁ ♦ బలుకునొకఁడు;
ప్రీతిమై "నాలికన్నంబు ♦ పెట్టుచుంట
యూరి కుపకారమ"ని చెప్ప ♦ నొప్పనొక్కొ! ౪౨౭

గీ. తనువు వ్యాధుల పాలైన ♦ దైవభక్తి
యుక్తులుగ నొప్పుదురు కొంద ♦ ఱుర్వియందు;
మొగము ముడుతలు పడినంత ♦ ముసలివేశ్య
ఘన తపస్వినివేషంబు ♦ గాంచవచ్చు. ౪౨౮

గీ. అన్నిటను నేఁ బవిత్రుండ ♦ నంచుఁ బలికి
నీచకార్యబు లెన్నని ♦ నెరపఁదగును!
చూడఁగా "నింటిపేరు క♦స్తూరివారు
నింట గబ్బిళముల కంపు" ♦ నంటకాదె! ౪౨౯

గీ. లేనిగుణ మొక్కరుడు చెప్పఁ ♦ బూనుఁగాక
బయటఁబెట్టును వాని న♦భ్యాసగతులు;
"అచ్చముగ తిరుమణిధారి ♦ యైన యెడల
పుల్ల పట్టుటలోఁ దెల్పు ♦ బోధపడదె!" ౪౩౦

గీ. అక్షరజ్ఞానమున్న మే♦లగును గాని
యెట్టి ఘనవేషములఁ దాల్ప ♦ నేమిఫలము?
ఎల్లకాలంబుఁ దా వస్త్ర♦హీనుఁడయ్యు
శివుఁడు ముల్లోకములను బూ♦జింపఁబడఁడె! ౪౩౧

గీ. జనులు ధరియించునట్టి వ♦స్త్రములవలన
నొక్కొకప్పుడు గౌరవం ♦ బొదవుచుండు;
జలధి చర్మాంబరునకు వి♦షంబొసంగి
యల మహాలక్ష్మి నిచ్చెఁ బీ♦తాంబరునకు. ౪౩౨

## —♦ ఉ ప కా ర ము ♦—

గీ. ఎట్టి సంకటమేని బ్రా ♦ ప్తించుఁగాక
మానరు పరోపకారంబు ♦ మాన్యులెపుడు ;
పదములకు బంధనంబు సం ♦ ప్రాప్తమైనఁ
బాలొసంగవె గోవులు ♦ ప్రజలకెల్ల ! ౪౩౩

గీ. అమితమైన కష్టంబుఁ దా ♦ ననుభవించి
పరులకు సుఖంబు గల్గింతురు ♦ భవ్యమతులు ;
చెఱకుకఱ్ఱలు యంత్రానఁ ♦ జిక్కి నలిగి
మధురరసము నొసంగవే ♦ మానవులకు ! ౪౩౪

గీ. పరులప్రాణంబు రక్షింపఁ ♦ బాటుపడెడు
వాఁడు కరుణామయుండని ♦ వాసికెక్కె ;
పావురంబును బ్రదికింపఁ ♦ బ్రీతినఁబూని
మేని మాంసంబు శిబి యిచ్చె ♦ శ్యేనమునకు. ౪౩౫

గీ. అరయఁగఁ బరోపకారి యై ♦ నట్టివాఁడు :
తనదు లాభంబు నుంతయుఁ ♦ దలఁపఁబోఁడు;
చంద్రుఁ డిలకెల్లఁ గాంతినొ ♦ సంగుఁగాక
తన కళంకంబుఁ దీర్చుకోఁ ♦ దలఁచు నొక్కొ ! ౪౩౬

గీ. ఇలను బండితులెందఱు గలిగియున్నఁ
బరులమేలు గోరెడు వార ♦ లరుదుసుమ్ము ;
తీయనై రోగము నశింపఁ ♦ జేయునట్టి
యౌషధం బది దుర్లభ ♦ మగును గాదె ! ౪౩౭

గీ. ఉర్విపై నెందఱో జను♦లుంద్రు గాక
పరహితుండొక్కఁడే కీర్తి ♦ వడయఁగలఁడు;
వేలకొలఁదిగ సర్పముల్ ♦ వెలయుఁగాక
భూమినిభరించు శేషుఁడే ♦ పొందుయశము! ౪౩౮

గీ. సంకటములఁబొందు ♦ సమయమందును సాధు
జనులు పరహితంబు ♦ సలుపుచుంద్రు;
అరయ రాహువక్త్ర♦మందుండి చంద్రుండు
కుముదములకుఁ గాంతిఁ ♦ గూర్చుగాదె! ౪౩౯

గీ. అధమమైన చోటు♦నందుఁ బుట్టియు సాధు
జనులు పరహితంబు ♦ సలుపుచుంద్రు;
తలఁచిచూడ నౌష♦ధులు కానలోఁబుట్టి
యెల్ల రోగముల హ♦రించుఁగాదె! ౪౪౦

గీ. ఘనులకుం బరోప♦కార జీవన మెన్న
సహజమై చెలంగు ♦ జగతియందు;
ఇనుఁడు ప్రతిదినంబు ♦ నేలాభమునుగోరి
కమలములకుఁ దా వి♦కాసమొసఁగు! ౪౪౧

గీ. సజ్జనులుదాము తమ సర్వ♦సంపదలను
పరులకే నిత్య ముపయోగ♦పఱుచుచుంద్రు;
వృక్షములు దమఫలముల♦నెల్లఁ బరుల
కిచ్చునేగాని తామొక్క♦టేని తినునె! ౪౪౨

గీ. ఇతరుఁ డేనియు మేలు గా♦వించి యొకట
బరమబాంధవుఁడై కీర్తి ♦ వడయఁగలఁడు;
అడవిలోపలఁ బుట్టుఁగా ♦ కౌషధంబు
జనులకు సహాయకారియై ♦ తనరుఁగాదె! ౪౪౩

గీ. ఉర్విపైఁ బరహితుఁ డొక్కఁ ♦ డుండు నెడల
వానికీర్తిని శ్లాఘించు♦వాఁడు నుండు;
భోజునకు సాటియైనట్టి ♦ రాజు వెలయఁ
గాళిదాసునిబోలు స♦త్కవియుఁ గలుగు. ౪౪౪

గీ. అనుదినంబు మేలు ♦ నాచరించెడు వాని
కెపుడు గౌరవము ల♦భింపఁగలదు;
గళవిషంపువేడిఁ ♦ దొలఁగించు చంద్రుని
శివుఁడు శిరమునందుఁ ♦ జేర్చికొనఁడె! ౪౪౫

గీ. అడుగకయె యెవ్వఁడు హితంబు ♦ నాచరించు
నట్టి మానవుఁడే మిత్రుఁ ♦ డనఁగఁ దగును;
కన్నులకు దెప్ప, లొడలికిఁ ♦ గరయుగంబు
రక్షకములౌట సహజధ♦ర్మమునఁ గాదె! ౪౪౬

గీ. ఎపుడుఁ బరులకు మేలుఁ గా♦వించుకొఱకు
స్వయముగా దీక్షవహియింత్రు ♦ సాధుజనులు;
జలము వర్షించి ముదము నొ♦సంగుమనుచు
నెవ్వఁడేనియు మేఘుఁ బ్రా♦ర్థించునొక్కొ! ౪౪౭

గీ. తనువు సర్వంబుఁ జందనం♦బునను గాక
రమ్యమగును బరోపకా♦రంబువలన;
శాస్త్రమునఁ గర్ణములు ప్రకా♦శంబుఁ గాంచుఁ
గుండలంబులఁ గల్గునే ♦ గొప్పతనము! ౪౪౮

గీ. అధిక కరుణార్ద్రమానసుం♦డైన వాఁడు
ధనమొసఁగి బీదలకు మోద♦మును ఘటించు;
సారతరమై తనర్చు వ♦సంతఋతువు
పుష్పముల శోభఁగూర్పదే ♦ పుడమికెల్ల! ౪౪౯

గీ. ఘనపరోపకృతియుఁ ♦ గైవల్యమునుదూచి
మొదటి దధికమనుచు ♦ మది నెఱింగి
యుండనోపుఁ గాక♦యున్న వైకుంఠుండు
దాల్చునే దశావ♦తారములను! ౪౫౦

—♦ అపకారము ♦—

గీ. పరులఁ జెఱుప నెవఁడు ♦ భావమందుఁ దలంచు
నట్టివాఁడు చెడును ♦ దుట్టతుదకు;
శైశవమునఁ గృష్ణుఁ జంపఁ బూతన వచ్చి
యతనివలన మరణ ♦ మందలేదె! ౪౫౧

గీ. అహిత మాచరించు ♦ నట్టిచోఁ దనవార
లైనఁ బరమశత్రు♦లగుట నిజము;
తనదు దేహమందు ♦ జనియించినను గూడ
వ్యాధి తనకు శత్రు♦వగును గాదె! ౪౫౨

గీ. ఇతరుల కుపద్రవంబుఁ గల్పించువారుఁ
గూడ గౌరవ మొకటఁ జేకొనుచు నుంద్రు;
ఎన్ని తొూ సాధుజంతువు లెనఁగుచుండ
సర్పముల పూజ సేయరే జగతియందు! ౪౫౩

—సత్సంగము—

గీ. సజ్జనుల చెంత నున్న దుర్జనులకైనఁ
గలుగుచుండును నిరతంబు గౌరవంబు;
విమలమగు లోచనము చెంత నమరుకతనఁ
గాంచదే కాటుకను గ్రుడ్డి కన్నుఁగూడ! ౪౫౪

గీ. గొప్పతనమును బొందంగఁ గోరువారు
ఎపుడు సుజనుల మైత్రిఁ గావింపవలయు;
అందమగు పూలతోఁ జెల్మి నందుకతన
దారమును స్త్రీలు శిరముపైఁ దాల్చుచుంద్రు. ౪౫౫

గీ. అతి ప్రకాశవంతుఁడగు వాని చేరిన
క్షుద్రుఁడేని మిగుల శోభఁగాంచు;
సూర్య తేజమింత సోకినమాత్రాన
అగ్ని కాంతి గలుగు నద్దములకు! ౪౫౬

గీ. గొప్పవారితోడఁ గూడినమాత్రాన
నధముఁడేని పూజ్యుఁడగుట నిజము;
శాస్త్రవిధులచేత స్థాపింపఁబడినంత
రాయి దేవుఁడగుచు రాణకెక్కు! ౪౫౭

గీ. తలఁచిచూడ నుత్తములతోడి సాంగత్య
మెల్లరకు గుణంబు నీయఁగలదు;
పద్మపత్రమందుఁ బడు నీటిబిందువుల్
గాంచనున్న ముత్యముల కాంతి! ౪౫౮

గీ. సాధుజనులతోడ సఖ్యంబు గావింపఁ
గుజనుఁడేని మిగుల సుజనుఁడగును;
మలయపర్వతంపు చెలిమియుండిన వంట
కట్టెలకును మంచి గంధమొదవు! ౪౫౯

గీ. సజ్జనులతోడ స్నేహంబు సలుపునెడల
నెంత గౌరవమును లక్షింపఁ గలదు;
రాఘవునితోడి చెలిమిచేఁ బ్రాజ్య రాజ్య
విభవమును బొందలేదె విభీషణుండు! ౪౬౦

గీ. పుడమిపై సర్వవిషయ సంపూర్ణుఁడేని
కోరఁగాఁదగు సుజనులౌవారి చెలిమి;
అన్నివిధములఁ బరిపూర్ణమైన జలధి
యెపుడుఁ జంద్రోదయమును గాంక్షింపకున్న! ౪౬౧

గీ. మను[illegible] [illegible]పదలం బా[illegible]నట [illegible]
నెపుడుఁ బ్రాజ్ఞులమైత్రి నార్జింపవలయు;
యుత్తముఁడగు మైత్రి లేకున్న యెడల
వదలునె [illegible] [illegible]!

గీ. సాధు సంగంబుగల్గిన ♦ సంతతంబు
మనసు నిర్మలమై ప్రదీ♦ప్తిని వహించు;
ఒప్పుగాఁ దిత్తులంబూని ♦ యూదుచున్న
బ్రజ్వలింపదె కొలిమిలోఁ ♦ బరగు నగ్ని! ౪౬౩

—♦ దుస్సంగము ♦—

గీ. జగతి దుష్టజనుని ♦ సాంగత్య వశమున
సజ్జనునకు దుర్యశంబు గలుగు;
కల్లునీటి బొట్టు ♦ కాసంత పడినంతఁ
బంచ గవ్యమెల్లఁ ♦ బాడుగాదె! ౪౬౪

గీ. చెడ్డచోటుల నెపుడేని ♦ చేరినంత
సజ్జనులకేని కష్టంబు ♦ సంభవించు;
ఇనుముతోఁ జేరినట్టి కా♦రణమువలన
అగ్ని సమ్మెటపోటుల ♦ నందకున్నె! ౪౬౫

గీ. మంచివాఁడేని దుష్టసం♦పర్కవశతఁ
జెడుగుణంబులఁ బొంది న♦శించితీరు;
ఇంపుగా నుండునట్టి వ♦ర్షంపునీరు
చెడదొకో చౌటి నేలలోఁ ♦ బడినయంత! ౪౬౬

గీ. చెంత దుర్మార్గుఁ డొక్కఁడు ♦ చేరునెడల
నెప్పుడో యొక్కపరి కీడు ♦ తప్పఁబోదు;
ఎన్నఁగాఁ గాళ్ళకుం జుట్టు♦కొన్న పాము

—ఆశ్రయము—

గీ. ఎట్టివానిని నరుఁ డాశ్రయించుచుండు
నట్టి ఫలమును బొందు నియ్యది నిజంబు;
జలధి నాశ్రయించిన రత్నములు లభించు
గొలని కేగిన దొరకును గలువదుంప. ౪౬౮

గీ. అరయ మానవుఁ డెవ్వని నాశ్రయించు
వాఁడిడు ఫలంబువలననే వాంఛదీరు;
ఇల నయాచితముగ జలం బెంతయున్న
స్వాతి చినుకులఁ గోరదే చాతకంబు! ౪౬౯

గీ. ఇలను మనుజులు దమ యోగ్యతలకుఁ దగిన
చోటనే యుండవలె వేఱుచోటు తగదు;
తలఁపఁగా శిరోమణిని బాదంబునందు
అందెను శిరంబున ధరించు టర్హమగునె! ౪౭౦

గీ. తెలియఁగా నన్యజనుల యుద్దేశములును
వరలు నొకచోట నాత్మ భావంబుల వలె;
చక్కనై గుండ్రమగు ముఖచంద్రు ప్రతిమ
ఖడ్గమునయందుఁ బొడవుగాఁ గానుపించు! ౪౭౧

—మహాశ్రయము—

గీ. ప్రభువువలనను సుకవియుఁ బ్రభువు సుకవి
వలన విఖ్యాతిఁగాంతు రీ వసుధయందు;
రాత్రిచేఁ జందురుం డల రాత్రి చంద్రు
చేతఁ బ్రతిదినమును బ్రకాశించుఁ గాదె! ౪౭౨

గీ. పండితుండుగాని, లతగాని, ♦ పడఁతిగాని
యాశ్రయముచేరనే శోభ♦నందుచుండు;
ఎంతవెలగల మాణిక్య♦మైన మంచి
కనకమునఁ గూర్చినపుడె ప్ర♦కాశమందు! ౪౭౩

గీ. పండితులలోన నొక్క మూ♦ర్ఖుండు చేరఁ
బండితత్వంబు వాఁడును ♦ బడయఁగలఁడు;
ఇలను రోహణశిఖరిపై ♦ నిలచినంత
గాజుపూసయు ఘన రత్న♦కాంతిఁ గనదె! ౪౭౪

గీ. అధిక గుణవంతులగు వార♦లైనఁ బరుల
వలననే తమశక్తిని ♦ దెలియఁగలరు;
కనులకెంతటి మహిమంబు ♦ గలిగియున్న
నద్దమే లేనిచోఁ దెలి♦యంగ నగునె! ౪౭౫

గీ. అతిదురాత్ముఁడేని ♦ యాశ్రయబలముచే
నధికగౌరవంబు ♦ నందఁగలఁడు;
స్త్రీల కన్నులందుఁ ♦ జేర నల్లనిదైన
కాటుకయును మంచి ♦ కాంతిగలుగు. ౪౭౬

గీ. నీచ జనులకేని నిర్మలాధారంబు
వలన గొప్పతనము ♦ గలుగుచుండు;
పుడమి శుక్తియందుఁ ♦ బడు నీటిబిందువు
ముత్యమై ప్రకాశ♦మును వహించు. ౪౭౭

గీ. ప్రభువరుల యాశ్రయంబును ♦ బడసినపుడె
యెంతయుం బండితుఁడు ప్రకా♦శింపఁ గలఁడు
దివ్య మలయాద్రినికటప్ర♦దేశమందె
చందనమహీజ మభివృద్ధి ♦ నొందుఁగాదె! ౪౭౮

గీ. ఘనులకడ నున్న విఖ్యాతి ♦ గలుగుఁగాని
యెపుడు సామాన్యులం జేర ♦ నేమి ఫలము?
శంఖమునఁ బోయఁ దీర్థమౌ ♦ జలము మట్టి
పెంకులోఁ బోయఁ నీరంచు ♦ పిల్తురుగాదె! ౪౭౯

గీ. అధిక గుణవంతుఁడగు వాని ♦ నాశ్రయింప
స్వాంతమున నెంచుచుందురు వి♦జ్ఞానధనులు;
అధికకుసుమ సమన్వితంబైన యట్టి
మావిచెట్టును గోరదే ♦ మధుపచయము! ౪౮౦

గీ. క్షితిని గొప్పచోటఁ ♦ జేరిన మాత్రాన
సోమరులకుఁ గూడ ♦ సుఖము గలుగు;
అరయ నెందుకేని ♦ కొఱగాని యాబోతు
బ్రతుకకున్న గుడుల ♦ పజ్జఁ జేరి! ౪౮౧

—♦ హీనాశ్రయము ♦—

గీ. అల్పుఁడైనవాని ♦ నాశ్రయించుటచేత
ఘనులకైన నింద ♦ గలుగుచుండు;
తాడిచెంతఁ పాలు ♦ ద్రావుచుండినఁ గూడఁ
గల్లుఁ ద్రావినట్లు ♦ గాఁ దలంతురు. ౪౮౨

గీ. అల్పుఁడైన మనుజు ♦ నాధారముగఁగొన్న
గొప్పవాఁడుఁ గూడఁ ♦ గొంచెమగును;
పెద్ద యేనుఁగేని ♦ యద్దంబులోపలఁ
గొంచెమగుచుఁ గాన♦పించుఁగాదె! ౪౮౩

గీ. తెలివిలేని మాన♦వుల చెంతఁ జేరిన
గొప్పవారికేని ♦ కొఱఁతగలుగు;
మందమతికి మంచి ♦ మకరతంబు లభింప
గాజుపెంకులందుఁ ♦ గలుపకున్నె! ౪౮౪

గీ. ధనముపై నాశచేత దు♦ర్జనుని జేరఁ
బలువిధంబులఁ గీడు సం♦ప్రాప్తమగును;
రత్నములకాసఁ జెంది సం♦ద్రమున మునుఁగ
జలచరంబులచే బాధ ♦ కలుగకున్నె! ౪౮౫

గీ. అవనిఁ గ్రూరస్వభావుఁడై♦నట్టి మనుజు
చెంతనున్నట్టివానికిఁ ♦ జేటు కలుగు;
ఏటియొడ్డున నెలకొన్న ♦ వృక్షమునకు
నాశనము తప్పునొక్కొ యే♦నాటికైన! ౪౮౬

గీ. ఖలుఁడు ధనవంతుఁడని వాని ♦ కడకుఁ జేర
గష్టములె కల్గు నెన్న సు♦ఖంబుసున్న;
రత్నమును బొందఁగోరి స♦ర్పమును డాయఁ
బ్రాణహానియె కా కొండు ♦ ఫలము గలదె! ౪౮౭

గీ. కొంచ విశ్వాసపాత్రుఁడు గాని మనుజుఁ
డెంత ఘనుఁడైన జను లాశ్రయింపఁబోరు;
సింహము మృగాధిపతియౌచుఁ జెలఁగుఁగాక
సన్నిధికిఁ జేరునే యొక్క జంతువేని! ౪౮౮

గీ. అవని హీనజనుల నాశ్రయించుటచేతఁ
బండితునకు గౌరవంబు రాదు;
జారి వేల్చుచుండు చనుల మధ్యమునందు
హారముండి శోభ నందఁగలదె! ౪౮౯

—అదృష్టము—

గీ. ఎల్లరకు నదృష్టమే ఫలియించును
కాదు పౌరుషంబు కాదు విద్య;
రాయి దేవుఁడగుచు రాజిల్లునందేమి
పౌరుషంబు, విద్య పరగుచుండె! ౪౯౦

గీ. దైవబల మొకింత తనకున్న దుర్బలుం
డేని శత్రువుల జయింపఁగలఁడు;
ఎంచఁగా శరీర మేలేని మన్మథుం
డెల్ల లోకముల జయించుఁ గాదె! ౪౯౧

గీ. ఎల్లయెడ నదృష్టమే ఫలియించును
గాని యన్యగతులఁ గలదె ఫలము;
మును సముద్రమథనమున విష్ణునకు లక్ష్మి
గలుగ శంకరునకుఁ గలిగె విషము! ౯౪౨

గీ. యుక్తులెన్నని యార్జించి ♦ యుండుఁగాక
భాగ్యమదిలేక సంపదల్ ♦ వడయుటరిది;
మిగుల జిత్తులమారియై ♦ నెగడుఁగాక
నక్కకు లభించునే మృగ♦నాథపదము! ౪౯౩

గీ. ఒక్కపుడు హీనదశనొంది ♦ యుండువాఁడు
వేఱొకప్పుడు ఘనతచే ♦ వెలయఁగలఁడు;
కానలో ఘోరకష్టముల్ ♦ గాంచినట్టి
రాముఁడే రాజ్యపట్టాభి ♦ రాముఁడయ్యె! ౪౯౪

గీ. ఘనతరంబగు భాగ్యంబు ♦ గలిగియున్న
నొంటటి కురూపియును సిరి♦నెనయఁ గలఁడు;
కర్ణములుసూడ మిగుల వ♦క్రంబులయ్యుఁ
బొందవే రత్నయుతహేమ ♦ భూషణముల! ౪౯౫

—♦ దురదృష్టము ♦—

గీ. గొప్పమేలు మదిని ♦ గోరంగ దురదృష్ట
గరిమవలనఁ గీడు ♦ గలుగుచుండు;
ఆశతోడ రాహు ♦ వమృతంబునకుఁ బోవఁ
జక్రిధరునివలనఁ ♦ జావుమూడె! ౪౯౬

గీ. అందఱకును మిత్రుఁ♦డగువాఁడె దురదృష్ట
వంతునకు సతంబు ♦ వైరియగును;
ఉర్వికెల్లఁ గాంతి♦నొసఁగెడు సూర్యుండె
కుముదములకు హానిఁ ♦ గూర్చుఁగాదె! ౪౯౭

గీ. ఎంత గొప్పవారి ♦ కేనియు దౌర్భాగ్య
వశతఁ గష్టగతులు ♦ వచ్చుచుండు;
అల మహేశు శిరము ♦ నందు భూషణమయ్యుఁ
జందమామ క్షయము ♦ నొందవలసె. ౪౯౮

గీ. ఎట్టిఘనుల నాశ్ర ♦ యించిన భాగ్యాను
సారముగ ఫలంబు ♦ సంభవించు;
శివుని కంఠమందుఁ ♦ జేరియు వాసుకి
గాలిపీల్చి బ్రదుకు ♦ గడుపవలసె! ౪౯౯

గీ. అధిక శక్తిమంతు ♦ లైనను దౌర్భాగ్య
మనుభవింపవలయు ♦ నది నిజంబు;
పరమపురుషుఁ డైన ♦ హరి సముద్రంబులోఁ
బవ్వళింపవలసెఁ ♦ బాము మీఁద! ౫౦౦

గీ. ఇల నదృష్టహీను ♦ లెంత పావను లైనఁ
గాని చెడుఫలంబె ♦ కలుగుచుండు;
అమిత నిర్మలంబు ♦ లైనను నేత్రంబు
లెపుడుఁ గాటుకను ధ ♦ రింపవలసె. ౫౦౧

గీ. ఇల నదృష్టహీను ♦ లెంత తపించిన
ఫలము స్వల్పమగుచుఁ ♦ బరగుచుండు;
కడుఁదపించి యేడ్చి ♦ కన్నీటి మాత్రముఁ
జలముఁ బొందఁ గలదె ♦ చాతకంబు! ౫౦౨

గీ. ధాతవ్రాత సుంత ♦ దాటివర్తింపంగ
శక్తికలదె యెట్టి ♦ జాణకైన!
అఖిలలోక నేత్రు ♦ లై వెల్గు నాసూర్య
చంద్రులెపుడు నస్త ♦ మొందవలసె. ౫౦౩

గీ. అరయ విధివిధాన ♦ మనునది నరులకే
గాదు సురలకేని ♦ కలిగియుండు;
అల కుబేరుతోడఁ ♦ జెలిమికల్గినఁ గూడఁ
జర్మముల ధరించు ♦ శంకరుండు. ౫౦౪

గీ. ఎంతగొప్పవార ♦ లైన దైవవిధాన
మునకు వశ్యులగుదు ♦ రనుట నిజము;
అర్జునునకు సుతుఁడు, ♦ హరికల్లుఁ డగు నభి
మన్యుఁ డాజియందు ♦ మడియవలసె. ౫౦౫

గీ. ఎపుడు నిర్భాగ్యునకు ధనం ♦ బిడిన కొలఁది
నతనిచేటునకే హేతు ♦ వగుట నిజము;
ఎంచఁగా వానమిగుల వ♦ర్షించు కొలఁది
వాడి పోవునుగాదె జి♦ల్లేడుమొక్క! ౫౦౬

గీ. భవ్యగుణముండుఁగాక దౌ♦ర్భాగ్యునందు
సరసుఁడు తలంపఁడాతని ♦ సరసఁ జేర;
మంచివాసనతో విజృం♦భించుఁగాక
చంపకముచెంత కేగునే ♦ షట్పదంబు! ౫౦౭

గీ. ఎంత మహిమాఢ్యులగు వారి♦కేని సుంత
బ్రహ్మవ్రాతను దప్పింప ♦ వశముగాదు;
సద్గుణాధికుఁడై యొప్పు ♦ సాగరసుతుఁ
జంద్రుని కళంకమును మాన్ప ♦ శక్తిగలదె! ౫౦౮

గీ. ఒక్కయెడ మానవుండు తా♦నొకటి తలఁప
దైవమింకొక్క రీతిగాఁ ♦ దలఁచుచుండు;
ధర్మజుఁడు జూదమును వినో♦దమునకాడ
సర్వరాజ్య వినాశంబు ♦ సంఘటిల్లె! ౫౦౯

గీ. ఎన్నియో యత్నముల నాచ♦రింతురుగాక
దైవగతి నుంతయేనియుఁ ♦ దప్పఁబోదు;
సకలవిధ రక్షణంబులు ♦ జరుగుచున్న
నల పరీక్షిత్తు మరణంబు ♦ నందలేదె! ౫౧౦

గీ. రూపగుణశీల విద్యా ని♦రూఢులేని
కష్టములఁ బొందుదురు దైవ♦కారణమున;
అల్ల ద్రౌపది సైరంధ్రి♦యై సుధేష్ణ
నాశ్రయించి బహుశ్రమ ♦ లందలేదె! ౫౧౧

గీ. నిరుపమంబగు దౌర్భాగ్య ♦ గరిమవలన
సద్గుణము గూడఁ గీడునే ♦ సంఘటించు
వలపుఁగొలిపెడు కస్తూరి ♦ గలుగుకతన
ఘోర మరణంబుఁ గనదె క♦స్తూరి మృగము! ౫౧౨

గీ. తా మహేశుఁ, డద్రీశుండు ♦ తనదు మామ,
కొమరుఁడు గణేశ్వరుండు, స♦ఖుఁడు ధనేశుఁ
డైనను శివుండొనర్చు భి♦క్షాటనంబు
ఎంత బలవంతమో గదా ♦ యీశ్వరేచ్ఛ! ౫౧౩

—♦ ధ న ము ♦—

గీ. వసుధ నెంత గొప్ప♦వాఁడేని ధనవంతు
నొద్ద నెపుడుఁ జేర♦కుండ లేఁడు;
అల మహానుభావుఁ ♦ డగు శివుండు కుబేరు
నింటిదరి వసించు ♦ నెల్లవేళ. ౫౧౪

గీ. ఎంచిచూడ ధరణి ♦ నెల్లగుణంబులుఁ
గాంచనంబు నాశ్ర♦యించి యుండు;
పక్షి సంచయంబు ♦ వృక్షంబు మీఁదను
స్త్రీలు పతుల చెంతఁ ♦ జేరునట్లు. ౫౧౫

గీ. అఖిలజనులు ధనము ♦ నార్జింపవలయును
బిదప దాని నెపుడుఁ ♦ బెంపవలయు;
ఆయమింత లేక ♦ యనుభవించుచునున్న
ధరణి మేరువైనఁ ♦ దఱుగకున్నె! ౫౧౬

గీ. ధనముఁ గూడఁబెట్టు ♦ దక్షులు కొందఱు
అనుభవింపఁ గొంద ♦ రర్హు లవని;
కరము కలిపి ముద్ద ♦ గాఁ జేయునన్నంబు
దాని రుచి నెఱుంగఁ ♦ దగును నాల్క. ౫౧౭

గీ. ధనము మిక్కిలి ప్రీతియై ♦ తనరుఁగాక
చెలఁగి దుర్నీతితోడ నా♦ర్జింపరాదు ;
మంచి బంగారుకత్తి ల♦భించెననుచుఁ
గడుపులో నెవ్వఁడైనను ♦ బొడుచుకొనునె ! ౫౧౮

గీ. ద్రవ్యమదమత్తచిత్తుఁడై ♦ తనరువాని
యొద్దఁ జేరనివాఁడె ధ♦న్యుండు సుమ్ము ;
వనములో నాకలంబులు ♦ దిను పశువుల
జీవనంబు నిశ్చింతమైఁ ♦ జెలఁగుఁగాదె ! ౫౧౯

గీ. అవని మనుజుల సంతోష ♦ హానికొఱకె
కడు ధనమువచ్చి చేరు నా♦కస్మికముగ ;
వర్ష జలమెల్లఁ జెఱువులో ♦ వచ్చిచేరి
స్థిరముగా నుండునే గట్టుఁ♦జెఱచుఁ గాక ! ౫౨౦

గీ. అనుభవింపని, పరుల కీ♦యని ధనంబు
అంతయును దొంగలవశంబె ♦ యగునుజుమ్ము ;
తేనటీగలు కూర్చిన ♦ తేనెయెల్ల
నడవిలోఁ బోయవాండ్రు పా♦లగును గాదె ! ౫౨౧

గీ. ఎట్టి గుణములనేని గ♦ణింపఁబోక
జనులు ధనమునె భావింతు్రు ♦ చాలమంది;
శిరముపైఁ దన్ను ధరియించు ♦ శివుని వీడి
గంగ రత్నాకరుంజేర ♦ గంతులిడదె ! ౫౨౨

గీ. ఉన్నత గుణంబులెన్నేని ♦ యుండుఁగాక
యాశ్రయింపరు మానవు ♦ లర్థహీను;
చాతకంబేనియు విశేష ♦ జలముతోడ
నెనయు మేఘంబునే యాశ్ర♦యించుఁగాదె! ౫_౨౩

గీ. తాముచేర్చిన బహుళ వి♦త్తమునుగాంచి
యమిత సంతోషమందుదు ♦ రవని జనులు;
అధికనీరప్రపూర్ణమై ♦ నట్టివేళ
మిగుల గర్జించుచుండదే ♦ మేఘమాల! ౫_౨౪

గీ. ధనికుఁడు గుణాఢ్యునేని నా♦శనమొనర్ప
నెంచగా దరిద్రుండు ర♦క్షించుచుండు;
పూర్ణకుంభంబు త్రాటిని ♦ ముంచివేయుఁ
గాని తేల్చదోకో నీరు ♦ లేనికుండ! ౫_౨౫

గీ. అన్నియు నెఱింగి సప్రాణు♦లైనయట్టి
జనులు ధనమునుబొగడ నా♦శ్చర్యమేమి?
ప్రాణరహితమా దుందుభి ♦ పలుకుఁగాదె
అనయము ధనం ధనం ధనం ♦ ధనమటంచు! ౫_౨౬

గీ. వసుధపై నెంతయును గొప్ప♦వారలేని
ధనమునకు దాసులై యుండు♦రనుట నిజము;
అల మహాశూరులైన భీ♦ష్మాదులెల్లఁ
దిండికై కౌరవుల యండ ♦ నుండలేదె! ౫_౨౭

గీ. ఇలఁ బరోపకారులు కృశియించుచుండ
నిత్తురి ధనికులు లుబ్ధులకే ధనంబు;
ఎంతయును గల్ప భూరుహం బెండిపోవ
సంద్రములయందె మేఘుండు జలముగురియు! ॥ ౨౮

గీ. మిగుల క్రోధభావులగునట్టి వారల
కెంత ద్రవ్యమున్న నేమిఫలము?
చెట్టు మొదలఁ బాము సేరి విషముగ్రక్క
దానిపండ్ల నెవరు తలఁపఁగలరు! ॥ ౨౯

గీ. కాంతపై మానవునకుండు భ్రాంతికంటెఁ
గనకమునఁగల్గు భ్రాంతి యగ్గలముసుమ్మి;
అతుల సౌందర్యవతులైన సతులవీడి
తిరుగరె ధనంబుకై దేశదేశములను! ॥ 30

గీ. పరధనం బుత్తములకు దుర్భరముగాఁగ
నదియె యధముల కతులితాహ్లాదకరము;
కన్నులకు బాధఁగూర్చు శ్రీగంధరసమె
హర్షమునఁగూర్పదే యితరాంగములకు! ॥ 3౧

గీ. కాంత యువకుల కపుడప్డు భ్రాంతిఁగొలుపు
నదియు క్షణమాత్రమే కాని యావల సున్న;
స్త్రీలఁ, బురుషుల, వృద్ధుల బాలకులను
షండులను మోహపెట్టుఁ గాంచనము సతము. ॥ 3౨

## —♦ దారిద్ర్యము ♦—

గీ. అన్యుల గృహంబులందు దూ♦ష్యములు మ్రోగ
నల దరిద్రుని హృదయంబు ♦ కలఁతనొందు;
నాథునింగూడు సతి కంకణముల మ్రోత
భార్య లేనట్టివానికి ♦ బాధ నిడదె! ౫౩౩

గీ. ఆదరింపరు లోకులు ♦ బీదజనుల
నెపుడు ధనవంతులనె గౌర♦వించుచుంద్రు;
భూమిపై సస్యములు మాడి♦పోవుచుండ
నధికవృష్టి సముద్రంబు ♦ నందుఁ గురియు. ౫౩౪

గీ. ఎంచఁగా లేమిచేతఁ గృ♦శించువారి
నందఱును జల్కనగఁ జూతు ♦ రవనియందు;
చేవచెడి యెండిపోయిన ♦ చెట్లనెల్లఁ
గాల్పవే చిన్నవగు నగ్ని ♦ కణములేని! ౫౩౫

గీ. నిర్ధనుని వాణి బహుగుణో♦న్నద్రమయ్యు
నెపుడు ధనవంతు చెంత రా♦ణింపఁబోదు;
నవ్య మోహనమైన వీ♦ణారవంబు
భేరికాధ్వనియొద్ద శో♦భిల్లు నొక్కొ! ౫౩౬

గీ. అమిత దారిద్ర్య పీడితుం♦డైనవాని
నెంచి సామాన్యుఁడును నిర♦సించుచుండు;
ఘన ప్రవాహంబుచేఁ బాతు ♦ కదలియున్న
చెట్టునుం బడఁద్రోయదే ♦ చిన్న గాలి! ౫౩౭

గీ. అరయ దారిద్ర్యపీడితు♦లైన జనులఁ
బాసి చనుచుండు ప్రేమంపు ♦ భార్యలేని;
అనయమును గాటికాపరి♦యగు పతిం ద్య
జించి గంగ రత్నాకరుఁ ♦ జేరుఁగాదె! ౨౩౮

గీ. సత్కులము, విద్య, శీలంబు ♦ శౌర్యగుణము,
చక్కఁదనమును గల పురు♦షప్రవరునిఁ
జక్కఁగఁ బరీక్ష చేసి యా ♦ చతురుఁడైన
కమలభవుఁడు దరిద్రతా ♦ కన్య నొసఁగు. ౨౩౯

గీ. సిరి దరిద్రత యనెడు కూ♦తురులఁ గాంచి
మూఢున కొసంగె బ్రహ్మ దా ♦ మొదటిదాని;
తదుపరి విచారపడియున్న ♦ దానిఁ దెచ్చి
మెచ్చి పండితుఁ డగువాని ♦ కిచ్చె నకట! ౨౪౦

గీ. అన్యులు దరిద్రు నెపుడు ని♦రాదరింతు
రనుచు దూషింతు రజ్ఞాను♦లైన జనులు;
చేసికొన్నట్టి పెండ్లాము ♦ చేతఁ గలుగు
పాదరక్షాప్రయోగముల్ ♦ పలుకఁబోరు. ౨౪౧

గీ. ఉరుగుణ సమూహమందున ♦ నొక్కదోసఁగు
కలియునని పల్కెనేగాని ♦ కాళిదాసు
ఒక్క దారిద్ర్యదోషంబు ♦ పెక్కుకోట్ల
గుణముల హరించుననుచుఁ గ♦న్గొనకపోయె! ౨౪౨

గీ. విత్తమను పుత్త్రిఁగనుటకై ♦ వేదగాన
సత్కవిత్వ వైద్య జ్యోతి♦షంబుల నెడు
భార్యలం జేసికొనఁగ దౌ♦ర్భాగ్యవశత
నైదుగురుఁగూడ గొడ్డురాం♦డ్రైరి తుదకు. ౫౪౩

గీ. వ్యాకరణము గావ్యంబుచేఁ ♦ బాడుపడును,
కావ్యమును నాశనంబగు ♦ గానవశత
గానమును స్త్రీవిలాసంబు ♦ కతనఁ జెడును
స్త్రీవిలాసంబు క్షుద్బాధ♦చే నశించు ! ౫౪౪

గీ. నవ్యసంగీతమును, జంద♦నంపుఁ బూత
పూలపానుపు సొగసు పూ♦బోఁడివలపు
పరిమద మొనఁగూర్చునే క్షుధా♦బాధితునకు
అన్నిటిని మించఁగలదు ♦ బియ్యంపుబాన ! ౫౪౫

—♦ సంపద ♦—

గీ. ఎవనిచెంగట లక్ష్మి వ♦సించుచుండు
నట్టివాఁ డంధుడగుచుండు ♦ నచ్చటచట ;
అబ్జపత్త్రవిశాలాక్షుఁ♦ డైన విష్ణు
నెఱుఁగమే పాముపైఁ బవ్వ♦ళించుచుంట ! ౫౪౬

గీ. కలిమి యించు కంత♦గలిగిన దుష్టుండు
అంతులేని గర్వ ♦ మందుచుండు ;
కొలదిముత్తియములు ♦ గూడిన మాత్రాన
పన్ను తా మదంబు ♦ నెనయుఁగాదె ! ౫౪౭

గీ. తలఁచిచూడ లక్ష్మి ♦ గలవారు తలఁచుగాఁ
బరుల సంకటముల ♦ నరయఁబోరు;
భూమి మోయలేక ♦ పొక్కెడు నల యాది
శేషుపైఁ బరుండు ♦ శ్రీధరుండు. ౫౪౮

గీ. కాంతతో లక్ష్మి ధనవంతుఁ ♦ గౌఁగిలించుఁ
గాని బీదల కంటికిం ♦ గానఁబడదు;
నీరు లేనట్టి భూముల ♦ నిల్వఁబోక
సర్వనదులును జేరవే ♦ సాగరమున! ౫౪౯

గీ. కుటిలురాలగు లక్ష్మి తాఁ ♦ గూడియుండు
తలమునందు సరస్వతి ♦ నిలువఁబోదు;
అమిత దుర్మార్గురాలైన ♦ యత్తచెంత
నొప్పుగా సాధ్వియగు కోడ♦లుండఁ గలదె! ౫౫౦

గీ. త్యాగి నడమకాలఁ ♦ దన్ని సంపద తాను
కోరి లోభిచెంతఁ ♦ జేరుచుండు;
పతిని దృణముగాఁగ ♦ భావించి జారిణి
దుష్టులైన విటుల♦తోడఁ జనదె! ౫౫౧

గీ. జగతిఁ గొన్నిచోట్ల ♦ సంపదల్గూడ వి
నాశమునకుఁ గార♦ణంబు లగును;
ఎప్పుడేని తా ఫ♦లించిన వెంటనే
యరటిచెట్టు విలయ ♦ మందుఁగాదె! ౫౫౨

గీ. ఎంతయు నధర్మమునను బ్రా♦ప్తించినట్టి
కలిమికంటెను లేమియే ♦ ఘనతరంబు;
వాపు రోగంబుచేఁ గల్గు ♦ బలువుకంటె
మేనికిం జిక్కిపోవుట ♦ మేలుగాదె! ౫౫౩

గీ. వసుధ నెందేని సంపదల్ ♦ వచ్చునపుడుఁ
బోలె భాసిల్లనేరవు ♦ పోవునపుడు;
ఉదయవేళను జంద్రున ♦ కుండుకాంతి
యస్తమించెడు సమయంబు♦నందుఁ గలదె! ౫౫౪

గీ. అల్పునకు నెంత సంపద ♦ యమరియున్న
దాని మదియందు నెవ్వరుం ♦ దలఁపఁబోరు;
ఉదధి మైనాకునకు ఱెక్క ♦ లుండుఁగాక
యెవ్వఁడేనియు వాని భా♦వించు నొక్కొ! ౫౫౫

గీ. పరమ నీచావమాన సం♦భరితమైన
సంపదను గోరఁ డెన్నఁడు ♦ సజ్జనుండు;
ఉల్లిగడ్డల కంపుతో ♦ నొప్పునట్టి
చందనముఁ బూసికొనునె యే♦ చవటయైన! ౫౫౬

గీ. నరునికడలక్ష్మి సేరిన ♦ తఱిని నోరు,
చెవులు, కన్నులు చెడుటలోఁ ♦ జిత్రమేమి?
ఘనతరవిషంబుతోడఁ బు♦ట్టినది యయ్యుఁ
బ్రాణములఁ దీయకుంట య♦బ్రమ్ముసుమ్ము! ౫౫౭

గీ. గట్టిగా బాహువులఁ దార్ళ్ళఁ ♦ గట్టఁబడియు
సురిగి చను లక్ష్మి కనుమూసి ♦ తెఱచునంత;
నీట బుట్టినబిడ్డ కా ♦ నీటిగుణము
చక్కఁగాఁ బట్టువడుట నా♦శ్చర్యమేమి? ౨౨౮

గీ. జనులు లక్ష్మిని బ్రకృతి చం♦చల యటంచుఁ
దూరుచుండెద రది మంచి ♦ తీరుగాదు;
ఆమె నా లోకరక్షకుం♦డైన హరికి
నిచ్చిన సముద్రు దూషించు♦టే యుచితము. ౨౨౯

గీ. అత్త లేకున్నచోఁ గోడ ♦ లుత్తమత్వ
మందునని పల్కుదురు లోకు ♦ లది యబద్ధ
మత్త యగు లక్ష్మి లేకున్న ♦ నతిగుణాఢ్య
యా సరస్వతి యవమాన్య ♦ యగుటఁ గనమె! ౨౩౦

గీ. చంచలత నొడఁగూర్చె ను♦చ్చైశ్శ్రవంబు
వక్రతఁ బొసంగఁ జేసె జై♦వాతృకుండు
మోహగుణము నొసంగె హా♦లాహలంబు
పాప మిన్నింటిచే లక్ష్మి ♦ పాడుపడియె. ౨౩౧

గీ. అధికసంపదచేఁ బూర్ణుఁ♦డైనవాఁడు
భయము లేదిఁక నాకని ♦ పలుకరాదు;
అరయఁ బరిపూర్ణుఁడై♦నట్టి చంద్రు
నేగదా రాహువు గ్రసించు ♦ నెప్పుడేని! ౨౩౨

గీ. ఇమ్మహిస్థలి హాలాహ♦లమ్ము కంటె
లక్ష్మియే ఘోరవిషమై చె♦లంగుచుండు;
శివుఁడు హాలాహలంబు ♦ భక్షించిమెరయు
హరి సిరిం దాకి మైకంబు ♦ ననుభవించు! ౫౬౩

గీ. అల నిరుద్యోగి సోమరి ♦ యైననరుని
చెంత సంపద యెపుడేని ♦ చేరఁబోదు;
షండుఁడును, వృద్ధుఁడై మూల్గు♦చుండుభర్త
సరస క్షణమైన నిల్చునే ♦ చంచలాక్షి! ౫౬౪

గీ. కమల! నీ నిగ్రహాను గ్ర♦హములవలన
నించుకయెమార్పు వొడము న♦దేమిలెక్క?
వనము, దుఃఖంబు గలుగు కో♦పంబుచేత
భవనము, సుఖంబు ప్రాప్తించుఁ ♦ బ్రాపువలన! ౫౬౫

—♦ ఆపద ♦—

గీ. అధములనెకాని యుత్తము ♦ లైనవారి
నెట్టి యాపదలేని బా♦ధింపలేవు;
తలఁపగా మంచుచేఁ బాద♦ములకెగాక
కనుల కిసుమంతయును బాధ ♦ గలుగునొక్కొ! ౫౬౬

గీ. ఆపదలు ముందు రానున్న♦వని యెఱింగి
వానికిఁ బ్రతిక్రియల నెంచ♦వలయు నరుఁడు;
చండతరవహ్నిచే నిల్లు ♦ మండునపుడు
బావిత్రవ్వంగ యత్నింప ♦ ఫలముగలదె! ౫౬౭

గీ. ఆపదలు ముందు రానున్న ♦ యట్టివేళ
ఘనులకేనియు బుద్ధి సం ♦ క్షయముగాంచు
గాకయుండిన నాడు బం ♦ గారులేడి
వెంటఁజని రాముఁడడవిలో ♦ వెతలఁబడునె! ౫౬౮

ఆ. కష్టమెంతయైనఁ ♦ గల్గినప్పుడె తమ
శక్తి చూపుచుంట ♦ సహజ మవని;
అగ్ని చలనమంది ♦ నప్పుడే వెలుగును
పాము దెబ్బదినియె ♦ పడగవిప్పు! ౫౬౯

గీ. ఆపదలు ప్రాప్తమగు సమ ♦ యంబునందె
యెల్లర బలాబలంబులు ♦ దెల్లమగును;
పర్వతమునకు దూదికు ♦ ప్పకును గలుగు
భేదమేర్పడునే గాలి ♦ వీవకున్న! ౫౭౦

గీ. ధారుణీ మండలమున నె ♦ వ్వారికైనఁ
గష్టములఁ బొందకున్న సు ♦ ఖంబుసున్న;
కడు శ్రమంబులఁ బడయుటం ♦ గాదె ఘటము
తరుణి కుచపార్శ్వములఁజేరి ♦ మెరయుచుండు! ౫౭౧

ఆ. ఈషణత్రితయమున కా ♦ శించి ప్రకృతి
బద్ధుఁడై నరుఁడెందు నా ♦ పదలఁ బొందు;
దారపుత్రాదులందలి ♦ కూరిమి మెయి
వలఁ దగుల్కొని నుక్రిక్కదే ♦ పావురంబు! ౫౭౨

## —ధైర్యము—

గీ. ధీరులై యత్నమొనరించు వారి కెందుఁ
బడయఁగా రానియట్టి లాభంబులేదు;
అన్యుల కసాధ్యమైనట్టి యమృతమెల్లఁ
గాంచరే దేవతలు ధైర్యగరిమ చూపి! ౫౭౩

గీ. ఆపదలయందు ధీరులై యలరువారి
చెంత నతులిత సంపదల్ సేరుచుండు;
ప్రథిత ధీరాత్ములైనట్టి పాండుసుతులు
వడయరే ప్రాజ్యసామ్రాజ్య వైభవంబు! ౫౭౪

గీ. అందఱును బెద్దలే సౌఖ్య మనుభవింపఁ
గష్టములఁ బొంద ధీరుఁడొక్కఁడె తగును;
అమృతపానంబుఁ గావించి రమరులెల్ల
శంకరుఁడె గతియయ్యె విషంబు మ్రింగ. ౫౭౫

గీ. కష్టమగు బంధువిరహంబు గలిగినంత
ధైర్యగుణమును విడంగఁ దగదు నరుఁడు;
పుత్రమరణంబు విని ధైర్యమును ద్యజించి
మున్ను ద్రోణుండు దా స్వర్గమునకుఁ జనఁడె! ౫౭౬

గీ. అమిత కష్టకాలమందును ధైర్యంబు
వదలకున్న మేలు వడయఁగలఁడు;
తెప్పమునిఁగినంత ధీరుండు సంద్రంబు
నీఁది గట్టుఁజేర నెంచకున్నె! ౫౭౭

గీ. అధిక కష్టంబులను జేర్చి♦యైన మాన్పఁ
దరముగాదిల ధీరుని ♦ ధైర్యగుణము;
చేరి యగ్నిని దలక్రిందు♦చేయుచున్న
జ్వాలలూర్ధ్వ ముఖంబుగా ♦ సాగుచున్న! ౫౭౮

—♦ శౌర్యము ♦—

గీ. అల్పు లెంతమంది♦యైనను శూరుని
సంహరింపలేరు ♦ జగతియందు;
అడవిలోని మృగము♦లన్ని యేకంబయ్యు
సింహమునకుఁ గీడు ♦ సేయఁగలవె! ౫౭౯

గీ. తానుగూర్చినట్టి ♦ ద్రవ్యంబునే శూరుఁ
డనుభవించుఁ గోరఁ ♦ డన్య ధనము;
స్వయముగా మదేభ ♦ సంహార మొనరించి
జీవనంబు సేయు ♦ సింహ మెపుడు! ౫౮౦

గీ. ఘనతరంబగు తేజంబు ♦ గలిగియున్న
వయసుతోఁ బనిలేదు ర♦వ్వంతయైన;
నిరతమును బాలసూర్యుని ♦ కిరణసమితి
పర్వతంబుల మీఁదికిం ♦ బ్రాకుచున్న! ౫౮౧

గీ. శత్రుఁడెంతటి భుజబల♦శాలియైన
నెప్పుడును శూరుఁడతని గ♦ణింపఁబోఁడు;
పర్వతము నెత్తుగాఁ బేర్పఁ ♦ బడినయట్టి
కట్టెలను గాల్పదే నిప్పు♦కణిక యొకటి! ౫౮౨

గీ. అరయఁగా నెంత బలవంతు♦లైనఁ గాని
శూరు నెదిరించి నిల్వఁగా♦లేరు సుమ్మి;
గర్వకలితంబులగు మహా ♦ పర్వతములు
వజ్రమును గాంచుచోఁ దల ♦ వాల్పకున్నె! ౫౮౩

గీ. శూరుఁడును శూరునే చంపఁ♦జూచుచుండుఁ
గాని హీనుల వధియింపఁ ♦ బూనుకొనఁడు;
కోరి సుడిగాలి చెట్లనే ♦ కూల్చుఁగాని
చిన్న గఱికల నశియింప ♦ జేయునొక్కొ! ౫౮౪

గీ. అనయమును శూరుఁడై యొప్పు ♦ నట్టి నరుఁడు
వారి వీరి సహాయుతం ♦ గోరఁబోఁడు;
సింహ మితరమృగంబుల ♦ చేత సాయ
మందఁదలఁచునొకో స్వప్న♦మందు నైన! ౫౮౫

గీ. క్షాంతిగలవాఁడటంచుఁ దే♦జస్వి కెవ్వఁ
డేనియు పరాభవంబుఁ గా♦వింపరాదు;
సారెసారెకుఁ దఱచినఁ ♦ జందనమున
నేని యగ్నికణంబు జ♦నింపకున్నె! ౫౮౬

గీ. శౌర్యధనుఁడులేని ♦ సమయమ్ము నందెల్ల
వారు శూరులగుచుఁ ♦ బరగుచుంద్రు;
భాస్కరుండు లేని♦పట్టున మిణుగుర్లు

గీ. ఎంచఁ బలువురు సామాన్యు ♦ లేకమయ్యు
శూరునొక్కని వధియింప ♦ లేరుసుమ్ము;
పావురములన్నియును గూడి ♦ వచ్చెఁగాక
సాహసంబూని డేగను ♦ జంపఁగలవె! ౫౮౮

గీ. అప్రతిమ శౌర్యవంతుఁడై ♦ యలరువాఁడు
ఎపుడు దుర్బలులను సంహ ♦ రింపఁబోఁడు;
పెనచి ఘోరసర్పములఁ జం ♦ పెడు ఖగేంద్రుఁ
డెంచునే నీటిపాములఁ ♦ ద్రుంచుకొఱకు! ౫౮౯

గీ. శూరుఁడొకతఱి నింటిలోఁ ♦ జొచ్చియున్న
యంత మాత్రంబుచే భీరుఁ ♦ డనఁగరాదు;
మత్తగజవైరియైన సిం ♦ హంబు గుహను
జేరియుండిన నది భీతి ♦ చేత నగునె! ౫౯౦

గీ. శూరులు స్వశక్తిచేతఁ గె ♦ ల్చుదురు రిపుల
పరుల మంతనముల నేని ♦ బడయఁబోరు;
మత్తవేదండకాండ సం ♦ హారమందు
సింహ మెవనితో యోజన ♦ సేయుచుండె! ౫౯౧

గీ. అధిక తేజోనిధానుఁడై ♦ నట్టివాఁడు
పరకృత తిరస్కృతిని సహిం ♦ పంగఁబోఁడు;
తలఁప జడమగు సూర్యకాం ♦ తంపు మణియు
నినపదస్పర్శచేఁ బ్రజ్వ ♦ రిల్లుఁగాదె! ౫౯౨

గీ. ఇంచుకేనియుఁ దాను జ♦లింపఁబోక
యఖిల శత్రుల సమయించు ♦ నల మనస్వి;
సూర్యుఁ డవలీలగా నెల్ల ♦ చోటులందు
నిండు గాఢాంధకారంబు ♦ చెండకున్నె; ౫౯-౩

గీ. అరయ లోకహితంబులై ♦ నట్టి క్రియలు
సర్వమును శౌర్యవశమున ♦ జరుగుచుండు;
సాధుసంరక్షణాదుల ♦ జరుపుకొఱకు
శౌర్యము వహింపఁడే మున్ను ♦ జక్రిధరుఁడు! ౫౯-౪

గీ. అన్ని గుణముల కంటె శౌ♦ర్యము నరులకు
గురుతరంబైన యశముచే♦కూర్పఁగలదు;
సమరమం దభిమన్యుండు ♦ చచ్చెఁగాక
యతని శౌర్యంబు కీర్తిదా♦యకము గాదె! ౫౯-౫

గీ. క్షీణుఁడైనను దేజో ని♦ధానుఁడైన
జనపతిం బూజసేతురు ♦ సకలజనులు
క్షీణుఁడగుఁగాక తేజో ని♦ధానుఁడైన
విదియచంద్రుని బ్రజ గౌర♦వింపకున్నె! ౫౯-౬

గీ. ఒక్కపుడు శూరుఁడరులకుఁ ♦ జిక్కెఁగాక
విడిచి బ్రతికింపుడీ యంచు ♦ వేడఁబోఁడు;
సిరియొకానొకవేళఁ గృ♦శించుఁ గాక
చిహ్నములు దానితోడ న♦శించునొక్కొ! ౫౯-౭

గీ. అధిక మానవంతుఁ♦డగు నట్టి మనుజుండు
హీనకార్యములకుఁ ♦ బూనుకొనఁడు;
మదపుటేన్గు మెదడు ♦ మదిఁగోరు సింహంబు
హరిణమాంసమునకు ♦ నాశపడునె! ౫౯౮

గీ. ఎంచఁ జిన్న బాలుఁ♦డేని శూరుండైన
దొడ్డశత్రువులను ♦ దుంపఁగలఁడు;
చిన్నతనము నందె ♦ చెలఁగి సింగపుఁబిల్ల
గొప్ప యేనుగులను ♦ గూల్పకున్నె! ౫౯౯

—♦ వీర్యము ♦—

గీ. వీరవర్యుండు తననోరు ♦ విప్పినంత
నఖల శాత్రవులును భయ♦మందఁ గలరు;
నెమలి యొక్కింత శబ్దంబు ♦ నెరపినంతఁ
బాములన్నియు భీతిచేఁ ♦ బర్వులిడవె! ౬౦౦

గీ. వీరుని ప్రతాపమొక్కింత ♦ వెలసినంత
నొక్కఁడును దేశమున శత్రు ♦ వుండఁబోఁడు;
అబ్జబాంధవుఁ డుదయించి ♦ నంతమాత్ర
నంధకారంబు క్షణములో ♦ నడఁగిపోదె! ౬౦౧

గీ. వీరునకుఁ గష్ట మొకటఁ బ్రా♦ప్తించుఁగాక
మరల నమితప్రతాపుఁడై ♦ మెరయఁగలఁడు;
ఇనుఁడు విధివశమున సస్త♦మించుఁగాక
తిరిగి యుదయింపఁడె దివ్య♦తేజ మలర! ౬౦౨

గీ. ఎంత వీరుఁడైనను విక్ర♦మింపకున్న
నాతనికి నొక్కఁడును భయ ♦ మందఁబోఁడు ;
ఇలను బెబ్బులియును బొబ్బ♦రింపకున్న
బాలకుల కాటవస్తువై ♦ పరగుఁగాదె ! ౬౦౩

గీ. కష్ట మెంతయేని ♦ గల్గినఁ వీరుండు
శత్రువుల నడంపఁ ♦ జాలియుండు ;
ఒక్క శిరమె మిగిలి♦యుండినఁ రాహువు
చెలఁగి చందురుని గ్ర♦సించుఁగాదె ! ౬౦౪

గీ॥ హస్తమున ఖడ్గమును బట్టి♦నట్టి వీరుఁ
డితరుల ప్రతాప మింత స♦హింపలేఁడు ;
శక్తి నశియింప రణమునఁ ♦ జచ్చియేని
గండివడఁజేయు నల సూర్య♦మండలమును. ౬౦౫

## —♦ పౌరుషము ♦—

గీ॥ పౌరుషము గొంచెమును లేక ♦ పరగువాఁడు
అధములందును నవమాన ♦ మందఁగలఁడు ;
ఆలయమువిగాది రాతి సిం♦హమును జూచి
వాయసములును నెత్తిపై ♦ వ్రాలకున్నె ! ౬౦౬

గీ॥ పౌరుషంబును విడనాడి ♦ పూరుషుండు
దైవమే యన్నిటికినంచుఁ ♦ దలఁపఁదగదు ;
ఒక్క చక్రంబుమాత్రమే ♦ యుండెనేని
నడచునే బండి పుడమిపైఁ ♦ బడునుగాక ! ౬౦౭

గీ॥ యత్నమునఁ గార్యసంసిద్ధి ♦ యగునుగాని
మదిని దలపోయుచున్నంత ♦ మాత్రిఁ గాదు !
కోరి సింహము గుహలోనఁ ♦ గూరుచున్న
వనమృగంబులు నోటిలో ♦ వచ్చిపడునె ! ౬౦౮

—♦ సామర్థ్యము ♦—

గీ॥ ఆఢ్యుఁడైనవాని ♦ ననిశంబుఁ గాపాడ
వలయు వంశమెల్ల ♦ నిలచుకొంటకు ;
బండికుండ యొకటి ♦ పాడైనచోఁ జక్రి
మెట్లుతిరుగు నాకు ♦ లెన్నియున్న ! ౬౦౯

గీ॥ ఆఢ్యుఁడొకఁడు మరణ ♦ మందినంతనె పెక్కు-
జనులకిల విపత్తు ♦ సంభవించు ;
సూర్యుఁడస్తమించు♦చో నెల్ల పద్మముల్
ముడుచుకొనవె నిండు ♦ ముదమువిడి ! ౬౧౦

గీ॥ ఎట్టి దుష్టజనుల♦నేని సమర్థులౌ
వారు క్షణములోన ♦ వంపఁగలరు ;
ఎల్లరకు భయంబు ♦ నొసఁగించు పామునే
కాలఁ జీల్చుకున్న ♦ గరుడపక్షి ! ౬౧౧

గీ॥ అధిక శక్తివంతుఁడైనను దన శక్తిఁ
దెలుపకున్నఁ గీర్తి ♦ కలుగఁబోదు ;
కొయ్యయందు నగ్ని ♦ కూడియుండును గాక
దాని నెవ్వఁడైనఁ♦ దలఁచునొక్కొ ! ౬౧౨

గీ॥ బలముగలవారి బాధింపఁ ♦ దలఁపరెవరు
ఎల్లరును సాధువులనె హిం♦సించుచుంద్రు;
ఇల గజవ్యాఘ్రసింహాదు ♦ లెన్నియున్నఁ
జంపుదురు మేకలనె యజ్ఞ♦సమయమందు. ౬౧౩

గీ॥ బలముగలవారలకు సాయ♦పడెడువారె
చేరి బలహీనులకుఁ గీడు ♦ సేయుచుంద్రు;
చెలఁగి యగ్నిని వ్యాపింపఁ ♦ జేయునట్టి
వాయువే దీపముల నార్పి♦వేయుఁగాదె! ౬౧౪

గీ. ఎట్టి ఘనుఁడేని శక్తిఁ జూ♦పింపకున్న
నెవ్వఁడును వాని సామర్థ్య ♦ మెఱుఁగలేఁడు;
ఎల్ల గిరిపక్షములను భే♦దింపకున్న
నలఘు వజ్రాయుధబలంబు ♦ దెలియనగునె! ౬౧౫

గీ. చాల గొప్పపనుల ♦ సమకూర్చువానికిఁ
జిన్నకార్యముల వ♦చింపవలెనె!
మదపుటేనుఁగులను ♦ మడియించు సింహంబు
చెంత లేళ్ళమాటఁ ♦ జెప్పనేల? ౬౧౬

గీ. ఒక్కఁ డత్యంత బలవతుఁ ♦ డుండునెడల
నతని మించెడువాఁడు నీ ♦ క్షితినెసంగు;
తాడిఁదన్నంగఁ గలవాఁడు ♦ తనరునెడల
వాని తలఁదన్నఁ గలిన♦వాఁడు నుండు. ౬౧౭

గీ. దేవదేవుని కరుణార్ద్ర ♦ దృష్టికతన
జన్మతోఁబుట్టు నెటువంటి ♦ శక్తియేని;
అన్యులకుఁ గష్టసాధ్యమై ♦ నట్టి యీతఁ
జిన్ననాఁడె యెఱుంగదే ♦ చేపపిల్ల! ౬౧౮

గీ. మగఁడు శక్తిహీనుఁ ♦ డగునెడఁ గామినుల్
మిగుల స్వేచ్ఛఁబూని ♦ మెలఁగుచుండ్రు;
చంద్రుఁడసిత పక్ష♦మందు వెల్గకయున్నఁ
జుక్కలెల్ల మిగుల ♦ శోభఁగనవె! ౬౧౯

గీ. శక్తిగలవారు రవ్వంత ♦ శంకలేక
స్వేచ్ఛగా నెట్టి పనినైనఁ ♦ జేయఁగలరు;
అందఱును జూచుచుండ ది ♦ గంబరుఁడగు
శివుఁడు పార్వతిం దొడపైని ♦ జేర్చికొనఁడె!

గీ. జగతినంతటను వి ♦ చారింప నందందు
శక్తిలేనివాఁడు ♦ సాధువగును;
జారులెవరుఁ జెంతఁ ♦ జేరనియెడ జార
భర్తయెడల మిగుల ♦ భక్తిఁదాల్చు ౬౨౧

గుణము.

గీ. ఎంత దరిద్రవంతుఁ ♦ డేనియు సద్గుణం
బెనయుచున్న గొప్ప ♦ తనము సున్న;
కాంచనంబు నిండు ♦ గా నున్న మేరువు
పర్వతాధి రాజ ♦ పదముఁగనునె! ౬౨౨

గీ. ఎంత ధనముండినను గుణ ♦ హీనుఁడైన
వానిఁ జేరరు సజ్జను ♦ లైనవారు;
వెండి కొండయు బంగారు ♦ కొండయుండఁ
జందనపుఁ జెట్టు ♦ మలయాద్రి ♦ సరసఁజేరె. ౬౨౩

గీ. అధిక సౌందర్య వంతుఁడే ♦ యగునుగాక
గుణములేకున్న గౌరవం ♦ బును గనందు;
తావిలేనట్టి మోదుగ ♦ పూవునందు
నెంత చక్కదనం బున్న ♦ నేమి ఫలము? ౬౨౪

గీ॥ గుణములే యెల్లెడలఁ బూజఁ ♦ గొనునుగాని
తండ్రియున వంశమన నిర ♦ ర్థకముసుమ్మి;
వాసుదేవున కొనరింతు ♦ వందనములు
తండ్రియైనట్టి వసుదేవుఁ ♦ దలఁతురొక్కొ! ౬౨౫

గీ॥ గుణమునకు గౌరవంబు సే ♦ కూరుఁగాని
యున్నతాసనమునఁ జేరి ♦ యున్న రాదు;
కోటకొమ్మలపై నెక్కి ♦ కూరుచున్న
మాత్రమునఁ గాకియును గరు ♦ త్మంతుఁడగునె! ౬౨౬

గీ॥ వస్తుగుణమును దెలియని ♦ వారు దాని
నపహసించుటలో నేమి ♦ యబ్బురంబు?
వాసిగల రత్నములఁ గాఁకి ♦ ద్రోసి బోయ
కాలఁది ధరియింపదే గురి ♦ వెందగింజ! ౬౨౭

గీ॥ గుణముగలవాఁడె గుణముచే ♦ గొనఁగజాలు
నిర్గుణుండేమియు గ్రహింప♦ నేరకుండు;
కోయిల వసంతగుణముఁ గ♦న్గొనును గాక
కాకి యిసుమంతయు నెఱుంగఁ ♦ గలుగునొక్కొ!

గీ॥ గుణముగలవాఁడుగూడ స♦జ్జనులచేతఁ
జెప్పఁబడకున్న నంతయు ♦ మెప్పఁగనఁడు;
సూర్యకిరణంబు లిసుమంత ♦ సోఁకకున్నఁ
గాంతినేకూరునే సూర్య♦కాంతమణికి! ౬౨౯

గీ. ఒక గుణంబున్న నదియె వే♦ఱొక గుణంబుఁ
గోరుచుండును విఖ్యాతి ♦ గొన దలంచి;
సహజముగ రమ్యమై యొప్పు ♦ చక్కఁదనము
తరుణ భావంబుచే మనో♦హరముగాదె! ౬౩౦

గీ. బహుగుణాఢ్యు నందుఁ ♦ బరికింప నొకదోష
ముండుఁగాక తలఁప ♦ దొక్కరేని;
చందమామలోని ♦ కందు భావింతురే
గుణములందుఁ బ్రీతి ♦ గొందురుగాని! ౬౩౧

గీ. గుణము లార్జింప యత్నంబుఁ ♦ గొనఁగవలయు
నట్టి యాడంబరములున్న ♦ నేమిఫలము
ఎపుడుఁ బాలీని యావున ♦ కెన్ని యేని
గంటలంగట్టినను వెల ♦ కలుగునొక్కొ! ౬౩౨

గీ॥ జనులలో సద్గుణంబులు ♦ తనరు నెడల
నవి ప్రకాశంబు నందుఁ ♦ దమంతఁదామె ;
సురుచిరంబుగ నొప్పఁ గ♦స్తూరితావి
తెలుగునే యొట్టుపెట్టినఁ ♦ ధరణియందు !

గీ॥ తెలియఁగా సద్గుణంబుల ♦ వలనఁగూడ
నప్పుడప్పుడు కష్టంబు ♦ లావహిల్లు ;
చిలుక మధురోక్తులాడుట ♦ వలనఁగాదె
పంజరంబున బంధింపఁ ♦ బడుచునుండె. ౬౩౪

గీ॥ గుణములెంత దూర♦మున నున్న సరసులు
వానిఁబొందఁ దామె ♦ వచ్చుచుండ్రు ;
మొగలిపూవుతావి ♦ మూర్కొన మదనెంచి
షట్పదములు చనవె ♦ సంతతంబు ! ౬౩౫

గీ॥ జగతి గుణవంతుఁడే ప్రదే♦శంబునందు
నుండిన గుణంబు శోభిల్లు♦చుంట నిజము ;
క్రూరసర్పంబు శిరమున ♦ హారమునను
జేరి రత్నంబు దాఁ బ్రకా♦శించుఁగాదె ! ౬౩౬

గీ॥ అతిగుణాఢ్యుల సుస్థిరంబైన మనసు
పరుల యుపదేశమున మార్పఁ ♦ బడఁయఁబోదు ;
భాసురంబైన రత్న దీ♦పముల కాంతి
చెడునె యెంతటి సుడిగాలి ♦ చేతనైన ! ౬౩౭

గీ. జన్మదేశంబుచే నంద ♦ చందములను
గాక కేవలగుణముచే ♦ ఘనత గలుగు;
మృగము నాభినిబుట్టి న♦ల్లగఁ దనర్చి
పరిమళముచేతఁ గస్తూరి ♦ వాసిఁగనదె! ౬౩౮

గీ. ఎవ్వరో మూఢులు దిరస్క ♦ రింతురేగాక
సద్గుణముఁగాంచి ప్రాజ్ఞులు ♦ సంతసింతురు;
జడులు గస్తూరిఁ గని మూతి ♦ ముడుచుచుండఁ
బ్రభువులెల్లరుఁ బ్రీతిమైఁ ♦ బడయరొక్కొ! ౬౩౯

గీ. గుణయుతుఁడు చాల నిడుములఁ ♦ గుడుచుచుండ
గుణవిహీనుఁడు సుఖము సే♦కొనుట గలదు;
చిలుక లల పంజరమున శి♦క్షించుచుండఁ
గాకు లెల్లప్పుడు యథేచ్ఛ♦గాఁ దిరుగవె! ౬౪౦

గీ. సర్వసంపదలును గుణ ♦ సహితులైన
వారినే పొందు నన్యులఁ ♦ జేరఁబోవు;
గుణముతోఁ గూడుటనె ఘట♦మునకు శక్తి
గలిగెఁ బాతాళమందలి ♦ జలముఁగొనఁగ. ౬౪౧

గీ. ఒకని సద్గుణంబు ♦ లూహించి తెలియంగ
నవి గలట్టివారె ♦ యర్హతములు;
శాశ్వతముగ నెల్ల ♦ విశ్వంభరాభార
మోచి శైలములె గ్ర♦హింపఁ గలవు. ౬౪౨

గీ. తజ్ఞులే గ్రహింత్రు ♦ ధర నెట్టిగుణమేమి
యన్యుఁ డెఱుఁగునే ర♦వంతయేని;
పూలలోని తావి♦ముక్కునకే గాక
యించుకైనఁ గంటి ♦ కెఱుకపడునె! ౬౪౩

గీ. గుణము లెంతదూర♦మున నున్న సరసులు
వానిఁ గాంచఁ దామె ♦ వచ్చుచుంద్రు;
పూలలోని తావి ♦ మూర్కొన మది నెంచి
షట్పదములు రావె ♦ సంతతంబు! ౬౪౪

గీ. ఒకనియం దెన్ని దోషంబు♦లున్న గుణమొ
కింతగల్గిన సజ్జనుల్ ♦ సంతసింత్రు;
జలచరంబులుఁ బాషాణ♦చయముఁ గల్గు
క్షీరవారాసిలో విష్ణు ♦ చేరకున్నె! ౬౪౫

గీ. ఎంచ గుణవంతులకు గుణ♦హీనులకును
భేద మెందైన మిగుల దీ♦పించుచుండు;
రమణు లురమున రత్నహా♦రములఁ దాల్చి
యుందెలను బాదములఁ దాల్చు♦చుంద్రుగాదె! ౬౪౬

గీ. మహిఁ గురూపియైన ♦ మాత్రాన సుగుణి య
గౌరవంబు నెపుడుఁ ♦ గాంచఁబోఁడు;
మేలుఁగూర్చు వర్ష ♦ కాలా భ్రమండలి
నలుపు నెవ్వఁడేని ♦ తలఁచునోకో! ౬౫౭

## —♦ దోషము ♦—

గీ. పుడమి జన్మతోడఁ ♦ బుట్టినదోషంబు
తొలఁగదే యుపాయ♦ములను గూడ;
మంచి తేనెలోన ♦ ముంచి యుంచిననేని
వేపచక్క చేదు ♦ విఱుగునొక్కొ! ౬౪౮

గీ. ఎంచి గుణదోషములు నిశ్చ♦యింపఁబోక
నే పనియుఁ దీవ్రముగ నాచ♦రింపరాదు;
బలమదంబున నెవఁడేని ♦ పామునోటఁ
జేయి వెట్టిన యెడల న♦శింపకున్నె! ౬౪౯

గీ. అరయదోషంబు వ్యాపించి ♦ నంత వడిగ
గుణము దెలియంగఁబో దిల ♦ జనులకెందు;
చందురునిలోఁ గళంకంబు ♦ స్పష్టమైన
గతిఁ బ్రసన్నత విశదంబు ♦ గాకయుండు. ౬౫౦

గీ. కనుల కానందమగు వస్తు♦వున నెవండు
నితర దోషంబులను గణి♦యింపఁబోఁడు;
అందముగ వెల్గుచుండెడు ♦ చంద్రునందు
గల కళంకంబు నెవఁడైనఁ ♦ దలఁచునొక్కొ! ౬౫౧

గీ. సర్వమెఱిఁగియు దోషంబు ♦ సలుపు నెవఁడు
వానికింకఁ బ్రతిక్రియ ♦ వసుధ లేదు;
అరయ మేల్కాంచియును నిద్ర ♦ నభినయించు
నతని మేల్కొల్పు టది వ్యర్థ ♦ మగునుగాదె! ౬౫౨

గీ. తలప నిజదోషవృతచిత్త◆ములకు మంచి
రీతిఁగాఁదోఁచుఁ గడు విప◆రీతమేని;
సదమలంబై ప్రకాశించు ◆ శంఖమైనఁ
బైత్యరోగికిఁ గన్పించుఁ ◆ బచ్చనగుచు. ౬౫౩

గీ. ఒక్క దోషంబు మనుజునం ◆ దున్న యెడలఁ
గ్రమముగా వచ్చి పెక్కు దో◆షములు సేరు;
కాయమందు నజీర్ణ మొ◆క్కటి వసింపఁ
బలురకములైన వ్యాధులుం ◆ బ్రబలకున్నె! ౬౫౪

గీ. బహుగుణాన్వితులై యొప్పు ◆ వారలేని
యొక్క దోషంబుచేఁ జెడు◆చుంట నిజము;
ఎల్లరసముల కిక్కయౌ ◆ నుల్లిపాయ
యింపుబాయదె యొక హాదు ◆ కంపువలన! ౬౫౫

గీ. సాధులకుఁ గల్గు దోషంబు ◆ స్వల్పమయ్యు
బయటఁబడి వారి కెంతేని ◆ బాధఁగూర్చు;
కొంచెమైనను దెల్లని ◆ గుడ్డమీఁద
మురికిపడి దాని యందంబుఁ ◆ జెఱుచుఁగాదె! ౬౫౬

—◆ సుఖము ◆—

గీ. ఒక్కఁడేనియు శాత్రవుం ◆ డుండునెడల
సుఖము లభియించుననుమాట ◆ శూన్యమగును;
ఒక్కరాహువు శత్రుఁడై ◆ యుంటవలనఁ
జందురుఁ డొందఁడె పలుమారు ◆ సంకటముల! ౬౫౭

గీ. అమితదుఃఖ మొంది ♦ నట్టిపిమ్మటఁ దోచు
నల్ప సుఖముగూడ ♦ నధికముగనె;
విసమువంటి చేదు ♦ రసముఁ ద్రావినమీఁద
జలము మధురమగుచు ♦ నలరుఁగాదె! ౬౫౮

—♦ దుః ఖ ము ♦—

గీ. కాంచ దేవతలకును సు♦ఖంబుకంటె
దుఃఖమే యగ్గలంబుగాఁ ♦ దోచుచుండు;
ఒక్కదినమునఁ బూర్ణుఁడై యుండు చంద్రుఁ
డవల బహుదినములు కార్శ్య ♦ మందుఁగాదె! ౬౫౯

—♦ పు ణ్య ము ♦—

గీ. పుణ్యవంతుఁడైన ♦ పురుషుండు మాత్రమే
విద్యనేర్చ ధాత్రి ♦ వెలయఁగలఁడు;
చిలుక శ్లోకములను ♦ బలుకనేర్చును గాక
యన్యపక్షి కెందు ♦ నలవియగునె! ౬౬౦

గీ. పుణ్యమనెడు విద్య ♦ పూజ్యమై తోఁచిన
నఖిలవిద్యలును ని♦రర్థకములు;
లోని నల్లగుడ్డు ♦ లేనట్టి నేత్రంబు
వలన నించుకైన ♦ ఫలముగలదె! ౬౬౧

గీ. కొంద రత్యంతశక్తితో ♦ నుంద్రుగాక
పుణ్యవంతులె సత్కీర్తిఁ ♦ బొందఁగలరు;
పక్షముల రెంట వెన్నెల ♦ పరగుఁగాక
శుక్లపక్షంబు గాంచదే ♦ సుప్రసిద్ధి! ౬౬౨

గీ. ఎందఱో శక్తివంతులై ♦ యుండ్రిగాక
పుణ్యవంతులకే కల్గు ♦ భూరియశము;
చేపలుం బాలు నీరు వే♦ర్చేయఁగాక
హంసలే లోకవిఖ్యాతి ♦ నందఁగల్గె! ౬౬౩

గీ. పలువు రనుచితకార్యముల్ ♦ సలిపికూడఁ
బుణ్యవశమున సత్కీర్తిఁ ♦ బొందుచుండ్రి;
కుంతియును ద్రౌపదియు నైదు♦గురికి భార్య
లయ్యును బతివ్రతాఖ్యాతి ♦ నందలేదె! ౬౬౪

గీ. సరస, సాలంకృత సువర్ణ, ♦ సహితమూర్తి,
సుపదవిన్యాసయై మహా ♦ శోభఁగాంచు
నార్యయేనియు నటువంటి ♦ భార్యయేని
పుణ్యహీనుల కెందేని ♦ పొందవశమె! ౬౬౫

—♦ పా ప ము ♦—

గీ. తీర్థముల కెల్ల నిత్యంబుఁ ♦ దిరుగఁగాక
తాను జేసిన పాపముల్ ♦ దలఁగఁబోవు;
కాశికిం బోయినంతనే ♦ కట్టికుక్క
గంగిగోవుగ మార్పుఁ జెం♦దంగఁ గలదె! ౬౬౬

గీ. విధినెపంబునఁ బాతక ♦ విధులొనర్చు
నట్టివారికిఁ బాపంబు ♦ లంటకున్నె!
స్వాంతమందున నాచార్యు ♦ సంస్మరించి
నిప్పులోఁ జేయిడిన బాధ ♦ తప్పనొక్కొ! ౬౬౭

గీ. ఒరులు ఘనతరకష్టంబు ♦ లొందుచుండఁ
బరిహసింతురు కొందఱు ♦ పాపమతులు;
గడ్డ మదికాలి యొక్కండు ♦ కడుతపింపఁ
జేరి తాఁ జుట్టనిప్పు యా♦చించు నొకఁడు! ౬౬౮

## —♦ స్వార్థత్యాగము ♦—

గీ. ధనము గల్గునాఁడె ♦ త్యాగంబొనర్పంగ
వలయు దాచుకొనిన ♦ నిలువఁబోదు;
చంద్రుఁడదనునందె ♦ చక్కని వెన్నెలఁ
గూర్పుఁగాక దాచు♦కొనునె సుంత! ౬౬౯

గీ. ధనము చన్న పిదప ♦ త్యాగంబొనర్పంగ
మూఢమతులు భావ♦మునఁ దలంతు్రు;
కాంత యౌవనంబు ♦ గడచిపోయిన మీఁదఁ
బరిణయంబుఁ గోర ♦ భావ్యమగునె! ౬౭౦

గీ. ధరణి మానవులకుఁ ♦ ద్యాగంబు లేకున్న
నితర గుణము లెన్ని♦యేని వృథయె;
కోమలాంగియైన ♦ భామ లేకున్నచో
నన్యసుఖములెల్ల ♦ వ్యర్థమెకద! ౬౭౧

గీ. పోగుపడిన ద్రవ్య♦మును సదాకాపాడు
నెల్లయెడలఁ ద్యాగ♦మిది నిజంబు;
చెఱువులోని నీరు ♦ చెడకుండ రక్షించి
నిల ప్రవాహమొకటి♦యే ధ్రువంబు! ౬౭౨

గీ. అరయఁగా స్వల్పధనవంతుఁ ♦ డగునుగాక
త్యాగి యగునేని లోకముం ♦ దనుపఁగలఁడు;
కొలఁది నీరమ్ముఁ గలిగిన ♦ కూపమొకటి
మిగుల జీవులకాధార ♦ మగునుగాదె! ౬౭౩

## స్వార్థపరత్వము

గీ. ధరణిఁ బెక్కుమంది ♦ తమ లాభ మొనఁగూడు
నంతవఱకె పరుల ♦ నాశ్రయింత్రు;
పండ్లతోడ నిండి ♦ యుండునందాక నే
పక్షులెల్లఁ జెట్ల ♦ పైని వ్రాలు. ౬౭౪

గీ. దాత యిచ్చునంత ♦ దనుక గొందఱు జనుల్
పలుకుచుంద్రు మధుర ♦ భాషణముల;
మబ్బు లాకసమున ♦ మలయుచుండెడుదాక
నెమ్మి లఱచుచుండు ♦ సమ్మదమున. ౬౭౫

గీ. జనులు ఘనులను స్వప్రయో ♦ జనము కొఱకె
గౌరవింతురు భక్తిచేఁ ♦ గాదుసుమ్ము;
ఎంచఁగాఁ బాలకొఱకుఁ బో ♦ షింత్రుగాక
ధర్మమునకైన గోవులఁ ♦ దలఁచు నెవఁడు! ౬౭౬

గీ. అనుచితంబగు కార్యంబు ♦ నాచరించి
తనదు కార్యంబు సాధించు ♦ కొనఁగరాదు;
వాలినయ్యెడఁ గపటంబు ♦ వలనఁ ద్రుంచు
కతన రాముఁడు దుష్కీర్తిఁ ♦ గాంచలేదె! ౬౭౭

గీ. అన్యులార్తిఁ జెంద ♦ స్వార్థపరత్వంబుఁ
బూనుచుంట తగదు ♦ మానవునకు;
స్వార్థపరతగాఁదె ♦ చంద్రసూర్యుల రాహు
వెప్పుడును గ్రసింప ♦ నెంచుచుంట! ౬౪౮

గీ. తనువు స్థిరమని పోషించు ♦ జనునిజూచి
పలుమరుఁ మృత్యుదేవత ♦ పరిహసించు;
కొమరునిం దండ్రి ముద్దిడఁ♦గొనుటఁ జూచి
నవ్వుకొనకున్న జారయా ♦ నాతి మదిని! ౬౪౯

గీ. ఎల్లరుం దమసుఖమె భా♦వింత్రుగాని
పరులదుఃఖంబుఁ దలపోయు ♦ వార లరుదు;
ఇల్లు గాలినదని యొక్కఁ ♦ డేడ్చుచుండ
నొకఁడు వాసాలుదూయుచు ♦ నుండుఁగాదె! ౬౫౦

గీ. కూడుదొరకక పేదలు ♦ గోడుచెంద
ధనికుఁ డల వడ్డిడబ్బుఁ దె♦మ్మని విధించు;
తల్లిదండ్రులు చచ్చిన ♦ పిల్లకేడ్వ
కాసుకై బాధపెట్టఁడే♦ కాటి వాఁడు! ౬౫౧

—♦ కార్యసిద్ధి ♦—

గీ. స్థిరతరంబగు యత్నంబు ♦ సేయకున్న
నేపనియుఁ బూర్తిగాఁగ సా♦ధింపరాదు;
అడుసులోపల నాటిన♦యట్టి స్తంభ
ములు చలింపక క్షణమైన ♦ నిలువఁగలవె! ౬౫౨

గీ. గొప్పవారలకేని చే♦కూరకుండు
నట్టి కార్యంబు లోనఁగూర్తు♦రల్పజనులు;
అర్జున కసాధ్యమగు భూగృ♦హంబులోని
యంధకారంబు నొకదివ్వె ♦ యడపకున్నె! ౬౮౩

గీ. అవసరమున సమారబ్ధ♦మైనయట్టి
కార్యములు ఫలవంతముల్ ♦ గాకపోవు;
వేళనెఱిఁగి చేరిన యా వి♦భీషణునకు
రాజ్యలక్ష్మి నొసంగఁడే ♦ రాఘవుండు! ౬౮౪

గీ కార్యసాధన మత్యంత ♦ కష్టతరము
పాడుచేయుట కడు సుల♦భమ్ము సుమ్ము;
ప్రోగుచేసిన యొక వెయ్యి ♦ పుట్లవడ్లు
చెఱచుటకుఁజాలదే యొక్క ♦ చిలుకపురుగు! ౬౮౫

గీ. పూనినట్టి కార్యము సిద్ధిఁ ♦ బొందువఱకు
ధీరవర్యులు విడువంగఁ ♦ బోరుసుమ్ము;
ఘోరకష్టాలకోర్చి భ♦గీరథుండు
గంగనవనికిఁదెచ్చి వి♦ఖ్యాతిఁగనఁడె! ౬౮౬

గీ. కార్యసాధనంబుఁ ♦ గాంక్షించు మనుజుండు
తఱుచుగాఁ బ్రియంబు ♦ నెఱపుచుండు;
గొల్లవాఁడు మేక♦పిల్లలఁ బెంపఁడే
విలువ గలుగునదని ♦ తలఁపువలన! ౬౮౭

గీ. కార్యసిద్ధిని బొందనక్రమముగాని
కృత్రిమోపాయముల నాచరింపవచ్చు;
కపట మానవరూపంబుఁ గాంచినంత
భయముచే లేళ్ళు పొలమునఁ బడకయుండు! ౬౮౮

గీ. అందఱును బ్రయత్న మాచరించినఁ గూడఁ
గొందఱే ఫలంబుఁ బొందుచుంద్రు;
దేవదానవులు మథింపంగ క్షీరాబ్ధి
యమరులకె లభించె నమృతమెల్ల! ౬౮౯

గీ. ఎట్టి కానిపనికి నేని సిద్ధంబౌచుఁ
నెందుఁ గార్యసిద్ధిఁ బొందుచుంద్రు
చక్రధరుఁడు శత్రుసంహార మొనరింప
నిల వరాహరూప మెత్తలేదె! ౬౯౦

## — కార్యహాని —

గీ. సిద్ధమగు కార్యమెల్లైనఁ జెఱుపవచ్చుఁ
జెడిన దానిని మఱి బాగుసేయుటరుదు;
పేరుకొని గడ్డగట్టిన పెరుగుమఱలఁ
బాలుగామారునే యెన్ని పాట్లుపడిన! ౬౯౧

గీ. అరయ శుభముల కాలస్యమగునుగాని
యశుభమగుపని వేవేగ నావహిల్లు;
ఎంతయు విలంబమగుచుండు నిల్లుగట్టఁ
గూలఁదోయంగ క్షణమేని చాలకున్నె! ౬౯౨

గీ. కానిపనికి నెంత♦గాఁ బ్రయత్నించినఁ
గాని సుంత మేలు ♦ గలుగఁబోదు ;
పాండవుల జయింపఁ ♦ బలుపాట్లు పడుటయే
గాక ఫలముగలదె ♦ కౌరవులకు ! ౬౯౩

—♦ స్తుతి ♦—

గీ. సజ్జనులకు గుణము ♦ సహజమైనను గూడ
వినుతిసేయు కొలఁది ♦ వృద్ధిఁబొందు ;
పస సహించినట్టి ♦ రసలేపనంబుచేఁ
గాంచనంబు మిగులఁ ♦ గాంతిఁ గనదె ! ౬౯౪

గీ. ఘనులగుణములఁ బొగడి త♦త్కారణమున
వారి శౌర్యంబుఁ బెంపంగ ♦ వలె నరుండు ;
ఆంజనేయుండు రామకా♦ర్యమున జయము
వడసి ముదమందుట ప్రశంస ♦ వలనఁ గాదె ! ౬౯౫

గీ. తన్ను దా నెన్నుకొన్నచో ♦ నున్నయట్టి
సద్గుణములకుగూడ న♦ష్టంబు గలుగు ;
తనగుణంబుల స్తుతియించు ♦ కొనుటచే య
యాతి స్వర్గపదభ్రష్టు ♦ డగుట వినమె ! ౬౯౬

—♦ నింద ♦—

గీ. తనకు సంబంధులైనను ♦ జనుల నెపుడుఁ
బరుషవాక్యంబు నొకటేని ♦ పలుకరాదు;
అల్లుఁడగు శివు దూషించి ♦ నందువలన
దక్షయజ్ఞంబు సర్వంబు ♦ ధ్వంసమయ్యె ! ౬౯౭

గీ. అధికతరమగు గౌరవం బందినంతఁ
నెప్పుడును బూజ్యులఁ దిరస్కరింపరాదు;
ఋషుల కవమానములఁ బచరించు కతన
నహుషు నింద్రపదంబు వినాశమయ్యె. ౧౯౮

గీ. ఇలను సాధుజనుల నెవ్వరు నిందింతు
రట్టి నింద వారె యనుభవింతురు;
భస్మరాశి నెవరు పైకెగజిమ్మిన
వారి నెత్తిమీద వచ్చిపడదె! ౧౯౯

గీ. నయగతిని వీడి వాడిబాణములఁ బోలఁ
బరుషవాక్యంబు లెన్నఁడుం బలుకరాదు;
వాక్యపారుష్యదోషంబు వలనఁగాదె
కురుకులంబెల్ల దురమునం గూలిపోయె. ౨౦౦

—— భాషణము ——

గీ. మధురమైన వాక్కు మాన్యత్వము ఘటించుఁ
బరుషమైనఁ గూర్చుఁ బరిభవంబు;
కోకిలస్వరంబుఁ గూర్మితో వినువారె
ఖరము కూతవిన్నఁ గసరుచుందురు. ౨౦౧

గీ. అతిమనోహరంబులగు మాటలాడిన
ఘనులుఁగూడ మిగుల గౌరవింతురు;
చిలుక చెప్పు మంచి పలుకులనాలించి
యవని పతులు ముద్దు లాడరొక్కొ! ౨౦౨

గీ. సర్వశాస్త్రములను ♦ జదువునుగాక నో
ర్వొప్పకున్నఁ గీర్తి ♦ వెలయఁబోదు;
గంట నెంత మంచి ♦ కంచుతోఁ జేసిన
ఘనతఁ గనునె నాల్క ♦ గలుగకున్న! ౨౦౩

గీ. సభలయందుఁ బ్రసంగంబు ♦ సలుపకున్నఁ
బండితున కేని గౌరవం ♦ బుండఁబోదు;
కోకిలంబేని గొంతెత్తి ♦ కూయకున్నఁ
బ్రజల మెప్పును సుంతైనఁ ♦ బడయఁగలదె! ౨౦౪

గీ. ఎన్ని కష్టముల స♦హించిన నోరులే
నట్టివాఁడు ఫలము ♦ నందఁబోఁడు;
క్షీరసాగరమునఁ ♦ జెంది రెందఱో మేలు
మందరం బొకింత ♦ పొందెనొక్కొ! ౨౦౫

గీ. పూనినో రెత్తి మాట్లాడ ♦ లేనివాఁడు
ఎల్లశాస్త్రార్థముల నిర్వ♦చింపఁ గలఁడె!
ఇంచుకయు వేడినీళ్ళ స♦హింపలేని
వెలఁది సహగమనంబుఁ గా♦వించునొక్కొ! ౨౦౬

గీ. ప్రియవచస్సులు సంపదల ♦ బెంపుసేయుఁ
బరుషవాక్కులు మిగుల నా♦పదలఁగూర్చు;
చిలుకలకుఁ బండ్లుబెట్టి పో♦షించువారె
కాకిపై రాళ్ళ రువ్వరే ♦ కష్టమనక! ౨౦౭

—♦ ఆ కా ర ము ♦—

గీ. ఆకృతింజూడఁ జక్కఁగా ♦ నమరియున్న
యంతనే స్వభావము మంచి ♦ దనఁగరాదు;
బాణమెంతయుఁ జక్కనై ♦ పరఁగుఁగాక
పరులప్రాణంబు క్షణములోఁ ♦ బాపకున్నె! ౨౦౮

గీ. అరయఁగా నొక్కఁడు కురూపి ♦ యగునుగాక
యతఁడె ఘనకార్యములను జే♦యంగఁగలఁడు;
పీన యొంతేని వక్రితం ♦ బౌనుఁగాక
సంతసమొసంగదే మృదు♦స్వనముచేత! ౨౦౯

గీ. ఆకృతిం గన హ్రస్వమై ♦ యలరుఁగాక
గుణము లతి విశాలంబులై ♦ తనరవచ్చు;
అదితికశ్యపులకుఁ బుట్టి♦నట్టి పొట్టి
వడుగు ఘనశక్తిచే ఖ్యాతి ♦ నడయలేదె! ౨౧౦

గీ. వేషమునఁ బల్లెకోకటిగా ♦ వెలయుచున్న
నందఱకు నొక్కటే శక్తి ♦ యమరఁబోదు;
హంసవలెఁ దెల్లఁగానుండు ♦ నట్టికొంగ
క్షీర నీరంబులను వేఱు ♦ సేయఁగలదె! ౨౧౧

గీ. జనుల కెందేని యాకార ♦ సామ్యముననె
యించుకయు గౌరవంబు ల♦భింపఁబోదు;
ఆకృతిం గోకిలను బోలి♦నంతమాత్రఁ
గాకి రవ్వంతయును మెప్పుఁ♦గాంచఁ గలదె! ౨౧౨

గీ. ఒడ్డు పొడవుగలిగి యున్నంతనేవానిఁ
జేరి వాంఛితంబుఁ గోరరాదు;
చిలుకమిగుల నాస చెంది బూరుగుచెట్టు
చెంతకేగ ఫలమొకింత యున్నె! ౨౧౩

## — జన్మము —

గీ. ఏక గర్భజాతు లేయైనను స్వభావ
మొక్కమాదిరిగనె యుండఁబోదు;
చెలఁగి దానమొసఁగు చింతామణిగుణంబు
కౌస్తుభంబునందుఁ గానఁబడునె! ౨౧౪

గీ. అమిత దుష్టచరితుఁడగువాని కొడుకేని
సుజనవర్యుఁడగుచు శోభఁగాంచు;
కారుచిచ్చువలనఁ గల్గిన ధూమమే
జలదమగుచు మంచి జలమొసంగు! ౨౧౫

గీ. అధిక సచ్చరిత్రుఁడగువాని సుతుఁడేని
మిగుల దుష్టుఁడగుచు మెలఁగుచుండు;
చల్లనైన నీట జనియించు బడబాగ్ని
యమితమైన వేడి నందుఁగాదె! ౨౧౬

గీ. తండ్రి తా లోభచిత్తుఁడై తనరినంతఁ
దనయుఁడును ద్యాగికాఁడని తలఁపఁ జనదు;
ఉదధిరత్నంబుల నొసంగ కుండుఁగాక
కల్పకము దీర్పదే సర్వకామితములు! ౨౧౭

గీ. ఇలఁ బవిత్రాత్ములకె జని♦యించుఁగాక
ఖలుని దుర్బుద్ధి యొక్కింత♦ తొలఁగఁబోదు;
చల్లనగు చందనంబున ♦ జన్మమందు
నగ్ని యుండేని వేడిమి ♦ యడఁగునొక్కొ! ౭౧౮

గీ. ఎట్టి నీచునకేని జ♦న్మించుఁగాక
యొక్కఁడు సద్గుణాఢ్యుఁడై ♦ యుండఁగలఁడు;
పుండరీకంబు బురదలోఁ ♦ బుట్టుఁగాక
బహుసుగంధాఢ్యమై మెప్పు ♦ వడయుఁగాదె! ౭౧౯

గీ. ఘనుని బిడ్డయగుచుఁ ♦ దనరిన మాత్రాన
గుణములేక కీర్తి ♦ నెనయఁబోఁడు;
దీపమందు సూర్య ♦ దీప్తియుండునుగాక
స్వల్పమాత్రమైన ♦ శనికిఁగలఁదె! ౭౨౦

గీ. అల్పునకు జనించి♦నంత మాత్రంబున
నల్పగుణము సుతున ♦ కబ్బఁబోదు;
కుండలోనఁబుట్టి ♦ యుండి యగస్త్యుండు
సప్తసాగరముల ♦ జలముఁ గ్రోలె! ౭౨౧

—♦ కులము ♦—

గీ. గుణములనె యాదరింపఁగఁ ♦ గూడుఁగాని
జాతి నెన్నంగఁదగదు వి♦జ్ఞానులెందు;
ద్రోణిబ్రాహ్మణుఁడయ్యు క్షు♦ద్రతవహించె
శూద్రుఁడయ్యును విదురుండు ♦ శోభఁగాంచె! ౭౨౨

గీ. నిమ్నజాతిచేత ♦ నెగడినఁ సుజనుల
నెంచి బుధులు గౌర♦వింపవలయు;
అమిత నిమ్నతలము♦నందుండు బావినీ
రెల్ల జనుల ప్రీతి ♦ నెనయుఁగాదె! ౭౨౩

గీ. అరయఁగ విశుద్ధవంశంబు♦నందుఁబుట్టి
నట్టివారును దుష్టాత్ము♦లగుచునుండ్రు;
పరమపావనమైనట్టి ♦ పాలవెల్లి
బుట్టియును లక్ష్మితా వక్ర♦బుద్ధిఁ గనదె! ౭౨౪

గీ. గుణము గలవాఁడె పూజఁగై♦కొనునుగాని
ఫలితమును బొందలేఁడొక్క ♦ కులము వలన;
శివుని శిరమున శశి ప్రకా♦శించుచుంట
గుణములేకున్నఁ గల్గునే ♦ కులమువలన! ౭౨౫

—♦ ప్రాయము ♦—

గీ. అమిత తేజస్సమేతుఁడై ♦ యలరువాఁడు
బాలుఁడగుఁగాక రిపులఁ ద్రుం♦పంగఁగలఁడు;
తాటకా సుబాహులఁ జిన్న♦తనమునందె
సంహరింపఁడె రాముఁడు ♦ సాహసమున! ౭౨౬

గీ. ప్రాయము గణింపఁగానేల ♦ బాలునందు
నేని యసమానమగు తేజ ♦ మిమిడియుండు;
కాంచఁగాఁ గొంచెమగునగ్ని ♦ కణమునందు
దాగియుండదె మహితమౌ ♦ దాహశక్తి! ౭౨౭

## నామము

గీ. ఎంతయును నామసామ్య ము♦న్నంతమాత్ర
నల్పుఁడధికునితో సాటి♦యగుటసున్న;
పుడమి ఖద్యోతనామంబుఁ ♦ బూనినంతఁ
బోలునే సూర్యు మిణ్గురు♦పురుగులెల్ల! ౨౨౮

## వార్ధకము

గీ. వయసు మించినట్టి ♦ వారి యందున బుద్ధి
పక్వమగుచు మెప్పు ♦ వడయుచుండు;
జగతి జీర్ణమైన ♦ చందనద్రుమమందె
పరిమళంబు మిగులఁ ♦ బరిఢవిల్లు! ౨౨౯

గీ. వయసుచెల్లు పిదప ♦ వారిజాక్షులు హావ
భావములనుఁ జూప ♦ ఫలముగలదె;
ఆరిపోయియున్న ♦యట్టి దీపమునందు
నెంత నూనెపోయ ♦ నేమిఫలము! 230

గీ. తెల్లఁ(బ)డినట్టి రోమాళి ♦ నెల్లఁగాంచి
వదలి చనుచుండ్రు ముదుసలి ♦ వానిఁదరుణి;
చాల యెముకలుగల్గు చం♦డాలకూప
మును విలోకించి యేహ్యతం♦గనరె జనులు! ౨౩౧

గీ. కంతుబాధాసమేతలౌ ♦ కామినులకు
ముదిమగనికూర్మి కడుదుఃఖ♦మును ఘటించు;
మంచుచేఁ గష్టపడుచుండు ♦ మానవులకుఁ
జంద్రరాక విషాద భా♦జనముగాదె! ౨౩౨

గీ. అతిమలినమై తనర్చు రో♦మాళియెల్ల
మమ్ము నిరసించి తెల్లఁద♦నమ్ముఁ గాంచె
నింక మేమిట నుండుట ♦ యేటికనుచు
దంతములు జారిపోవు వా♦ర్ధకమునందు ! 233

గీ. తలఁపగా వార్ధకంబుచే ♦ దగ్ధమైన
యౌవనము బూదియై దేహ♦మందునిండె
నందుచే రోమములు తెల్ల♦నై తనర్చుఁ
గానిచో నట్లగుట కేమి ♦ కారణంబు ! 234

గీ. పరసతి పరధనవాంఛ ♦ పనికిరాదు
విడువుమని సంతతము ఘోష♦వెట్టుచుండుఁ
బాపమా యమదూతియా ♦ వార్ధకంబు
అటులఁగాకున్న బధిరత్వ♦మంద నేల ! 235

గీ. ఔర ! వృద్ధత్వమహిమ మే♦మనఁగవచ్చు
నరయుఁగా నిత్య ఘోరపా♦పాత్ము నేని
దండధరు, శతమన్యు, గ♦దాధరుం, గు
బేరు, శూలిని గావించుఁ ♦ బ్రేమతోడ ! 236

—♦ కా ల ము ♦—

గీ. ఇపుడు లాఘవము వ♦హించిన మనుజుఁడే
గౌరవంబునొందఁ ♦ గలఁడు రేపు;
పదముచేతఁ ద్రొక్కఁ ♦ బడినట్టి ధూళియే
మరల నెత్తిమీద ♦ మెరయకున్నె ! 237

గీ. మదిఁదలంపఁ గాల♦మహిమచే బలవంతు
లైనవారికేని ♦ హానివచ్చు;
ప్రబలవేగమునను ♦ బరువెత్తు హరిణంబు
లొక్క సమయమందుఁ ♦ జిక్కకున్నె! ౨౩౮

గీ. ఒక్క సమయాన మహనీయు♦లున్నచోట
వేఱొకప్పుడు నీచులు ♦ సేరుచుందు్రు;
కొదమసింగంబులు వసించు ♦ గుహలయందె
నక్కలు చరించుచుండవే ♦ యొక్కవేళ! ౨౩౯

గీ. కఠినమతులేని యొక్కొక్క ♦ కాలమందు
మార్దవముఁ బూనుదురటన్న ♦ మాటనిజము;
చంద్రకిరణంబులు స్పృశించు ♦ సమయమందు
నిందు కాంతరత్నములు ద్ర♦వింపకున్నె! ౨౪౦

గీ. కాలగతి నొక్కయెడ హాని ♦ కలుగుఁగాక
పిదప నొక సమయమున మే♦లొదవఁగలదు;
భాస్కరుఁడు కు్రంకఁగా నెడఁ♦బాసి మరలఁ
గలియవే యుదయమునఁ జ♦క్కవలకవలు! ౨౪౧

గీ. కాలగతిచేత నాపద♦లలుగు నపుడు
ఆప్తులును వానికి సహాయ ♦ మాచరింతు్రు;
కదలఁబోకుండ దూడను ♦ గట్టివేయఁ
దల్లి జంఘయె స్తంభమై ♦ తనరకున్నె! ౨౪౨

గీ. ప్రాజ్యరాజ్యాఢ్యులగు మహా♦ప్రభుల కేని
కాలగతిచే వినాశంబు ♦ గలుగుచుండు;
బాగుగా వెల్గు పెద్దదీ♦పంబు లేని
గాలిచే నారిపోవుటఁ ♦ గలదె వింత! ౭౪౩

గీ. ఒక్కసమయాన మూఢుఁడై ♦ యుండువాఁడె
యున్నతజ్ఞానియగును మ♦ఱొక్కవేళ;
అజ్ఞతనొకప్డు హింసాప♦రాత్ముఁడయ్యె
మేటికవిగాఁడె మఱల వ♦ల్మీకభవుఁడు! ౭౪౪

గీ. ఒక్కతరి సద్గుణాఢ్యుఁడై ♦ యుండువాఁడె
యధిక దుర్గుణ సంయుతుం♦డగు నొకప్డు;
అతి సుగంధసమేతమై♦నట్టి సుమము
కాలవశమున ముఱిఁగ దు♦ర్గంధ మిడదె! ౭౪౫

గీ. అల్పజనులుగూడ ♦ నతికాల పరిణామ
వశత గొప్పతనము ♦ వడయఁగలరు;
పుడమి శుక్తియందుఁ♦బడు వానచిన్కలే
యవల రత్నగరిమ ♦ నందవున్నె! ౭౪౬

గీ. కాంచఁగ శుభాశుభమ్ములౌ ♦ కర్మలెల్ల
నెపుడు ఫలకాలమునకు ని♦రీక్షసేయు;
శాలిసస్యంబు దా శర♦త్సమయమందుఁ
గాక ఫలియించునె వసంత ♦ కాలమందు! ౭౪౭

గీ. జనులకు వినాశకాలంబు ♦ సంభవింప
గరము విపరీతబుద్ధులు ♦ గలుగుచుండు;
చెట్టు చెడునట్టి కాలంబు ♦ చేరువైనఁ
గలుగవే కుక్కమూతి పిం♦దెలు జగాన! ౨౪౮

—♦ అవసరము ♦—

గీ. అవసరంబుగాని ♦ యప్పుడు వల్కు సు
భాషితంబు హాస్య♦భాజనంబు;
ప్రౌఢయైన కాంత♦తోడఁ గూడెడువేళ
వేదమును బఠింప ♦ వెఱ్ఱియనదె! ౨౪౯

గీ, అవసరంబున వచియించు ♦ నట్టివాణి
గుణము లేకుండినను శోభ♦నెనయఁగలదు;
జవ్వనులకును సంభోగ ♦ సమయమందు
భూషణంబుల వీడుటే ♦ భూషణమగు! ౨౫౦

గీ. కడు మనోహరమైన వా♦క్యంబయేని
యసమయమునఁ బ్రకాశంబు ♦ నందఁబోదు
ఘోర రణభూమియందు శృంగారరసము
నెంతనేర్పున వర్ణింప ♦ నేమిఫలము! ౨౫౧

గీ. కఠినమగుఁగాక మధురమౌఁ♦గాక ప్రస్తు
తానుకూలోక్తి యది మనో♦హారి యగును;
వామపార్శ్వంబునను గార్ద♦భంబుగూయఁ
గడుఁ బ్రయాణమ్మునకుఁ బ్రీతి♦గాకయున్నె! ౨౫౨

గీ. అవసరంబుగాని ♦ యట్టికార్యమొనర్ప
సర్వజనులు గేలి ♦ సలుపఁగలరు;
గంజి ద్రావువాని♦కడఁజేరి మీసంబు
లెత్తి పట్టునొక్కొ ♦ యెవ్వఁడేని! ౭౫౩

గీ. అవసరముగాని కార్యంబు ♦ లాచరించు
జనులు దప్పక హాస్యభా♦జను లగుదురు;
ఎందు బలవంతముగఁ బిల్ల ♦ నిత్తుమన్నఁ
గులముగోత్రంబు తగదంచుఁ ♦ బలుకకుంద్రె! ౭౫౪

గీ. అవసరములైన కార్యంబు ♦ లవలఁద్రోసి
యాచరింతురు వ్యర్థకా♦ర్యముల జడులు;
కుంటి గ్రుడ్డి జనుల్ సదా ♦ కూటికేడ్వ
గుడులకు వ్యయంబొనర్పరే ♦ కోట్లధనము! ౭౫౫

♦ సంసారము ♦

గీ. సారమేలేనియట్టి సం♦సారమందు
అత్తవారిల్లు సారమై ♦ యతిశయిల్లు;
శివుఁడు హిమగిరిమీఁదఁ గే♦శవుఁడు పాల
సంద్రమునఁ బవ్వళింపరే ♦ సంతతంబు! ౭౫౬

గీ. ఎపుడు సంసారజలధిఁ జ♦రించువాని
కదియె స్వర్గంబు మోక్షంబు♦నై చెలంగు;
"అగడితంబడి యీదాడు♦నట్టి పిల్లి
కదియె వైకుంఠ" మనెడు సా♦మ్యంబువినమె! ౭౫౭

గీ. అవని సంసారసంబంధి ♦ యైనవాఁడు
మిక్కిలియు జాగరూకుఁడై ♦ మెలఁగవలయు
లోతుగాఁ ద్రవ్వఁబడినట్టి ♦ నూతిచెంత
నున్నవానికి మెలఁకువ ♦ యుండఁదగదె! ౭౫౮

గీ. జ్ఞాని సంసారముననుండఁ ♦ జనునుగాని
జ్ఞానిలో నుండఁదగదు సం♦సారమెపుడు;
పడవ నదియందు నుండఁగా♦వచ్చుఁగాని
పడవలో నదియుండుట ♦ భావ్యమగునె! ౭౫౯

గీ. సంసృతిఁ ద్యజించి ముక్తికై ♦ సాగుకంటె
నిల గృహస్థుండెయగుచు య♦త్నింపమేలు;
చేరి బయలున యుద్ధంబు ♦ సేయుకంటెఁ
గోటలోనుండి పోరఁ జే♦కుఱదె జయము! ౭౬౦

గీ. జగతి దారాసుతాఢ్య సం♦సారమందు
బహుళ మోహవశాత్ముఁడౌ♦వాఁడు చెడును;
అధికపంక విమగ్నమై ♦ నట్టి యేన్గు
ఎంతయును బాధనొంది న♦శింపకున్నె! ౭౬౧

గీ. సారవిరహిత మైన సం♦సారమందు
సుఖము గలదంచు భ్రాంతి నెం♦చుదురు జడులు;
బొటన వ్రేల్ నోటనిడ స్తనం♦బుగఁ దలంచి
అజ్ఞుఁడగు బాలకుఁడు మోద ♦ మందకున్నె ౭౬౨

గీ. అధిక సంసార కష్టంబు ♦ లనుభవించు
చుండియును జ్ఞాని మోక్షంబు ♦ నొందఁదగును;
రంగదుత్తుంగభవ్యత ♦ రంగ జలధి
నీదుచునురత్నములఁబొందు ♦ టెఱుఁగ మొక్కొ! ౭౬౩

గీ. పుడమి సంసారయంత్రానఁ ♦ బడెడు నరులు
పలువిధములైన కష్టముల్ ♦ పడి కృశింత్రు;
అరయఁ దిరుగలిలోఁబడి ♦ నట్టి సకల
ధాన్యములు చూర్ణమగుట త ♦ థ్యంబు గాదె! ౭౬౪

గీ. అధిక దుర్భర సంసార ♦ మందుఁజేరి
యజ్ఞత మెలంగుచో నాశ ♦ మందు నరుఁడు;
ఘోర కాననమున నిద్రఁ ♦ గూర్కువాని
సంపుమై క్రూరమృగము భ ♦ క్షింపకున్నె! ౭౬౫

గీ. బహుళదుఃఖానల ప్రభా ♦ భరిత మగుచు
నెసఁగు సంసారమను వంట ♦ యింటియందు
నవ్యవిషయామృతాది పా ♦ నం బొనర్చ
హృదయమార్జాల! చేరకు ♦ మెన్నఁడేని. ౭౬౬

## —♦ కా మ ము ♦—

గీ. పూనఁగారాదు పరసతీ ♦ భోగవాంఛ
దానిచే నెన్నియో యన ♦ ర్థములుగలుగు;
క్రూరమతియౌచు సీతను ♦ గోరుకతన
రణమున వినాశమొందఁడే ♦ రావణుండు! ౭౬౭

గీ. పదిలపఱచిన పండిత ♦ హృదయ మేని
యనయమును గామవశతఁ బొ♦డగుట నిజము;
బలముగల త్రాళ్ళచేఁ గట్టఁ♦బడిన యెద్దు
పచ్చిగడ్డిని జూచినఁ ♦ బఱ్వులిడదె! ౭౬౮

గీ. ఎంచఁగా నన్యసంతోష ♦ మెఱుఁగనట్టి
జనుఁడు విషయంబె రమణీయ♦మనుచుఁ బలుకు;
ఎన్నఁడును నేతినే చూడ♦కున్న వాఁడు
చెప్పకుండునె నూనెయే ♦ శ్రేష్ఠమనుచు! ౭౬౯

గీ. ఎపుడుఁ గోర్కె లనుభ♦వించుటచే వృద్ధి
యగునుగాని నాశ ♦ మందఁబోవు;
ఆజ్యమిడుచునున్న ♦ నగ్ని హోత్రముచాలఁ
బెఱుగుఁగాక సుంత ♦ తఱుగునొక్కొ! ౭౭౦

గీ. పురుషుఁ డతిసుందరాంగియౌ ♦ తరుణిఁ జేర
నెంతయును హృదయంబు చ♦లింపఁగలదు;
గనగనఁ మండు నిప్పుచెం♦గటను జేర్ప
క్షణములో వెన్నముద్ద దాఁ ♦ గరగకున్నె! ౭౭౧

గీ. అమిత కామపరస్వాంతు♦లైనవారు
అరయ రుచితానుచిత సమా♦యంబులెపుడు;
సీత చెంగటఁ గలదన్న ♦ చింతలేక
శూర్పణఖ రాము నెడ భ్రాంతి♦చూపలేదె! ౭౭౨

గీ. అరయఁగా నెట్టి మహనీయు ♦ లైన నొకట
మన్మథుని బారి కగ్గమౌ ♦ మాట నిజము;
అఖిలలోకేశుఁడైన నా ♦ రాయణుండు
బృందపై భ్రాంతిఁగొని శాప ♦ మొందలేదె ! ౭౭౩

గీ. మదనబాణజర్జరితమౌ ♦ హృదయమందు
నిర్మలంబగు గురుసూక్తి ♦ నిలువఁబోదు;
జల్లెడంబోయుచో నెంత ♦ స్వచ్ఛమైన
నీరమేనియు నొక్కింత ♦ నిల్చునొక్కొ ! ౭౭౪

గీ. పరసతినిఁబొందఁ గక్కుర్తి ♦ పడునుగాని
కాముకుఁడు ధర్మసూత్రముల్ ♦ గాంచఁబోఁడు;
విత్తమార్జించు మార్గమ్ము ♦ వెదకుఁగాని
పూటకూళ్ళమ్మ యెఱుఁగునే ♦ పుణ్యగతులు ! ౭౭౫

గీ. ఎంచగా మహాత్ము ♦ లే యింద్రియముల జ
యింపఁజాల రన్యు ♦ లేమిలెక్క;
ఇలను బెద్దయేన్గు ♦ లే గాలికెగురంగ
నింక దోమలనుచు ♦ నెన్న నేల ! ౭౭౬

గీ. ఘోరతప మాచరించిన ♦ వారినేని
యింద్రియ విజేతలని విశ్వ ♦ సింపరాదు;
ఘనతపోనిష్ఠుఁడైనట్టి ♦ గాధిపట్టి
కౌఁగిలింపఁడె మేనకం ♦ గామవశత ! ౭౭౭

గీ. ఇంద్రియ సుఖంబులు ప్రమోద ♦ మిచ్చు ముందుఁ
బిదప నవియె ప్రమాదంబు ♦ నొదవఁజేయు;
తామరంగోఁకునపుడు సం ♦ తసము గలుగు
నవలమంటలు మిక్కుటం ♦ బగుటఁ గనమె! ౭౭౮

గీ. ఇంద్రియ సుఖంబులెపుడు వాం ♦ ఛించుకతన
శీఘ్రముగ మానవుండు న ♦ శించుచుండు;
మత్స్యమును జిహ్వాచపలత ♦ మాంసమునకు
నాశపడి చావదే గాల ♦ మందుఁ జిక్కి! ౭౭౯

గీ. విషయవాంఛ రవంతేని ♦ వెలయునెడల
సాధకుని సాధనములు నా ♦ శంబుఁగాంచు;
ఒక్కయెడఁ జిన్నదగు బెజ్జ ♦ మున్నయెడలఁ
గడవలోనున్న జలమెల్లఁ ♦ గారిపోదె! ౭౮౦

—♦ క్రోధము ♦—

గీ. క్రోధమవని యందుఁ ♦ గుదురుగాఁ జేరునో
వాని నదియె చంపు ♦ వాస్తవంబు;
కాష్ఠ గర్భమందుఁ ♦ గల యట్టియగ్నియే
యెపుడొ దానిఁ గాల్చు ♦ టెఱుఁగమొక్కొ! ౭౮౧

గీ. క్రోధ రాక్షసునకుఁ ♦ గుంభినిలో నెవ్వఁ
డేని వశ్యుఁడై చ ♦ రింపరాదు;
ప్రబలకోపుఁడగుచు ♦ భ్రాతృ రక్తము ద్రావి
వాయుసుతుఁడు నింద ♦ వడయలేదె! ౭౮౨

గీ. చండ కోపాన్వితాత్ములౌ ♦ జనపతులకు
నుర్వి నాత్మీయుఁడొక్కండు ♦ నుండఁ బోఁడు;
అతులితోజ్జ్వలకీలాయు♦తాగ్ని దన్ను
వెల్గు పోలాతను సైతము ♦ గాల్చు కున్న! ౭౮౩

గీ. మానసంబు మహాక్రోధ♦మయతఁ దనరు
కాలమునఁ జేయరాదెట్టి ♦ కార్యమేని;
గట్టిగా నెల్లెడఁ దుపాను ♦ కొట్టువేళ
సాగరముపైఁ బ్రయాణంబు ♦ సలుపఁదగునె! ౭౮౪

గీ. మనుజు కోపంబు వానిచెం♦తను వసించు
జనులకుం గీడుఁ గలిగింపఁ ♦ జాలియుండు;
ఘనతరంబైన సుడిగాలి♦కసరువలనఁ
జుట్టు ప్రక్కలఁగలచెట్లు ♦ సురిగిపడవె ! ౭౮౫

—♦ మోహము ♦—

గీ. గాఢమైయొప్పు మోహంబు ♦ కతననెవ్రుడు
సతికి లోఁబడి చరియింపఁ ♦ జనదు నరుఁడు;
కైకకు వశీకృతుండైన ♦ కారణమునఁ
దనయుని ద్యజించి చావఁడే ♦ దశరథుండు ! ౭౮౬

గీ. తల్లినేని సుదూరమౌ ♦ స్థలమునందె
యుంచవలయును సజ్జనుం ♦ డొప్పుమీర;
సుతుఁడుగా నెంచఁబడునట్టి ♦ సుమశరుండు
కామితుఁడుగాఁడె శంబర ♦ కాంతచేత ! ౭౮౭

గీ. ఆఁట వెలఁదిమాట యనఁ బూటకంబెయాఁ
గాన నమ్మరాదు మానవుండు;
అతి విరాగియైన యాఋశ్యశృంగుఁడే
వివిధకామభోగ వివశుఁడయ్యె. ౭౫౮

—— మ ద ము ——

గీ. శాస్త్రవిదులేని యొక్కొక్క సమయమందుఁ
గానిపనిసేతు గర్వాహంకార వశత;
సర్వధర్మజ్ఞుఁడగు పరాశరుఁడు మున్ను
గవయఁడే గర్వమున దాశకన్యతోడ! ౭౫౯

గీ. ఎంత బలవంతుఁడేని గర్వింపఁదగదు
వెలయు నాతని నిర్జింప వేఱొకండు;
ఇల మహాబలశాలి యా నేనుగునకు
సింహమది ప్రాణశత్రునై చెలఁగుఁగాదె! ౭౬౦

గీ. ఇలమహాబలుఁ డొక్కండు చెలఁగుచుండ
వాని తలఁదన్నఁగల్గిన వాఁడునుండు;
త్రాఁచు కడు భయంకరముగాఁ దనరుచుండ
దానిభేదింపఁడే గరుత్మంతుఁ డొకఁడు! ౭౬౧

—— మా త్స ర్య ము ——

గీ. క్షమయె మూలంబగును సర్వసంపదలకుఁ
గలహములకెల్ల నీర్ష్యయే కారణంబు;
వెగ్గలంబగు నీర్ష్యచే విప్రశాప
భాజనుండయ్యె నా జనమేజయుండు! ౭౬౨

గీ. కుసుమ కోమలమైన మా♦నసము నెపుడుఁ
జేయఁగారాదు ద్వేషదూ♦షితముగాఁగ;
ద్వేషదోషంబువలననే ♦ దేవదాన
వోత్కరంబెల్ల సంక్షయ ♦ మొందెమున్ను! ౭౯౩

## —♦ వ్యసనము ♦—

గీ. జనులు తాము మద్య♦మును ద్రావు వ్యసనంబు
నందిరేని నాశ♦మొందఁ గలరు;
వినమె మద్యపాన♦మున మున్ను యాదవు
లెల్ల నొక్కయెడ న♦శించిరనుచు! ౭౯౪

గీ. మద్యపానరతుం డెట్టి ♦ మహితుఁడైన
నితరు లాతనిఁ గడు మోస♦గింపఁగలరు;
కచునిజంపి బూడిదఁజేసి ♦ కల్లులోనఁ
గలిపి దనుజులు మున్ను భా♦ర్గవున కిడరె! ౭౯౫

గీ. అమిత పాపమూలంబు హిం♦సాకరంబు
నైన వేటయందలి బుద్ధి ♦ మానవలయు;
పాండు భూనాయకుం డట్టి ♦ వ్యసనముననె
ఘోర శాపంబు వహియించి ♦ కూలె నవని! ౭౯౬

గీ. అవని నొక్కండు పాపకా♦ర్యంబొనర్పఁ
బలువు రా ఫల మనుభవిం♦పంగఁగలరు;
ధర్మజుం డొక్కరుండు జూ♦దంబునాడ
నెందఱో ఘోరకష్టముల్ ♦ పొందవలసె! ౭౯౭

గీ. మహిత తేజస్వియగుఁగాక ♦ మానవుండు
పానరతుఁడైన నెందుకుం ♦ బనికిరాఁడు;
అంబుధిం దాఁగియున్న బడ ♦ బానలంబు
గడ్డిపోచ నేనియుఁ గాల్పఁ ♦ గలుగునొక్కొ! ౨౯౮

## ఉచితము

గీ. ఇతరజనులాచరించు సం ♦ స్తుతులకంటె
సఖుఁడొనర్చు హితోపదే ♦ శంబుమేలు;
అన్యులిడునట్టి పంచభ ♦ క్ష్యముల కంటెఁ
దవిటి రొట్టెయు మేల్గాదె ♦ తల్లియిడిన! ౨౯౯

గీ. ఏపనియు నెమ్మదిగనె సా ♦ ధింపవలయుఁ
గాని వేగిరపడ మేలు ♦ కలుగఁబోదు;
పూటపూటకు నీరెంత ♦ పోయుచున్న
వృక్షము లకాలమున ఫలి ♦ యింపఁగలవె! ౩౦౦

గీ. గొప్పవారలతోడ డీ ♦ కొన్నయప్పు
డపజయము గల్గినను శ్రే ♦ యమై తనర్చు;
అరయఁ గొండలతోడఁ గో ♦ రాము నేన్గు
దంతభంగంబు నెవఁడేని ♦ తలఁచునొక్కొ! ౩౦౧

గీ. యౌవనంబున సోమరి ♦ యై చరించి
ముసలితనమునఁ గూటికై ♦ మూల్గరాదు;
దున్ను రోజుల సందు గొం ♦ దులను దిరిగి
కోయు దినములలోఁ జాలఁ ♦ గుందఁదగునె! ౩౦౨

## —♦ అనుచితము ♦—

గీ. ఆర్జితం బెల్లఁ బరులకు ♦ నప్పగించి
యావలఁ బలుకష్టములఁ బొందు ♦ టనుచితంబు;
ప్రీతి "నడ్డెడు తవ్వెడు ♦ బియ్యమిచ్చి
అమ్మ! నీ ప్రసాదం" బని ♦ యడుగఁ దగునె! ౮౦౩

గీ. అవసరియందునసంభావ్య ♦ మైన విషయ
మెపుడు నెచటను గూడ వ♦చింపరాదు;
రాయినదిదాటుఁ గోఁతులు ♦ రాలుగరఁగఁ
బాడునని పల్కుటది వెఱ్ఱి ♦ పలుకు గాదె! ౮౦౪

గీ. వసుధ నెందేని గడు బల ♦ వంతు తోడఁ
గలహ మొనరింప నెన్నఁడుం ♦ దలఁపరాదు;
కోరియేనుఁగుతోడ డీ ♦ కొన్న యెడలఁ
జావవే యల్పమృగములు ♦ క్షణములోన! ౮౦౫

గీ. ముందు ఘనమైన సంపద ♦ చెందు ననుచు
నున్నదానిని బోఁగొట్టు ♦ టొప్పుగాదు;
కారుకొనుచుండె ననుచు ♦ మేఘములనమ్మి
చెఱువుఁ ద్రెంపిన నొక్కప్పు ♦ చేటుగాదె! ౮౦౬

గీ. ఎపుడు దుర్మార్గులందుఁ జ♦రించు మనుజుఁ
డితరులకు ధర్మములను బో♦ధింపఁ దగదు;
అమ్మకే కూడుబెట్టని ♦ యట్టివాఁడు
తగవు దీర్పంగ వచ్చిన ♦ నగరె జనులు! ౮౦౭

గీ. ఎల్లరకు నీతిబోధఁ గా♦వించువాఁడు
తాను దుర్నీతి పరుఁడౌట ♦ తగవుగాదు;
శ్రమ యనక రేయి రామాయ♦ణమును జెప్పి
పగలుగుళ్లనుబడఁగొట్టఁ ♦ బాడియగునె! ౮౦౮

గీ. మిగులఁగొప్పవాఁడై ♦ యగుఁగాక శత్రువు
నందు నమ్మకంబుఁ ♦ బొందరాదు;
అఖిలదేవ పూజ్యుఁ ♦ డైనట్టి యింద్రుచే
గర్భభేదనంబు ♦ గాదె దితికి! ౮౦౯

గీ. కపట శక్తి మేలు ♦ గావించునని యెంచి
యెపుడు ధైర్యమును వ♦హింపరాదు;
లక్కసొమ్ములెల్ల ♦ నిక్కమైన వటంచుఁ
దలఁచునెడల హాని ♦ గలుగకున్నె! ౮౧౦

గీ. అరయఁగా మంచి కార్యంబు♦నందుఁ గూడ
మితముఁ దప్పినచోఁ గష్ట♦గతులు గలుగు;
అమిత దానంబుఁ గావించి♦నందువలన
నల బలీంద్రుండు భూమిలో ♦ నడఁగిపోఁడె! ౮౧౧

గీ. ఆర్యుల హితోపదేశంబు ♦ నాలకించి
పనులఁ గావింపకుండుట ♦ యనుచితంబు;
విదురుఁడొనరించు హితబోధ ♦ వినని కతన
యుద్ధమునఁ జావఁడొక్కొ దు♦ర్యోధనుండు! ౮౧౨

గీ. ఆయువు స్థిరంబుగానుండ ♦ దనుటతగదు
చేయఁదగుకార్యమును వేగ ♦ చేయవలయు;
రఘువు శిబి రాముఁడును ధర్మ♦రాజు మొదలు
గాఁగల నృపోత్తములు నేఁడు♦గలరె చూడ! ౮౧౩

గీ. అన్నిటి కదృష్టమే హేతు♦వనితలంచి
యత్న మొనరింపకుండుట ♦ యనుచితంబు;
ఎల్లవస్తువుల్ దేవుఁడే ♦ యిచ్చుఁగాక
వండివార్చి ముద్దగఁజేసి ♦ వాతనిడునె! ౮౧౪

—♦ స్వ భా వ ము. ♦—

గీ. దీనులగు వారలెంత ప్రా ♦ ర్థించుచున్న
ఖలులహృదయంబు సుంతయుఁ ♦ గరఁగఁబోదు;
ఎలుక తానెంతబాధతో ♦ నేడ్చుచున్న
విడచునే పిల్లి తనపట్టు ♦ వీసమేని! ౮౧౫

గీ. కష్టమొదవిన సౌఖ్యంబు ♦ గలుగుచున్న
ధీరజనుల స్వభావంబు ♦ మారఁబోదు;
వార్థిబడబాగ్ని వలనఁదా♦పంబు నొంది
గాంగజలమున శైత్యంబుఁ ♦ గాంచునొక్కొ! ౮౧౬

గీ. ఎవరికేది స్వభావమై ♦ యెసఁగుచుండు
నట్టిదానిని దాటంగ ♦ నలవిగాదు;
ఘనతరంబౌ ప్రభుత్వ మి♦చ్చినను గూడఁ
గోర్కెమైఁ గుక్క తాఁ జెప్పు♦గొఱుకకున్నె! ౮౧౭

గీ. ఒకనియందొక్కనికిఁ బ్రేమ ♦ యుండునన్న
నది స్వభావంబెకాని యు♦క్త్యంబుగాదు;
మాలతింగోరుమా యంచు ♦ మధుపమునకు
నెవ్వఁడేనియు ముందు వ♦చించెనొక్కొ! ౮౧౮

గీ! గుణమొకటి గన్పడిన దోష♦గణము నెల్ల
మఱచిపోవుట నైజంబు ♦ మానవులకు;
వలపుఁగొలిపెడు పుష్పముల్ ♦ గలుగుకతన
గణనసేతురె కేతకీ ♦ కంటకముల! ౮౧౯

గీ. అరయఁగా నైజరమ్యమై ♦ నట్టి వస్తు
వితర సంస్కారమును గోర ♦ దెన్నఁడేని;
కఠినమగు సానరాతి సం♦ఘర్షణంబుఁ
బొంద నవసరముండునే ♦ ముత్యమునకు! ౮౨౦

గీ. జన్మచేతఁ గురూపియై ♦ చను నరుండు
మహిత సంపదగల్గినన్ ♦ మారఁబోఁడు:
లలిత లక్ష్మీనివాసమై ♦ వెలయుఁగాక
యందమును బొందఁగలునే ♦ యావుపేడ! ౮౨౧

## ♦ అనుకరణము ♦

గీ. కాంచఁగా లోకులు గతాను♦గతికు లగుచు
సంచరించుచునుందు రీ ♦ జగతియందు;
సతుల, గోవుల, శిశువులఁ ♦ జంపుఁగాక
యతిని బూజింపరే మహా♦న్నతుడటంచు! ౮౨౨

గీ. పండి తాగ్రేసరుండు కా ♦ వ్యము వచింపఁ
బామరులుఁ గూడఁ బ్రీతిమైఁ ♦ బలుకుచుంద్రు;
నట శిఖామణి శివుఁడు తాం ♦ డవమొనర్పఁ
దాండవింపవె భూత భే ♦ తాళములును! ర—౨౩

గీ. ఘనుఁడు తనకంటెఘనులనే ♦ యనుసరించు
నీచజనుల విడంబి ప ♦ నేఁడెపుడు;
సింహము పయోదముట్లు గ ♦ ర్జించుఁగాక
యొక్కమారైనఁ గూయునే ♦ నక్కవోలె! ర—౨౪

గీ. అధికులగువారలే కార్య ♦ మాచరింతు
రట్టిదే చేయుదురు కొంద ♦ రల్పజనులు;
మేటియగు రాజు పెండ్లాము ♦ మేడ నెక్క
కోరికుమ్మరి పెండ్లాము ♦ గుడిసె నెక్కు! ర—౨౫

గీ. గౌరవాధికులైనట్టి ♦ ఘనులఁజూచి
హీనులును వారిఁబోల య ♦ త్నించుచుంద్రు
పులికిఁ గలయట్టిపెద్ద చా ♦ రలనుజూచి
నక్క వాతల నిడుకొను ♦ ఫక్కి వినమొ! ర—౨౬

## —♦ ప్రవర్తనము. ♦—

గీ. నడతవలన మహత్త్వ మే ♦ ర్పడును గాని
కులముచే జన్మచేతను ♦ గలుగఁబోదు;
కుండలోఁ బుట్టి యా యగ ♦ స్త్యుండు లీలఁ
గ్రోలఁగాలేదె యేడు సం ♦ ద్రాలజలము! ర—౨౭

గీ. ఆర్యనిందిత మార్గంబు ♦ నందు మెలఁగు
వారి కెంతయు హాని సే♦కూరఁ గలదు;
అరయఁగా నాఁడు దేవేంద్రు ♦ నంతవాఁడు
భ్రష్టుఁడై పోవడే దుష్ప్ర♦వర్తనమున! ౮-౨౮

గీ. అతులిత జ్ఞాన సంయుతుం ♦ డైన నరుఁడు
సత్ప్రవర్తన నధిక య♦శంబుఁ గాంచు;
సహజ సౌందర్యవతి యైన ♦ చానమిన్న
శుభ్ర వస్త్రంబుచేఁ గదా ♦ శోభఁ గనదె! ౮-౨౯

గీ. సదమల చరిత్రులైనట్టి సత్తములుఁ గూడఁ
బతుల దుర్వృత్తిచే నీతిఁ ♦ బాయుచుంద్రు;
అల మధురవల్లి విష భూరు♦హంబు నల్లు
కొనినఁ జేదును గాంచదే ♦ కొంచెమేని! ౮ 30

గీ. విమలమైన వర్త♦నము గల్గినప్పుడే
ప్రణుతిఁ గాంచు నితర ♦ గుణములెల్ల;
యౌవనాఢ్యయైన ♦ యువతి దాల్చిననాఁడె
భూషణములకెల్లఁ ♦ బోలుపు గలుగు! ౮ 3౧

—♦ సహాయము ♦—

గీ. అరసిచూడ నల్పు ♦ లగువారి సాయంబు
గూడ గొప్పబలముఁ ♦ గూర్పఁ గలదు;
పొట్టువిడి పోయి ♦ నట్టి బియ్యపు గింజ
మొలచునొక్కొ నేలఁ ♦ గలియుఁగాక! ౮ 3౨

గీ. ఎట్టి మానవులకు ♦ నేని సహాయంబు
వలయుఁ గష్టమైన ♦ పనులయందు;
కన్నులున్నవాఁడుఁ ♦ గనునొకో వస్తువుల్
చీకటింట దివ్వె ♦ లేకయున్న ! ౨౩౩

గీ. అరయఁగా నిస్సహాయుఁడై ♦ నట్టి వాని
హీనబలుఁడేని మిగుల బా♦ధింపఁగలఁడు;
కత్తిలేనట్టివానిని ♦ గొఱ్ఱెయైనఁ
గఱచుచుండునటన్న వా♦క్యంబు వినమె! ౨౩౪

గీ. సాయమొసరింప నల్లగు ♦ సంతసింత్రు
కోపగించినచో నూర♦కుండ రెపుడు;
పెట్టినం దినునే గాని ♦ తిట్టునెసలఁ
బడెడువా డుండఁబోఁడన్న ♦ నుడిని వినమె! ౨౩౫

—♦ ప్రేమ ♦—

గీ. అధికసులభమైన ♦ యట్టివస్తువునందు
హెచ్చుప్రేమ జూపు ♦ టెంచ నరిది;
స్వీయసతి నవజ్ఞ ♦ చేసి యెన్నెన్ని యో
పాట్లు పడరె పరుని ♦ భార్యకొఱకు ! ౨౩౬

గీ. జనులు దమకున్నయట్టి యై♦శ్వర్యమెల్లఁ
బ్రేమచేఁ గొడుకులకు స♦మర్పింపరాదు;
రాజ్యము నొసంగి యల ధృత♦రాష్ట్రవిభుఁడు
సుతునిచే గడ్డిపోచగాఁ ♦ జూడఁబడడె! ౨౩౭

గీ. కరుణ కెంతయుఁ బాత్రులు ♦ గానివారి
కెన్ని బాధలుగల్గిన ♦ నెవఁడు దలఁచు?
ఎచ్చటేనియుఁ దనయత్త ♦ చచ్చునప్పు
డించుకయుఁ బ్రేమమైఁ గోడ♦లేడ్చునొక్కొ! ౮౩౮

గీ. రాగ గుణము స్థిరంబై చె♦లంగునేని
యెంతయుం బ్రేమఁ జూపుదు ♦ రెల్లజనులు;
రాగగుణము స్థిరంబై చె♦లంగుకతన
నెల్లరును పిడియమును బ్రే♦మింతురిగాదె! ౮౩౯

గీ. ఇష్టులైన వార ♦ లే తప్పుచేసిన
వారి మీఁది ప్రేమ ♦ వదలఁబోదు;
ఎల్ల దోషములకు ♦ నిల్లైన దేహంబు
పైని గూర్మిసుంత ♦ పాయునొక్కొ! ౮౪౦

గీ. ఇష్టులైన వార ♦ లెట్టి యప్రియమాచ
రించినను నిరాక♦రింపఁ బోరు;
తనదు గృహముఁగాల్చి♦నను లోకమున నెవ్వఁ
డేని యగ్ని నాద♦రింపకున్నె! ౮౪౧

గీ. ఎంత దూరమైన♦నేమి నైజంబైన
ప్రేమ సంతసమును ♦ బెంచుచుండు;
వసుధనుండు కైర ♦ వములకు నిత్యంబు
చంద్రుఁ డధిక ముద మొ♦సంగకున్నె! ౮౪౨

గీ. ప్రీతిగల వారి మాటల ♦ చేత నెట్టి
కఠిన హృదయంబులైనను ♦ కరఁగఁ గలవు;
సూర్యకిరణంబు లిసుమంత ♦ సోకినంతఁ
గరఁగవే వెంటనే సూర్య ♦ కాంతమణులు ! ౮౪౩

గీ. కడుఁ దిరస్కారమునఁ ♦ ద్రుంపఁ బడిన ప్రేమ
మరలఁ జేకూర్ప నెవఁడు స♦మర్థుఁ డగును ?
మహి నెచటనేని పగిలిన ♦ మౌక్తికంబు
లక్కచే నొక్కటిగ చేరి ♦ చక్కఁబడునె ! ౮౪౪

గీ. పుడమిఁ బ్రేమంబుచేఁ గట్టు ♦ వడిన మనుజుఁ
డెందు సద్గుణముల విచా ♦ రింపఁ బోఁడు ;
సకల జనమనోహరమావ♦సంత వేళఁ
దేజరిల్లునె వికసించి ♦ జాజిపూవు ! ౮౪౫

గీ. ఆత్మనించుక ప్రేమ లే♦నట్టివార
లెన్ని మర్యాదలొనరింప ♦ నేమిఫలము ?
జగతి నొందేని యన్న ర♦సంబుకంటె
నాదరణరసమే శ్రేష్ఠ♦మనఁగ వినమె ! ౮౪౬

గీ. హితులు గడు దవ్వునఁ వసి♦యింత్రుగాక
యించుకేనియుఁ బ్రేమ న♦శింపఁ బోదు;
ఆమడలు దూరమగుఁగాక ♦ యంతరంగ
ములకు దూరంబుకలుగునే ♦ తలఁచిచూడ ! ౮౪౭

గీ. అతులితప్రేమ యుక్తుల ♦ కప్పుడప్పుడు
కలహ మొదవిన క్షణమేని ♦ నిలువఁబోదు;
ఆలుమగలందుఁ బోట్లాట ♦ యుద్ధముపయిఁ
బెసరగింజ నిల్చినయంత ♦ వేళగాదె ! ౮౪౮

గీ. పరులు వలుకు దుర్వి♦వాద వాక్యంబేని
యూపునోట నిష్ట♦మైతనర్చు;
అన్యకాష్ఠ జాత♦మగు పొగధూమమై
యగురునందు ధూప♦మగును గాదె ! ౮౪౯

గీ. కరుణగలవారు దుష్టుల ♦ కరణి శత్రు
వుల దోసంగులు మదియందుఁ ♦ దలఁపఁబోరు ;
అబ్జినీ సంగమను దోష♦మాచరించు
భ్రమరమును జంపనెంచునే ♦ భాస్కరుండు ! ౮౫౦

—♦ యౌ వ న ము ♦—

గీ. యౌవనంబుగల్గి ♦ నప్పుడే కాంతల
కెక్కుడాదరము ల♦భించుచుండు;
సద్గుణాఢ్యుఁడైన ♦ చంద్రుతోఁ గూడిన
యట్టి నిశయె శోభ ♦ నందఁగలదు. ౮౫౧

గీ. తలఁప జవ్వనంబు ♦ తొలఁగి పోయినమీదఁ
గామ వికృతి మిగుల ♦ గలుగఁ బోదు;
అఖిలధనము నాశ ♦ మైన పిమ్మటఁ బరి
వార మెచటనుండి ♦ వచ్చిచేరు? ౮౫౨

## —♦ వ్యయము ♦—

గీ. అమితమైన వ్యయము ♦ నాచరించెడువాని
కల్పవ్యయము బాధ ♦ నందఁజేయు;
ఎంచిచూడఁ బెద్ద ♦ యేనుఁగు దాహంబు
చూరు నీళ్లవలనఁ ♦ దీరు నొక్కొ! ౧౫౩

గీ. ఎంతతక్కువ వ్యయముఁగా ♦ వించుచున్నఁ
గోట్లధనమెల్లఁ గ్రమముగాఁ ♦ గూలిపోవు;
దినమునొక్కొక్కరాయిని ♦ దీయుచున్నఁ
దఱుగకుండునొకో పర్వ♦తంబుగూడ! ౧౫౪

గీ. ఆయమున నర్ధ భాగంబు ♦ నైన నిల్వఁ
జేయఁదగు భావిసుఖముఁ గాం♦క్షించు నరుఁడు;
తలఁచి చూడ సమృద్ధిగాఁ ♦ దైలముండు
దీపమేగద బహుకాల ♦ దీప్తిఁ గాంచు! ౧౫౫

## —♦ వ్యర్థము. ♦—

గీ. జగతి ధర్మార్థ కామ మో♦క్షముల నొకటి
యైన లేనట్టి జన్మ ని♦రర్థకంబు;
అరయఁగా మేకమెడను వ్రే♦లాడు చనుల
వలన నిసుమంతయేనియు ♦ ఫలము గలదె! ౧౫౬

గీ. ఫలముగల కార్యమునె చేయ ♦ వలయుఁ గాని
నిష్ఫలంబగు కృత్యంబు ♦ నెరపఁ దగదు;
కోరి తామెంత కష్టించి ♦ కొండమీద
బావి త్రవ్విన నుదకంబుఁ ♦ బడయగలరె! ౧౫౭

గీ. పనికిమాలినట్టి ♦ జనులకు భువిలోనఁ
గఱకుఁ దనము మిగులఁ ♦ గలిగియుండు;
గాలిఁ బీల్చి బ్రదుకు ♦ గడుపు సర్పమునోట
రెండు వాఁడినాల్క ♦ లుండకున్నె! ౮౫౮

గీ. పనికిరాని వస్తు ♦ వునకెట్టి క్రియ యేని
నెరవుచుండుటెల్ల ♦ నిష్ఫలంబు;
ఎంతయేని శ్రమ వ♦హించి బోధించినఁ
జిలుకవోలెఁ గొంగ ♦ పలుకఁ గలదె! ౮౫౯

గీ. వ్యర్థకార్యంబు లొనరించు ♦ నట్టివారు
అన్యజనులందు నవమాన ♦ మందుచుందు్రు;
అద్దమందునఁ గన్పించు♦నట్టి ముడుపుఁ
గాంచనెంచుట నగుబాటు ♦ గాకయున్నె! ౮౬౦

గీ. శబ్దశాస్త్రం బొకింతయుఁ ♦ జదువఁబోక
వ్యర్థవాక్కుల సభమెప్పు ♦ వడయలేరు;
ఎవఁడయినఁ బద్మనాళ తం♦తువులచేతఁ
బెనచి మదగజమును గట్టి♦వేయఁ గలఁడె! ౮౬౧

గీ. ఫలముగల కార్యములనెల్లఁ ♦ బాడుచేసి
హీనకార్యములకు జడుల్ ♦ పూనుకొందు్రు;
నేతి కుండల నన్నింటి ♦ నేలఁబెట్టి
యుట్టిపై వట్టికుండల ♦ బెట్టఁదగునె? ౮౬౨

## —♦ ఉ పా య ము ♦—

గీ. ఘనపరాక్రమ సాధ్యంబు ♦ గానిపనియు
నిల నుపాయంబుచేత సా♦ధింపవచ్చు;
బలముచే సర్వదేవతల్ ♦ గెలువలేని
బలి నడంపఁడె యుక్తిచే ♦ వామనుండు! ౮౬౩

గీ. పరులచేఁ గల్గునిడుములఁ ♦ బాపుకొనఁగఁ
దగిన యాడంబర మొనర్పఁ♦నగు నరుండు;
అరయఁగాఁ గోఱలందీసి♦నట్టి పాముఁ
గడు ఘటాటోపమున భయం♦కరము గాదె? ౮౬౪

గీ. పలువురకసాధ్యమైనట్టి ♦ పని యొకండె
చేయఁగలుగు నుపాయంబు ♦ చేరియున్న;
నదిని దాటంగలేనట్టి ♦ నరుల నెల్ల
గట్టునం జేర్పఁడే యొక్క ♦ కర్ణధారి! ౮౬౫

గీ. అధిక సంకటములుగల్గు ♦ నట్టివేళ
నల్పయుక్తులఁ బూను ట♦ర్హంబుగాదు;
ఫళఫళమటంచుఁ బిడుగులు ♦ పడుచునుండ
గొడుగు నడ్డంబుగానుంచు ♦ కొనుట తగునె! ౮౬౬

## —♦ నై పు ణ్య ము ♦—

గీ. ప్రభువు మంత్రియు నిపుణులై ♦ పరగునెడల
రాజ్యమును సర్వవిధముల ♦ రాణ కెక్కు;
రాజిత సువర్ణమును జాతి♦రత్నములును
గలియుచోఁ గంకణము శోభఁ ♦ గాంచకున్నె! ౮౬౭

గీ. క్రూరకర్ములౌ ఘోర శ♦త్రువులనేని
కుశలురగువారు దమకు లోఁ♦గొనుచునుంద్రు;
తలఁప ముప్పదిరెండు దం♦తములమధ్య
స్వేచ్ఛగా సంచరింపదే ♦ జిహ్వ యెపుడు! ౮౬౮

గీ. ప్రౌఢులగువారు పరుల స్వ♦భావగతుల
నెల్ల నాకారముననె యూ♦హింపఁగలరు;
కంటఁ గనకున్నను గ్రహింపఁ♦గలవు సుమ్ము
తుమ్మెదలు కేతకిని సుగం♦ధమ్ము వలన. ౮౬౯

గీ. ఇంచుక పరీక్షగావించి ♦ రేనినరుని
యెల్ల శక్తులు బుధులు గ్ర♦హింపఁగలరు;
హస్తములతోడనే తూచి ♦ వస్తువులకుఁ
జక్కఁగఁ బ్రమాణమువచింత్రు♦చతురమతులు. ౮౭౦

గీ. పలువు రొకచోట విద్యలం ♦ బడయుచున్న
నొక్కరుండెవ్వడో ప్రౌఢి ♦ నొందగలఁడు;
ఎందఱో ద్రోణు కడనభ్య ♦ సించియుండ
విజయుఁడే చాప విద్యాప్ర ♦ వీణుఁడయ్యె. ౮౭౧

గీ. అరయ నిహమునందుఁ ♦ బరమందు సౌఖ్యంబుఁ
గూర్పఁ జాలునది యె ♦ నేర్పుసుమ్మ;
చక్కఁదనము నిండు ♦ జవ్వనంబును గల్గు
నదియె రమణిగాక ♦ యన్యయగునె! ౮౭౨

## —♦ అ భ్యా స ము ♦—

గీ. అజ్ఞుఁడేని సంతతా♦భ్యాసవశమునఁ
ప్రాజ్ఞతనువహించి ♦ పరగుచుండు;
తాఁటి త్రాఁడ నెపుడు ♦ రాపిడిగలిగినఁ
జట్టు బండనైనఁ ♦ జాఱబడదె! ౮౭౩

గీ. ఎంచిచూడ నెవని ♦ కేది యభ్యాసమో
దాని నెప్పుడేని ♦ మానఁబోఁడు;
ఆడునట్టి కాలు ♦ పాడెడు నోరును
ఒక్కగడియ యూర ♦ కుండఁగలదె! ౮౭౪

గీ. తల్లిచేసిన పనులెల్లఁ ♦ బిల్లగూడఁ
జేయుచుండును లోక ప్ర♦సిద్ధ మిద్ది;
ఆవు చేనిలో మేయుచు♦న్నట్టి వేళ
దూడ గట్టున మేసెడు ♦ జాడగలదె! ౮౭౫

## —♦ శి క్ష . ♦—

గీ. గురువరేణ్యులచే శిక్షఁ ♦ గొన్నయట్టి
ప్రజలకే గొప్పతనము సం♦ప్రాప్త మగును;
సానఁ దీర్చిన రత్నాలె ♦ జగతియందు
రాజుల కిరీటముల♦యందుఁ దేజరిల్లు. ౮౭౬

గీ. పూని గురుఁ డొక్క మార్గంబు ♦ బోధసేయ
శిష్యుఁడు మఱొక్క మార్గంబు ♦ జెందు టరుదు;
ఉర్వియందునవిత్తనం ♦ బొకటి నాట
మొక్క యొందైన వేఱొండు♦ మొలచు నొక్కొ! ౮౭౭

గీ. ఉత్తమోత్తమ శిష్యున ♦ కొసఁగు విద్య
గురువునకు గొప్పకీర్తిఁ జే♦కూర్పఁ గలదు;
అర్జునుని ధనుర్విద్యా మ♦హాత్త్వమునను
ఘనముగ వెలుంగలేదె ద్రో♦ణుని యశంబు! ౧౦౮

—♦ కపటము. ♦—

గీ. కపటమున నెద్దియే నొక ♦ కార్య మొక్కఁ
డాచరించిన నిష్ఫలం ♦ బగుచునుండు;
కపటమున బ్రాహ్మణాకృతిం ♦ గర్ణుఁ డస్త్ర
విద్యనేర్వ నిష్ఫలమౌట ♦ వినమె మున్ను! ౧౦౯

గీ. అప్రియముఁ జేయ నెంచు మా♦యావియుండు
ముందుగా మిక్కిలియుఁ బ్రియం♦బును బొనర్చు;
పూని మృగముల వధియించు ♦ బోయవాఁడు
చెవులకింపుగ గానంబు ♦ సేయకున్నె! ౧౧౦

గీ. కపటభావుల చెంగటఁ ♦ గపటమున నె
మెలఁగకుండినఁ జెడును జ♦మీ నరుండు;
సారకవచంబులేని శ♦రీరమందుఁ
జేరి బాధింపకుండునే ♦ క్రూరశరము! ౧౧౧

గీ. కంచుకాసక్తులును, దుష్ట ♦ కర్మరతులు,
కుటిలగాములు, భోగులు, ♦ క్రూరమతులు,
మంత్రిసాధ్యులునై యొప్పు ♦ మనుజపతులు
సర్పములు నొక్కతెరగతి ♦ జగతియందు! ౧౧౨

## —మాయ—

గీ. అమలహృదయంబుపైఁ బర్వినట్టి మాయ
భగవదుచ్ఛ్వాసమునఁ బటాపంచలగును;
నిర్మలాకాశమునఁ జేరు నిండుమబ్బు
గాలి నడఁగదె పంచబంగాళమగుచు! ౮౮౩

గీ. నిబిడమాయావృతములైన నేత్రములకుఁ
ధర నలభ్యంబు పరమాత్మ దర్శనంబు;
ఎప్పుడును నాచుచేఁ జాలఁగప్పియున్న
నించుకేనియు జలము గన్పించునొకో! ౮౮౪

గీ. అరయ మాయాసమేతుఁడైనట్టి నరుని
వేర్పఱచి చూచు నల తత్త్వవేది యొకఁడే;
పాలను జలంబునుండి వేర్పఱచు విద్య
హంసకేగాక యన్యుల కలవి యగునె! ౮౮౫

గీ. ఈశ్వరుని జేరుమాయ తదీశ్వరునకు
బాధ నిడక లోకము భ్రాంతి పాలుసేయు;
సర్పదంష్ట్రల నుండు విషంబు పరులఁ
జంపుఁగాక సర్పంబులఁ జంపునొకో! ౮౮౬

గీ. మానవుండెంత గొప్పవాఁడైనఁగాని
మాయకు వశంగతుండగు మాట నిజము;
ప్రథితవిజ్ఞానధనుఁడైన రాఘవుండు
వాలి సుగ్రీవుల నెఱుఁగఁ జాలెనొకో! ౮౮౭

గీ. ఈషణత్రితయంబు నా♦శించి ప్రకృతి
బద్ధుఁడై మర్త్యుఁడెందు నా♦శమ్మునందు;
దార పుత్రాదులందలి ♦ కూరిమియె
వలఁదగుల్కొని సుక్కెడే ♦ పావురంబు! ౮౮౮

గీ. అరయఁ దమవారివలన సౌ♦ఖ్యంబు గలుగు
నని తలంచుటయును మాయ♦యనఁగఁ దగును;
పటుతరంబగు గ్రీష్మ తా♦పంబు నడఁపఁ
జాలునే తన నీడ యే♦ జనునకైన! ౮౮౯

## — తృప్తి —

గీ. ఎంత దారిద్ర్యమేని వ♦హించుఁగాఁక
ఆశ సుంతయు లేకున్న ♦ నతఁడు ధనియె;
ముసలియెద్దొక్కటియె ధనం♦బుగఁ జెలంగు
చుండియు శివుఁడు పరమేశ్వ♦రుండు గాఁడె! ౮౯౦

గీ. అధిక సంతుష్ట చిత్తులై♦నట్టివారు
ఉన్న స్వల్పంబుతోఁ దృప్తి ♦ నొందఁ గలరు;
అనుదినముఁ గందమూలాదు♦లను భుజించి
కడపుచుండరె మునివరుల్ ♦ కాలమెల్ల! ౮౯౧

గీ. మహితసంతోష చిత్తులౌ ♦ మానవులకు
సంపదలె తోఁచుచుండును ♦ సర్వదిశల;
పాదరక్షలు గల యట్టి ♦ పాదములకుఁ
బుడమియెల్లఁ జర్మావృతం♦బుగనె తోఁచు. ౮౯౨

గీ. కలిగి నంతటితోఁ దృప్తిఁ ♦ గాంచనట్టి
జను లిలఁ బరాభవంబును ♦ గనుట నిజము;
అన్య పుష్పాసవంబులో ♦ నాస చనక
యబ్జమునఁ జిక్కువడి భృంగ ♦ మడలుఁ గాదె! ౮౯౩

—♦ ఓర్పు ♦—

గీ. ఓర్మి యనెడు ఖడ్గ ♦ మొక్కటి చేతిలోఁ
జేర శత్రు లేమి ♦ చేయఁగలరు;
ఇలఁ దృణంబు లేని ♦ స్థలమునఁబడు నగ్ని
తనకుఁ దానె శాంతి ♦ నెనయుకున్న! ౮౯౪

గీ. విధివశముచే విపత్తు ప్రా♦ప్తించి నపుడు
ఎట్టి ఘనులేని యోర్పు వ♦హింప వలయు;
భవ్య తేజః ప్రభావులౌ ♦ పాండుసుతులు
హీనత విరాటు చెంత స♦హింపరొక్కొ! ౮౯౫

గీ. ఎట్టి కష్టంబులేని స♦హించువారె
యఖిల జనులందు గౌరవ ♦ మందఁగలరు;
రత్నములు సానరాతి ఘ♦ర్షణము నొంది
యంచితంబుగ నిలఁ బ్రకా♦శించుఁ గాదె! ౮౯౬

గీ. ఎపుడు నధిక కష్టముల స♦హించువాఁడు
అల్పమగు బాధ లెక్క సే♦యంగఁ బోఁడు;
దినదినము భార్యచేఁదిట్లు ♦ తినెడు వాఁడు
అన్యు లొక్కింత దూషింప♦నడలు నొక్కొ! ౮౯౭

గీ. అన్యు లెవ్వరేమి ♦ యాచరించినఁ గూడ
క్షమవహించు జ్ఞాన ♦ సంయుతుండు;
శిక్షఁ గర్హుఁడగు ప♦రీక్షితునకుఁ జాల
మేలుఁ గోరఁడే శ♦మీక మౌని ! ౮౯౮

—♦ భ య ము ♦—

గీ. పిఱికివాఁడెప్పుడును దన ♦ పిఱికితనము
వలననే పెక్కుకష్టముల్ ♦ వడయుచుండు;
భయముమై నిప్పుకోడి తాఁ ♦ బరువులెత్తి
శిరము భువిఁ జొన్పి కడుబాధఁ ♦ జెందుఁగాదె! ౮౯౯

గీ. ఎప్పుడేనియుఁ బిఱికి వాఁ♦డించుకంత
కీడుమూడిన గిజగిజ ♦ లాడుచుండు;
మిగుల సూక్ష్మమౌ వాయువు ♦ దగిలినంత
గడగడం గొట్టుకొనకున్నె ♦ గఱిక మొలక ! ౯౦౦

గీ. పిల్లి కనఁబడ మిగుల భీ♦తిల్లు పంద
పోరునే ఢీకొనుచుఁ బెద్ద ♦ పులులతోడ;
దగ్గనంతనె యూడఁగాఁ ♦ దగిన ముక్కు
తుమ్ముచే నూడదను మాట ♦ నమ్మఁదగునె! ౯౦౧

—♦ మా న ము ♦—

గీ. శాత్రవులొనర్చు దుర్మార్గ ♦ సరణి వలన
మహిత విఖ్యాతిఁ గందురు ♦ మానధనులు;
సుదతి నలరావణుఁడు హరిం♦చుటనె గాదె
సేతువునుగట్టి రాముండు♦ చెందె యశము ! ౯౦౨

గీ. మానధనుఁడెట్టి యిడుమ సం॥ప్రాప్తమైన
నధికునేగాని హీనుల ॥ నరయఁబోఁడు;
చాతకంబు పిపాసచేఁ ॥ జచ్చునపుడు
నిందునేగాక యొరులఁ బ్రా॥ర్థించునొక్కొ! ౯౦౩

గీ. మానధనుఁడెప్డు డన్య సం॥గతికొఱకుఁ
బ్రాణముల వీడుటకు నేని ॥ భయముపడఁడు;
చెలఁగి తనవారి నెల్ల ర॥క్షింపఁదలఁచి
చావఁడే యభిమన్యుండు ॥ సంగరమున! ౯౦౪

గీ. అన్యులెన్నని కష్టంబు ॥ లందుచుండ
నెంచును స్వలాభమే మాన॥హీనజనుఁడు;
వజ్రహతిఁగూలి గిరు లెల్ల ॥ బాధ పడగఁ
దొడరి మైనాకుఁడబ్ధిలో ॥ దూఁరలేదె! ౯౦౫

## —॥ సత్యము. ॥—

గీ. ఎట్టి ఘోరకష్టములు ప్రా॥ప్తించుచున్న
వీసమంతయు సత్యంబు ॥ వీడరాదు;
సత్యమును నిల్పుకొన హరి ॥ శ్చంద్రనృపతి
చేయఁడే మున్ను జండాల ॥ సేవనంబు! ౯౦౬

గీ. ధరనెవండేని కార్య సా॥ధనము కొఱకుఁ
దప్పఁగారాదు నిత్య స॥త్యవ్రతంబు;
దాని వీడుట చేతనే ॥ ధర్మరాజు
చూడవలసెను నరకసం॥క్షోభమెల్ల! ౯౦౭

గీ. కోర్కులోసఁగి, యలక్ష్మిని ♦ గూలఁద్రోసి
కీర్తి నిడి, దుష్కృతంబును ♦ గెంటివైచి;
శుభములకుఁదల్లియై యొప్పు ♦ సూనృతమ్ము
దానిఁ జేపట్టుచోఁ గామ♦ధేను వేల! ౯౦౮

## —♦ ధర్మము ♦—

గీ. చదువుగాక సర్వ♦శాస్త్రముల్ ధర్మంబు
నాచరింపకున్న ♦ వ్యర్థమగును;
ఔషధంపు సేవ ♦ నాచరింపక దాని
పేరుచెప్ప వ్యాధి ♦ పీడ నోకొ! ౯౦౯

గీ. తల్లిదండ్రుల కెప్పుడు మో♦దంబుఁ గూర్ప
వలయుఁ గోపంబుఁ గల్గింపఁ ♦ దలఁపరాదు;
పాములన్నియుఁ దల్లి కో♦పంబువలనఁ
గాలవే మున్ను సర్పయా♦గంబునందు! ౯౧౦

గీ. ఎన్నఁడును బెద్దలఁ దిరస్క♦రింపరాదు
వారి శాపంబుఁ దప్పింప ♦ వశము గాదు;
అల్లశృంగిమునీంద్రు కో♦పాగ్ని వలన
మును బరీక్షిత్తు మరణంబు ♦ బొందలేదె! ౯౧౧

గీ. ఆర్యుల హితోపదేశంబు ♦ సవలఁద్రోసి
సంచరించిన నాపదల్ ♦ సంభవించు;
విదురముఖ్యుల హితబోధ ♦ విననికతన
నల్ల కౌరవులును నశి♦యింపలేదె! ౯౧౨

గీ. శత్రుఁ డేని తనదు ♦ సరస కేతెంచిన
నింపుమీర నాద♦రింపవలయు;
తన్ను నఱుకవచ్చి ♦ యున్నవానికిఁగూడఁ
జెట్టు నీడనొసఁగి ♦ సేవఁ జేయు ! ౯౧౩

గీ. జనులు సత్యంబు ధర్మంబు జరుపుచున్న
నవసరములేదు న్యాయాల♦యములతోడ;
అనువగు విహార మాహార ♦ మమరియున్న
నరుగఁ బనియేమి వైద్యాల♦యములకొఱకు? ౯౧౪

గీ. ధర్మమార్గ ప్రవృత్తుఁడై ♦ తనరు వాని
కఖిల జీవులు సాహాయ్య ♦ మాచరించు;
రామునకు సాయ మొనరింప ♦ రావె మున్ను
ఖచర భల్లూక వానర ♦ గణములెల్ల ! ౯౧౫

గీ. సాధుసేవితమగు వేద ♦ శాస్త్ర దిష్ట
మార్గము త్యజింపఁగాఁ రాదు ♦ మానవుండు;
ధర్మమును సత్యమును వీడి ♦ దైత్యులెల్ల
నొక్క మొఁగి సర్వ నాశంబు ♦ నొందరొక్కొ! ౯౧౬

గీ. అన్ని విధముల సంపూర్తి ♦ నందకుండ
నెపుడు నే కార్యమును బ్రక♦టింపరాదు;
పక్వగతి నొందుటకు ముందె ♦ బయటఁబడిన
వినత తనయుఁ డనూరుఁడై ♦ వెతలుపడఁడె? ౯౧౭

## — ♦ ధర్మము ♦ —

గీ. భక్తియో శక్తియో యను♦రక్తియె కల
మనుజులఁ ద్యజింపఁగా రాదు ♦ మానవుండు;
సాధ్వియగు సీతను ద్యజించి ♦ సంతతంబు
ప్రబలదుఃఖంబు నందఁడే ♦ రాఘవుండు! ౯౧౮

గీ. రాత్రులందుఁ జరింపఁగ♦రాదు నరుఁడు
లేని యపరాధములును గ♦ల్పింపఁబడును;
చోరుఁ డను నింద వహియించి ♦ శూల బాధఁ
గనఁడె మాండవ్యమౌనిసం♦క్రందనుండు! ౯౧౯

గీ. పాదముల లెస్సగా శుద్ధి♦పఱచి పిదప
జపతపోహోమ కార్యముల్ ♦ సలుపవలయు;
పాదశౌచవిహీనతం ♦ గాదె మున్ను
నలుని జేర బాధించె శ♦నైశ్చరుండు! ౯౨౦

గీ. అతిథుల కిడంగ మిగిలిన ♦ యట్టి సత్ప
దార్థమె భుజింపవలయు శ్రే♦యోఽభిలాషి;
అర్థికిడక భుజించిన ♦ యఘమువలన
స్వీయమాంసాశనుండయ్యె ♦ శ్వేతుఁ డపుడు. ౯౨౧

గీ. అలసభావంబు రవ్వంత♦యైన లేక
బ్రాహ్మకాలంబుననె నిద్ర ♦ వదలవలయు;
కమలము ప్రభాతవేళ వి♦కాసమొందు
కతన లక్ష్మికి నిలయమై ♦ నుతివహించు. ౯౨౨

గీ. పుడమియందు ధర్మాధర్మము♦లను దేల్ప
నీతిశాలురె తగియుందురు ♦ నిశ్చయముగ;
క్షీరనీరంబులను వేఱు♦చేయ రాజ
హంసకేగాక యితరుల ♦ కలవియగునె! ౯-౨౩

—♦ గురుభక్తి ♦—

గీ. విద్య నభ్యసించు ♦ వేళయందున గురు
భక్తి వినయములను ♦ బడయవలయు;
ఔషధంపు సేవ ♦ నాచరించెడు నప్డు
పథ్యముగఁ జరింప ♦ వలయుఁ గాదె! ౯-౨౪

గీ. సదమలంబౌ గురూపదే♦శంబువలన
జనుల దోషసమూహంబు ♦ సమసిపోవు;
సాంద్ర తేజోయుతుండైన ♦ చంద్రు వలనఁ
బారిపోకున్నె గాఢాంధ ♦ కారమెల్ల! ౯-౨౫

గీ. కలుష హారమైన గురుబోధ ♦ వలనఁగూడ
దుర్జనుల దుష్కృతంబులు ♦ తొలఁగఁబోవు;
శాంతి కారణమై యొప్పు ♦ జలముచేత
నారిపోవునొకో బడ♦బానలంబు! ౯-౨౬

గీ. భక్తితోఁ జేయుచో నెంత♦భవ్యమైన
కార్యమేనియు సాధింపఁ♦గలఁడు నరుఁడు;
పరమగురుభక్తిచే మహో♦త్తరధనుష్క
ళాగరిమ నందఁడే యేక♦లవ్యుఁడపుడు! ౯-౨౭

గీ. అతుల విద్యావినయదాత ♦ యై చెలంగు
గురువరేణ్యుని భక్తితోఁ ♦ గొలువ వలయు;
రాముసేవకు మిగుల హా ♦ ర్షంబుఁగాంచి
గాధిపుత్రుండు దివ్యాస్త్ర ♦ కాండ మొసఁగె. ౯-౨౮

— ♦ దైవభక్తి ♦ —

గీ. ఎన్ని సంకటంబు ♦ లేని కల్గునుగాక
యెపుడు నీశ్వరుని స్మ ♦ రింపవలయు;
అంపశయ్య నున్న ♦ యపుడును భీష్ముఁడు
తనివి దీఱఁ గృష్ణుఁ ♦ దలఁప లేదె! ౯-౨౯

గీ. ఘనతరంబగు సద్భక్తి ♦ గలిగియున్న
మృత్యువునుఁగూడ నరులు జ ♦ యింపగలరు;
కాంక్షతో శంభుఁగొల్చు మృ ♦ కండు సుతుని
మరణ మొందింప యముఁ డస ♦ మర్థుఁ డయ్యె. ౯-౩౦

గీ. వసుధయం దెవ్వఁడేని గ ♦ ర్వము వహించి
యెన్నఁడును దేవుని నిరాక ♦ రింపరాదు;
రాక్షసేశ్వరుఁడైన హి ♦ రణ్యకశిపు
సంహరింపఁడె హరి తిర ♦ స్కారవశత! ౯-౩౧

గీ. ఎంచి పరమేశ్వరుని సమీ ♦ పించుకొలఁది
నతిశయించును మానవు ♦ నందు భక్తి;
చెలఁగి నది సముద్రము చెంతఁ ♦ జేరుకొలఁది
నధికమై యొప్పుచుండదే ♦ యాటు పోటు! ౯-౩౨

గీ. అచ్చమగుభక్తి చేకూర ♦ నంతవఱకు
జనులు శాస్త్రవివాదముల్ ♦ సలుపుచుంద్రు;
అరసి మధువును రుచిచూడ ♦ నంతవఱకుఁ
దివిరి ఝుంకృతి సేయదే ♦ తేనెటీఁగ! ౯౩౩

గీ. ఈశ్వరజ్యోతి యెల్లెడ ♦ నెసఁగుచుండి
భక్తు మదియందుఁ జక్కఁగాఁ ♦ బ్రతిఫలించు;
సూర్యతేజంబు సర్వత్రఁ ♦ జొచ్చుఁగాక
యమిత దీప్తి వహింపదే ♦ యద్దమందు! ౯౩౪

గీ. స్వాంత మిచ్ఛలవీడి ప్ర♦శాంతమైన
కాలమునఁ బరాత్పరుఁడు సా♦క్షాత్కరించు;
గాలివీవక బాగుగా ♦ కలక దేఱి
నపుడు జలమునఁ బ్రతిబింబ♦మరయఁ దగదె! ౯౩౫

గీ. భక్తిఁ బరమేశునామంబు ♦ పలికినంతఁ
బాపసంచయములు పటా♦పంచ లగును;
సూక్ష్మమగు నగ్ని కణమొండు ♦ సోకినంత
బూదిగాకున్నె కొండంత ♦ దూదియేని! ౯౩౬

గీ. భక్తుఁడెపుడు బ్రహ్మానంద ♦ ప్రాప్తికొఱకు
ప్రాణమేని యర్పించు న♦న్యముఁ గనండు;
చక్కెరం జేరి యొక్కప్డు ♦ చచ్చుఁగాక
విడచి చనుటకుఁ దా నిష్ట ♦ పడునె చీమ! ౯౩౭

గీ. వేదశాస్త్ర పురాణాది ♦ విద్యలెల్ల
దైవసంస్మృతిలేక వ్య♦ర్థంబులగును;
వాటమగు విత్తనం బొండు ♦ నాటకున్నఁ
బొలము దున్ని నీర్జల్లిన ♦ ఫలము గలదె! ౯౩౮

గీ. భక్తితోనిచ్చు నే హీన♦వస్తువేని
యొంతయుం బ్రీతిగొనుఁ బర♦మేశ్వరుండు;
అల్ల కన్నప్ప యిడిన మాం♦సాశనంబు
నింపుమైఁ దాను మున్ను భు♦జింపలేదె! ౯౩౯

గీ. ఈశ్వరాకృతి నేవేళ ♦ హృది[illegible]గింప
నట్టి రూపంబె సిద్ధించుఁ ♦ దుట్టతుదకు;
భ్రమరమును గాంచుచున్ భయ♦పడుచు దానిఁ
దలఁచు పురుగున కారూపు ♦ కలుగుఁగాదె! ౯౪౦

గీ. పరమ భక్తాగ్రగణ్యులై ♦ పరగువారు
ఐహికక్రియలను మూఢు♦లట్ల యుంద్రు;
సదమలాముష్మికజ్ఞాని, ♦ జడ భరతుఁడు
అజ్ఞుగతి బూడిదం బొర♦లాడెఁ గాదె! ౯౪౧

గీ. భక్తి యుత్పన్న మగుటకు ♦ భవ్యకులము
ఘనగుణంబు నవశ్యముల్ ♦ గావు సుమ్ము;
హీనకులజాతుఁడై జీవ♦హింస చేయు
తిన్నఁడును భక్తవరుఁడై ప్ర♦తిష్ఠఁ గనఁడె! ౯౪౨

గీ. అధికకష్ట పరంపర ♦ నందినపుడె
నరులలో దైవభక్తి సు♦స్థిరతఁ గాంచు;
తీక్ష్ణతరవహ్నిని బుటంబు♦దీర్పకున్న
శుభ్రమై కాంచనంబెంతు ♦ శోభఁ గనునె! ౯౪౩

గీ. అనయమును భక్తులిడు మొర♦లాలకించి
వారిఁగాపాడుటే భగ♦వంతుని విధి;
ఎంచ నాపన్నుఁడైన గ♦జేంద్రుఁ బ్రోవ
పరమకరుణాళుఁడై హరి ♦ పరువులిడఁడె! ౯౪౪

గీ. అతి తపోబలసంయుక్తు♦లైనవార
లెట్టి కార్యంబులేని సా♦ధింపఁగలరు;
ఘనతర తపోధనుండైన ♦ గాధిసుతుఁడు
సృష్టికింబ్రతి సృష్టిఁగ♦ల్పింపలేదె! ౯౪౫

గీ. శాస్త్రముల నెల్లఁ బూర్తిగాఁ ♦ జదివినంత
నీశ్వరమహత్త్వమును వివ♦రింపలేరు;
కాశికాపుర చిత్రంబుఁ♦గాంచినంతఁ
జెప్పనేర్తురె యచటి వి♦శేషములను! ౯౪౬

గీ. ఇతరులకుఁ జెప్పశాస్త్రంబు ♦ లెన్నొవలయు
ఈశ్వరుని గాంచుటకు నొక్క♦టేనిచాలు;
పరవధకుఁగత్తులు కటార్లు ♦ వలయుఁగాని
చాలదే సూది తన్నుదాఁ ♦ జంపుకొనఁగ! ౯౪౭

గీ. అరయఁ గవివాణిరసయుక్త ♦ మగునుగాక
భగవదభినందనంబుచేఁ♦బ్రణుతిఁగాంచు;
శుక్తి నిజకాంతిచే నెంత ♦ సొంపుఁగనిన
మహిత గౌరవ మొసఁగవే♦మౌక్తికములు! ౯౪౮

గీ. బహుతరాజ్ఞానమునఁ గానఁ♦బడఁడు గాక
యంతమాత్రి దేవుండు లేఁ♦డనఁగఁ జనదు;
ఒక్కపుడు మబ్బుచాటున ♦ నుండుఁగాక
యంతనే భాస్కరుండు లేఁ♦డనగఁ దగునె! ౯౪౯

గీ. తలఁపఁ బరమేశుమీద నా♦ధారపడుచు
మెలఁగు నరున కేహానియుఁ ♦ గలుగఁబోదు;
గిరగిరం గంబముం బట్టి ♦ తిరుగునట్టి
బాలునకు సుంతయేనియు ♦ భయముగలదె! ౯౫౦

గీ. అతులభగవదనుగ్రహం ♦ బమరియున్న
నెట్టి యాపదలేని ♦ బా♦ధింపలేవు;
ఘనుఁడు ప్రహ్లాదుఁడు హిరణ్య♦కశిపుఁ డొసఁగు
కష్టములచేత సుంతైన ♦ గాసిపడెనె! ౯౫౧

గీ. నరకృతంబులు క్షీణతం ♦ బొరయుఁగాక
నిలచు శాశ్వతముగ దైవ ♦ నిర్మితములు;
ఎల్ల పంచాంగములు నశి♦యించుఁ గాక
జారిపోవునె నక్షత్ర♦సంచయంబు! ౯౫౨

—♦ జ్ఞానము ♦—

గీ. లలిత విజ్ఞానమును గాంచ ♦ దలఁచు వాఁడు
మనసున కోసంగవలయు శ్ర♦మంబు కొంత;
నారికేళజలంబు పా♦నం బొనర్ప
నించుకైనను బాధ స♦హింప వలదె! ౯౫౩

గీ. జ్ఞానతేజంబుఁ గాంచిన ♦ క్షణమునందె
సమయఁగలదు చిరంతనా జ్ఞానపటలి;
గదిని నెలకొన్న చిరతర ♦ గాఢతమము
పాయదే తృటినొక్క దీ♦పంబు వలన! ౯౫౪

గీ. అమితమైన సంసారదుః♦ఖము నడంప
శక్తి గల్గిన వస్తువు ♦ జ్ఞాన మొకటె;
ఘోరతరమైన గాఢాంధ ♦ కారమెల్లఁ
బాపఁగాఁ జాలఁడే యొక్క ♦ భాస్కరుండు! ౯౫౫

గీ. జ్ఞాన మొకటిలేని ♦ జనునకు నిల నన్య
విద్య లెన్నియున్న ♦ వృథయసుమ్ము;
ఎన్ని సొమ్ములున్న ♦ నేమి లాభము స్త్రీకిఁ
గంఠ సూత్ర మొకటి ♦ గలుగకున్న! ౯౫౬

గీ. సన్నుతంబైనయట్టి వి♦జ్ఞానపటిమ
యుండని మనుష్యునకు విల్వ♦యుండఁబోదు;
అంకె యొక్కటి లేకుండు ♦ నట్టిచోట
సున్న లెన్నియున్న ఫలంబు ♦ సున్న గాదె! ౯౫౭

గీ. మనసు గడు పరిపాకంబు ♦ నెనయకున్న
జ్ఞానమున సమకూరదు ♦ సంతసంబు;
బహుళ సంభారములు చేర్చి♦వండకున్నఁ
గూరలందును రుచులు సే♦కూరఁగలవె! ౯౫౮

గీ॥ మిగుల విజ్ఞానసహితుఁడై ♦ మెలఁగు నరుని
హృదయమున దుష్టభావముల్ ♦ కుదురుకొనవు;
అధిక జాగ్రత్తతోనుండు ♦ నట్టివాని
యింటిలో దొంగ లెటు ప్రవే♦శింపఁగలరు? ౯౫౯

—♦ బ్రహ్మ జ్ఞానము. ♦—

గీ. బ్రహ్మవిజ్ఞాన తేజంబు ♦ ప్రజ్వలింపఁ
బాసిచను నేను నీవను ♦ భావగతులు;
కప్పూరపుఁ బల్కు పూర్తిగాఁ ♦ గాలుపిదప
నేమియును లేక శూన్యమై♦యెసఁగుఁ గాదె! ౯౬౦

గీ. స్థిరతరంబైన బ్రహ్మత్వ ♦ సిద్ధికలుగ
మనుజ సామాన్య గుణములు ♦ మాసిచనును;
పిందె దైనందినంబుగఁ ♦ బెద్దదైనఁ
బుష్పమున రేకులును రాలి ♦ పోవకున్నె! ౯౬౧

గీ. అరయ బ్రహ్మంబునను లీన ♦ మైన నరున
కదియె సాక్షాత్కరించు బా♦హ్యాంతరముల;
బహుళ జలమున ముంచిన ♦ పాత్రమునకు
వెలుపలను లోపలను నీరు♦ వెలయకున్నె! ౯౬౨

గీ. అందు రెల బ్రహ్మమని పర♦మాత్ముఁడనియు
నొక్క దేవుని; మతములు ♦ పెక్కులగుట;
పనుల భేదంబుచే నొక్క ♦ బ్రాహ్మణుండె
పాచకార్చక నామముల్ ♦ వడయుఁగాదె! ౯౬౩

గీ. ఆకృతి విహీనమైన బ్ర♦హ్మంబె జీవు
లందుఁజేరుచుఁ బలురూపు ♦ లొందుచుండు;
ఎట్టి యాకారమును లేని ♦ యట్టియగ్ని
బొగ్గులం బెక్కురూపముల్ ♦ పొందకున్నె? ౯౬౪

గీ. పరమవిజ్ఞానమునఁ గట్టు ♦ పఱుపకున్న
మదిని దుర్వాంఛలెన్నొని ♦ యొదవుచుండు;
ఏన్గు నంకుశమునను బా♦ధింపకున్న
స్వేచ్ఛగాఁద్రుంచివేయదే ♦ చెట్లనెల్ల! ౯౬౫

గీ. అవ్యయుండగు పరమాత్మ ♦ నరయువఱకు
నరునియందుఁ బశుత్వంబు ♦ వొరసియుండు;
పరుసవేది సంస్పర్శను ♦ బడయువఱకు
నినుము నీచపులోహమై ♦ యెసఁగుఁగాదె! ౯౬౬

గీ. బ్రహ్మవిదులు వసింత్రు ప్ర♦పంచమందు
నాప్రపంచంబు వారల ♦ నంటఁబోదు;
నీటిలోమున్గుచుండును ♦ నీరుగాకి
దానిఱెక్కలు నీటిచేఁ ♦ దడియునొక్కొ! ౯౬౭

గీ. ఆదిలో సాధకుఁడు గష్ట ♦ మందుఁగాక
పిదప శాశ్వత మగు హర్ష ♦ మొదవఁగలదు;
అపుడె పుట్టిన దూడ పా♦రాడుకొనుచుఁ
దడఁబడును గాక తాఁబర్వ ♦ లిడదె పిదప! ౯౬౮

గీ. ఘనతరంబగు సంసార ♦ కష్టమెల్లఁ
బాపుకొనవచ్చు విజ్ఞాన ♦ పటిమచేత;
నిరుపమగభీరతరమహో♦దధి నేని
దాటఁగా రాదె యొకచిన్న ♦ బోటువలన! ౯౬౯

గీ. స్వమత పరమత భేదఁబు ♦ స్వాంతమందుఁ
దలఁపక యథార్థము వచించు ♦ తత్త్వవేత్త;
అరసి తనవారుఁ బెరవార ♦ లనఁగఁబోక
న్యాయము లిఖించుఁ గాదె న్యా♦యాధికారి! ౯౭౦

గీ. అమలినంబైన జ్ఞాన సా♦రమును గోరి
శాశ్వతసుఖంబునందు మో♦క్షాభిలాషి;
ఇమ్ముఁగా జంద్రకిరణ సా♦రమ్ముఁ గోరి
గురుతర ముదంబుఁ గనదె చ♦కోరపక్షి! ౯౭౧

గీ. జ్ఞాని శ్రోత్రాదికముచేత ♦ శబ్దముఖ్య
విషయములఁ బొందినను వెండి ♦ విడచుచుండు;
తన కరమ్ములచే జల♦మ్మును గ్రహించి
పుడమి కొసఁగఁడె మరల నం♦భోజహితుఁడు! ౯౭౨

గీ. అఖిల సుఖదుఃఖచయము దే♦హమును జేరు
నాత్మ నించొక్క టేనియు ♦ నంటఁబోదు;
చంద్రకళలకె వృద్ధియు ♦ క్షయముగాని
యెప్పుడేనియు నవి చంద్రు♦ నెనయునొక్కొ! ౯౭౩

గీ. బ్రహ్మమునుగాంచి మోదంబు ♦ వడయువాఁడు
సంతసింపఁడు తుచ్ఛ సం♦సారమునకు;
ఇంపయిన మేడమీఁద వ♦సించువాఁడు
కోరునే చేరుటకుఁ బెంట♦కుప్పమీఁద! ౯౭౪

## — వైరాగ్యము —

గీ. వాసనాబంధవర్గ మె♦వ్వానికేని
తొలఁగఁబోదు వైరాగ్యంబు ♦ కలుగకున్న;
కర్ణధారుండులేక యు♦గ్రప్రభంజ
నమును దప్పించుకొనునె యే♦నావయైన! ౯౭౫

గీ. ఎంతయుఁ దపించి యాశీవి♦షింజయించు
వాఁడె ఘనశక్తియుక్తుఁడై ♦ క్రాలునంద్రు;
ఎన్నఁగారాని యాశన్ జ♦యించువాని
నేమని నుతింపవలయునో ♦ యెఱుకపడదు! ౯౭౬

గీ. అన్నిశక్తులుడిగి♦నప్పుడు వైరాగ్య
మందుచుంట గొప్ప♦యనఁగరాదు;
యౌవనాంతమున మ♦హాసాధ్వి ధర్మముల్
పలికి వేశ్యకీర్తి ♦ వడయఁగలదె! ౯౭౭

### —♦ అ తి ప రి చ య ము ♦—

గీ. చిరము పరిచయంబు♦చేత నెంతటిగొప్ప
వారికేని గౌర♦వంబు తఱుగు;
మలయగిరి కిరాతు ♦ లలఁ జందనపుఁగొయ్య
వంట చెఱకుఁ జేసి ♦ వాడుకొనరె! ౯౭౮

గీ. చెంతనున్న వార ♦ లెంతటిఘనులైన
గౌరవింపఁబోరు ♦ వారి నెవరు;
కడుఁ బవిత్రమైన ♦ గంగకుఁ దీరస్థు
లెవ్వరేని మ్రొక్కు ♦ లిడుదురొక్కొ! ౯౭౯

గీ. ఎల్లరును క్రొత్తఁదనము వాం♦ఛింత్రుగాన
నమిత పరిచయమున మాన♦హానిగలుగు;
విదియ చంద్రుని గడు గౌర♦వింత్రుగాక
యెంతయును బూర్ణచంద్రు భా♦వింతురొక్కొ! ౯౮౦

గీ. పూర్వ పరిచితులందుఁ బ్రే♦ముడిని వీడి
యెప్పుడును క్రొత్తవారిఁ గాం♦క్షించుజగము;
బహుళ మకరంద మొక్క పు♦ష్పమునఁ గలుగఁ
బలు సుమంబులపైఁ దేటి♦ వ్రాలకున్న! ౯౮౧

### —♦ వి శ్వా స ము ♦—

గీ. ఆకృతింగని వీరు భ♦వ్యాత్ములనుచు
నమ్ముచోఁగొన్ని యెడల మో♦సమ్ము గలుగు;
ఏన్గు దామ్రింగి మరలఁ ద్య♦జించినట్టి
వెలగ కాయలచే సుంత ♦ ఫలముగలదె! ౯౮౨

గీ. ఎల్లజనులును మానవు ♦ లేయటంచుఁ
జిత్తమునవమ్మి స్నేహంబు ♦ చేయరాదు;
పులుల యందును గలఁడు దే♦వుండటంచుఁ
జెంతకుం జేరు నెడల హిం♦సింపకున్నె! ౯౮౩

గీ. పనికిమాలిన డంబముల్ ♦ పలికినంత
నెవ్వఁడును లోకమున విశ్వ♦సింపఁబోఁడు;
"ఏటియావలి ముత్యముల్ ♦ తాటికాయ
లంత" యన నమ్మనొక్క మూ♦ఢాత్ముఁడేని! ౯౮౪

## —♦ ప్రకీర్ణకము ♦—

గీ. జ్ఞాన విద్యా తపశ్శీల ♦ దానధర్మ
గుణవిహీనుల మానవు ♦ లనఁగరాదు;
నరకలోకానఁ దగిన స్థా♦నములు లేక
జగతిఁ జరియించు నరరూప♦మృగములవియె! ౯౮౫

గీ. అరయఁగా "నాస్తి" యనెడు రెం♦డక్షరములు
ప్రాగ్భవంబునఁ బల్కిన ♦ పాపమునకుఁ.
గ్రమముగా "దేహి" యను నక్ష♦రద్వయంబు
శిక్షయైయొప్పు నిందులోఁ ♦ జిత్రమేమి? ౯౮౬

గీ. "భిక్ష పెట్టుఁడు పెట్టుఁడు ♦ భిక్ష" యనుచుఁ
నఱచుచుండుట యది యాచ్ఞ♦యనఁగరాదు;
పెట్టకున్న మాగతి మీకుఁ ♦ బట్టుననుచు
జ్ఞానమొసఁగు మహోపదే♦శమ్ము సుమ్ము! ౯౮౭